ఓమ్

# బ్రహ్మర్షి

## రఘుపతి వేంకటరత్నము నాయుడుగారి జీవితచరిత్ర.

గ్రంథకర్త:

కోటిపల్లి సూర్యనారాయణ

కార్యదర్శి:
కాకినాడ బ్రాహ్మసమాజము.

ప్రకాశకులు:

జి. గోపాలమ్

ఎడ్యుకేషనల్ పబ్లిషర్, కాకినాడ.

 [మూల్యము: 3-8-0

ఓమ్

# కృతిసమర్పణము

---

అనాథనాథుఁడు, విద్యావేత్త, భక్తశిఖామణి,

నా జీవనధ్రువతార

మా పెదనాన్న

## బ్రహ్మర్షి వేంకటరత్నము

జనకులై, దేశికులై, ఆచార్యులై

అనవరతము

ఏ మహా సంస్థల నిరంతరాభివృద్ధికై

ఏకైకదీక్షతో కృషి సల్పిరో

అట్టి

మాతృమందిరము, సుమవాటి, ప్రార్థనావేది నాఁబరఁగు

శరణాలయ ('Nursery')

కళాశాలా ('Rosary')

బ్రహ్మమందిరము ('Sanctuary')

లందు పెరిగి పెద్దనై, విద్యాబుద్ధులు గఱచి సేవచేయుచున్న

నేను

ఆ దివ్య పవిత్ర సంస్థలకు

గౌరవపురస్సరముగా నా యీ చిన్నపొత్తమును

సమర్పించుచున్నాను.

— సూర్యనారాయణ.




బ్రహ్మర్షి రఘుపతి వేంకటరత్నము నాయఁడు.

# మున్నుడి.

జగదీశ్వరుఁ డార్తత్రాణపరాయణుఁడు. శిలాంతర్గత జీవియైన దర్దురమునకు సయిత మాశిలయందే యాహారము సొంపుగఁ గూర్చినాఁడు. నావంటి యగతికుని మాత్ర మాశ్రయ హీనునిగఁ జేయునా ? ఆ భగవానుఁడు దన బాంధవులగు శ్రీశ్రీ పీఠికాపురాధీశుల హృదయమును ద్రవీభూత మొనర్చి కాకినాడపురమున "అనాథశరణాలయము"ను నెలకొలిపినాఁడు. ఆ మహాభవనమునఁ బెరిగి పెద్దనైన యదృష్టవంతులలో నే నొక్కరుఁడను. వారి యాదరౌదార్యములచేతనే కాలేజీయందు విద్యసాగించి, మదరాసున కేఁగి వృత్తివిద్య నభ్యసించి, వారి కళాశాలలోనే సుమా రిరువదేండ్లనుండి యుద్యోగమునుఁ జేయుచున్నాఁడను. శ్రీ వారికిఁ జిరకృతజ్ఞుఁడను.

బ్రహ్మర్షి మా పెదనాయన. చిఱుతప్రాయమునుండి వారి ప్రేమానురాగములఁ జూఱగొన్న యదృష్టవంతులలో నే నొక్కరుఁడను. 1936 లో ఆంధ్రాయూనివర్సిటీ కమిషను కాకినాడకాలేజీని సందర్శింపవచ్చినది. ధీశాలి కట్టమంచి రామలింగారెడ్డిగారు కాలేజీనంతనుఁ జూచి కళాశాలాపురోభివృద్ధి కారకులగు బ్రహ్మర్షి వారి చిత్రపటము లేనందుకుఁ దమవిచారమును వెల్లడింపఁగా బ్రహ్మర్షి చిత్రపటమునుఁ జిత్రింపఁజేసి 1937 లో డాక్టరు రెడ్డిగా రార్ట్సు కాలేజీభవనములను దెఱచుటకు వచ్చినప్పుడు వారి పవిత్రహస్తములచేత దచ్చిత్రపటావిష్కరణ

మహోత్సవము దివ్యముగా జరిపించితిని. సోదరుఁడు 'హరి' కోరికపై మా పెదనాన్న చిత్రపటమును రామమోహనలాడ్జికి బహూకరించితిని. బ్రహ్మర్షి మా పెదనాన్న బ్రహ్మైక్యమొందిన మొనిమిదవసంవత్సరమున వారిశిలాప్రతిమను మామాతృమందిరమగు శరణాలయమున కొసఁగి ధన్యుఁడనైతిని. అప్పుడే పదియవయేడే తెంచినది. వారి యాశయములు శాశ్వతములైన సంస్థలుగా స్థాపింపబడినను నాంధ్రప్రజానీకము వారిని విస్మరించినది. 1949 లో సోదరసమాజసభ్యుల సహకారముతో కార్యదర్శినైన నేను 'స్మరణదీపిక' మూలమున వారి చిత్రపటమును ముద్రింపించిఁ బంచిపెట్టితిని.

పుష్కరము గతించినది. కాని వారి జీవితచరిత్రను గూర్చి రచించినవారు లేకుండిరి. ఆవేదనతో హృదయము దహింపఁజొచ్చినది. నా యింటనున్న వారిచిత్తరువునకు చరణసన్నిధిని రేయుంబవళ్ళు తదేకదీక్షతోఁగూర్చుండి దీనిని వ్రాయఁగలిగితిని. వారి దివ్యస్మరణోత్సవమున, 26-5-1951 తేదీని వారి యమర జీవితగాథను, ప్రార్థనానంతరముఁ జదివి వారి కత్యంతప్రేమాస్పదములైన దివ్యసంస్థలకే యీ చిఱుకబ్బము నంకిత మొనర్చినాఁడను.

నా యీకృతిని నా హృద్భాండమున నణచి దాఁచికొన్న కృతజ్ఞతాభావప్రేరణమువలననే రచించితిని. భాషాపరిజ్ఞానమందుఁగాని, కవితాకౌశలమందుగాని నాయశక్తిని నేను మఱుగుపఱుపఁజాలను. కేవలము భావోద్రేకముతో గావించిన నా యీసాహసమునకు దజ్ఞులు నన్ను మన్నింతురుగాక !

అడిగినదే తడవుగ నాయందాదరము చూపి దీనికిఁ బరిచయవాక్యములు వ్రాసిన బ్రహ్మర్షి శిష్యాగ్రగణ్యులు డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారికి నాకృతజ్ఞతాభివందనములు. నాశిష్యత్వమును బురస్కరించుకొని నాకావ్యకన్నియకనురూపములైన నక్కిసేత లమరించి తమ ప్రచురణములం దొకయుచితస్థానమొసంగి తరుణమున దీని వెలువరించిన శ్రీ జమ్మలమడక గోపాలముగారికి నా నమస్సులు. నా కిట్టి ప్రేరణమును గల్గించిన భగవానున కివే నా నమోవాకములు.

—సూర్యనారాయణ.

# పీఠిక

ఏ ఊళ్ళోనైనా పంతులుగారు, పంతులుగారంటే ఒక్కరే ఆ పంతులుగారు. వారికే రూఢినామము అది. రాజమండ్రంలో న్యాపతి సుబ్బారావుపంతులుగారికి, కాకినాడలో గంజాం వేంకట రత్నంగారికి, తరువాత తరువాత దురుశేటి శేషగిరిరావుగారికి, ఏలూరులో మోచర్ల రామచంద్రరావుగారికి ఈ నామము రూఢి అయింది. అదేప్రకారం బందరులో నాయుడుగారు. నాయుడుగారంటే ఆర్. వేంకటరత్నం నాయుడుగారికి రూఢ మయింది. బయటపూళ్ళల్లోను, సభలలోను ఆర్. వేంకటరత్నం నాయుడుగారు M. A. L. T. అని పూర్తిపేరు వాడుకలో నుం డేది. కాని రఘుపతి వేంకట రత్నంనాయుడుగారంటే ఎవరికీ తెలిసేదికాదు.

నాయుడుగారివంటి మహనీయుల జీవితచరిత్రను గ్రంథ కర్తగారువ్రాసి, నన్ను పీఠికవ్రాయమనికోరితే నాకు నాయుడు గారియందుండే భక్తి చనువునుబట్టియేమి, నాయెడల వారికి ఉంటూండే అపేక్షనుబట్టియేమి, నేను వీరికోరికను ఉపేక్షింప జాలక వెంటనే ఈ నాలుగుపంక్తులు వ్రాయబూనితిని. పీఠికలు ఉపోద్ఘాతములు పెద్దలసుభాషితములును వ్రాయునపుడు కొంత వరకు వ్రాసే వారి జీవితచరిత్రము అనే పిల్లకాలువ ఆమహానదిలో కలియు సందర్భములనుగూర్చి చెప్పకతప్పదు. అనగా అలంకా రనులు, వ్యంగ్యములు, వదలిపేస్తే, నాయుడుగారి జీవితచరి

త్రతో పాటు నా అల్పచరిత్రకు గలిగిన అన్వయము సూచింపక తప్పదు. ఈక్షమాపణతో ఈపదిపుటలు నింపుతున్నాను.

నాకు 15 ఏళ్ళువయస్సు అప్పుడేనిండినది. బందరు F.A. చదువుకు వెళ్ళాను. నాయుడుగారిపేరు అదివరకేవిని, బందరు నిర్ణయించుకోవడానికి కారణముకూడా ఇతరకారణములతో పాటు నాయుడుగారు English Poetry Shakespeare చెప్తారు అన్నమాటే. వెళ్ళితిమి. చూస్తిమి. పర్వతమంతమనిషి. స్ఫురద్రూపి. తురకలాగు. తురక అంగరఖ. తురకపాగా వెనక మూరెడు జానెడుతోక. కాటుకకళ్ళు. విశాలమైననుదురు.గంగిరెద్దుమెడవంటిమెడ. గడ్డంకిింద రెండవగడ్డం. చెవికింది వరకు పుస్తీలు. చూచినరూపు మరుపుకురాదుగదా ! నిరంతరము కళ్ళఎదుట కనుపిస్తూ ఒకవిధమయిన ప్రపంచ కాతీతమగుదృశ్యమును, సృష్టికర్తయొక్క రచనావిశేషమును చూస్తున్నామా అనిపించేది.

నేను చిన్నపిల్లవాణ్ని. ముఖంపాలోడుతూ ఉండేది అనిస్నేహితులు అనుకుంటూంటే వింటూంటిని. నాయుడుగారు అప్పుడప్పుడువచ్చి బుజముపైచెయ్యివేసి, ముద్దుపెట్టుకుంటున్నారా అనేటంతవరకు ముఖమును అంటి చనువు ఇచ్చుచుండెడివారు. 'అయితే బాగా చదువుతున్నావా ? మీటింగులుకు వస్తూండడమేనా?'' అని ఆప్యాయంగా అడుగుతుండేవారు. ఆ యోజానబాహువు ముందర నేనొక టంగణాగావుంటూండడంచేత, నన్ను "పొట్టి" అని పిలవడం నాపేర

ఆయన యావజ్జీవము వ్రాసే ఉత్తరాలలో "My dear Potti" అని ఉపక్రమించడం ఎన్నటికి మరువజాలను. కాని నా F.A. పరీక్ష 1897 (Dec) లో జరిగినపిమ్మట, ఇంటికివెళ్ళి, ఫలితము తెలుసుకొని, తిరిగి బందరువెళ్ళగా, శ్రీనాయుడుగారు, నన్ను ప్రక్కను నిలబెట్టుకుని, 'అరే, పొట్టి పొడుగు అయినావే నెల్లాళ్ళలో" అంటూ కొలతవేసి, నాభుజాలదగ్గరకు వస్తున్నావే' అన్నారు. అల్లాగే ఎదుగుతారండి పిల్లలూ" అన్నారు. ఇందుకు ఆయన రెండర్థాలుతీసి, "శరీరములోను, విద్యావ్యాసంగములలోను కూడాను" అని సూచించారు.

ఒకరోజు వారిబసకు సమీపంలోనే వున్న నాగదిలోకి వచ్చి 'ఏం! తొట్టిపడవ తోసేస్తావా' అన్నారు. అంటే F.A. పరీక్ష ప్యాసుఅవుతావా అని వారి సూచన. "తొట్టిపడవ ఏమండి-రాధారిబోటు కూడా తోసేస్తానండి" అని తళుకు బెళుకు లేకుండా జవాబుచెప్పాను. అంటే ప్యాసేకాదు, మొదటి తరగతిలో అనినా అర్థము. "హాం" అన్నారు, సంతోషించారు. చివరకు First Class లో ప్యాసు అయి Christian College Scholarship పోటీ పరీక్షలో గెలుపొందినప్పుడు ఆయన సంతోషము అపరిమితము అని చెప్పకతప్పదు.

క్లాసులో వీరికి లోకాభిరామాయణము జరుపుట అలవాటు. సంవత్సరంపొడూగున కథలు,గాథలు anecdotes, Fables చెప్పి కాలక్షేపంచేసేఅభ్యాసముండుటవల్ల Fee Scholarshipపొంది, ఉచితముగ చదువుకొనుచున్న నావంటి పేదవిద్యార్థి పరీక్ష

యందు తప్పిపోతే జీతానికి, పుస్తకాలికి డబ్బుయిచ్చేవారు ఎవరున్నారు? కాబట్టి ఒకరోజున Paradise Lost Book II పాఠం చెప్పవలసి ఉండగా గంటలో 56 నిమిషములయినవి. అప్పుడు నేను లేచి "అయ్యా, ఇంక నాలుగునిమిషములుంది గంట కొట్టడానికి. 4 పంక్తులయినా కాలేదండి" అన్నాను. నాకు ఒకరు చెప్పిపెట్టిన మాటకాదు. నా ఆతురత నాది. అంటే అప్పుడు నాయుడుగారు అన్నారుగదా "Ah, here is a Laputan Flapper' దీనిమీద ఈమాటల అర్థంకోసం ఆ నాలుగునిమిషములు వ్యయమయినాయి. ఆయన 56 నిమిషాలు, నేను 4 నిమిషాలు ఖర్చుపెట్టి గంటకాలయాపన చేసినాము.

1896-97 ఈ రెండు సంవత్సరాలూ నాయుడుగారి శుశ్రూష లభించింది. హాస్టలుకు ఆయనయే అధ్యక్షులుగ నున్నదోషంచే చేతిచొంరు భాగవతం జరుపవలసివచ్చేది. డబ్బు లేదన్నప్పుడల్లా తాను జేబులోంచి డబ్బుతీసి ఇచ్చేవారు. ఆ రోజులలో రూ 150 లంటే ఇప్పుడు 750 రూపాయలన్న మాట. పిల్లలు ఇబ్బందిపడడము సుతరాము ఆయనకు ఇష్టం లేదు.

ఈ రెండేండ్లలోను వీరి పాఠములకన్న, కాలేజి బయట సభలు, ఉపన్యాసములు, ప్రార్థనలు, వాగ్వాదములు, అల్పాహారవిందులు, వీటిద్వారా నాయుడుగారికిని విద్యార్థులకున్ను, మధ్యచనువు, చమత్కృ, సద్భోధ, వాగ్పారిశుద్ధ్యము, నీతి ప్రవ

ర్తనమున్న గుణవిశేషములు పెంపొందుచుండెడిని. ఒకరోజు టెన్నిసు ఆడుతూంటే Principal అయిన Clarke దొర Professor అయిన పెక్ దొర అవతలవైపున; నాయుడు గారు Ross పిళ్ళగారు ఇవతలవైపున ఆడుతూంటే, బంతి అవతలనుంచి ఇవతలకు వేసేటప్పటికి నాయుడుగారు "Oh, I was not prepared" అన్నారు. అంటే అవతలనుంచి వెంటనే దిద్దుబాటు వచ్చింది. "You mean, you were not ready, Nayudu garu" అన్నారు. అప్పుడు నాలుక కొరుక్కుని ముఖం చిన్నపుచ్చుకొని "మనము ఎన్నాళ్ళు ఇంగ్లీషు చదువుకున్నా ఇంతేసుమా. ఈ రోజున వీళ్ళచేత దిద్దించుకోవలసి వచ్చింది. మన ఖర్మం" అన్నారు.

ప్రతిరోజు ప్రతిగంట టైము తప్పకడా నాయుడు గారు కాలేజీకి, క్లాసులకు రావడము. ఒకరోజున క్లాసుకు ఆలస్యముగా వస్తే Clarke దొర తన Watch తీసి నాయుడు గారికి చూపించగా ఏదో క్షమాపణ చెప్పారు కాని, బ్రతుకంతా మాత్రము కాలనియమమునకు కట్టుబడకుండానే జరిగింది. ప్రయాణాల కాలస్యం, మీటింగుల కాలస్యం, క్లాసుల కాలస్యం, సకాలమునకు ఎన్నడైనా వచ్చారో ఆ రోజున వడగళ్ళవాన కురిసిందే అనుకోండి.

భాగీసుబ్రహ్మణ్యం అనే ఒక మెట్రిక్యులేషను విద్యార్థి 1895 వ సం॥లో వీరివద్ద చదువుకుంటూండెను. ఇతను Preliminary పరీక్షలో తప్పిపోవుటచే, పెద్దపరీక్షకు ఇతనిని

పంపలేదు. 1896 జనవరిలో నేను కూర్చున్న F. A. Junior తరగతిలో ఇతనుకూడా కూర్చునియుంట నాయుడుగారుచూచి అచ్చెరువునొంది "నీవు ఏమిటి ఇక్కడకొచ్చావు." "అవునండి నేను Matric పరీక్ష ప్యాసుఅయి ఇక్కడకు వచ్చానండి" అన్నాడు. జరిగింది ఏమిటనగా మేనేజరు ఇతని దరఖాస్తును క్లార్కుద్వార చేత కాగితాలవరుసలో కలిపి సంతకంచేయించాడు. పరీక్షలో ఉత్తీర్ణుడయినాడు. పరీక్షలంటే ఇట్టివేగదా !

నేను బందరు వదలి B. A. క్లాసులకు చెన్నపట్నం వెళ్లిన తరువాత అనగా 1898 వ సంllలో నాయుడుగారు హఠాత్తుగ బందరులో పనికి రాజీనామా ఇవ్వడం తటస్థించింది. బందరు క్రిస్తానీ మతంలోకి హిందూమహమ్మదీయ బాలురు కలవడంకు ప్రసిద్ధికెక్కింది. నేను F. A. కు బందరువెళ్ళుతానంటే, మా అమ్మ, ఇందుకనే ఒప్పుకున్నదికాదు. ఓరుగంటి శివరామకృష్ణమ్మగారు, చేవెంద్ర వేంకటాచలంపంతులుగారు, మల్లాది వెంకటరత్నం పంతులుగారు, వడ్లమన్నాటి వెంకయ్యగారు, ధన్వాడ అనంతంగారు, గానుగపాటి కాంతయ్యగారు, Jani Ali M. A. గారు, బోడి సీనయ్యపంతులుగారు, సముద్రయ్యగారు, ఈ మొదలయినవారందరు 1860 లో మతము స్వీకరించారు. శివరామకృష్ణమ్మగారి కుమార్తెలిరువురు M. A. ప్యాసు అయినారు. పెద్దామె కమలకృష్ణమ్మగారు Prof. Sathianadhan యొక్క ద్వితీయభార్య. వీరిసంతతివారే శ్రీ Sathianadhan I. C. S. గారు. ఈ సంప్రదాయమును గలిగియున్న బందరు

పట్టణంలో 1895 లో నాథావధ్యుల నాగభూషణం అను బి.ఏ. విద్యార్థితప్ప చెప్పదగిన మతపుమార్పు లేమీ లేకపోవుట చూచి Rev. G. S. Eddy గారు క్లార్కు–దొరను పిలిచి సమాధానమడిగి, నాయుడుగారి బ్రహ్మసమాజమే క్రైస్తవమత గమ్యస్థానమునకు అడ్డు అని నచ్చచెప్పారు. "ఏల? పిల్లవాళ్ళకు కానలసిన సంస్కారణాలన్ని బ్రహ్మసమాజము అంగీకరించుచు సంఘభ్రష్టతలేకుండా వారిని హిందూసంఘమునందు వెలి లేకుండా ఉండడము సహింపబడుచున్నది. కావున ఈయనను వెంటనే తొలగించవలె" నని, సలహా ఇచ్చెను. ఈసంగతులు నాయుడుగారికి తెలియగానే, తాను తనపదవికి రాజీనామా నిచ్చిరి. సికిందాబాదులో మహబూబ్ కాలేజీ అనువ్యంగ్యార్థమునిచ్చు High School కు Principal అయిరి. ఇక్కడ ఆరుసంవత్సరముల వనవాసమయిన తరువాత కాకినాడ కాలేజీ అధ్యక్షతలభించెను. ఈపదవి వీరికెట్లులభించెనో తెలుసుకోదగిన విషయము.

నా వివాహము 1898 లో జరిగింది. శ్రీ గంజాం వెంకటరత్నంగారి కుమార్తెనిచ్చి నాకు వివాహముచేసిరి. ఈయనకు నేనంటే అత్యంతగౌరవము. అపేక్ష ఎందుకనగా మొదటలో తనకుమార్తెను ఒక డిప్యూటికలెక్టరుగారి కుమారునకియ్య నిశ్చయించి రు 2000 బహుమతులు ముందుగానే సమర్పించిరి. కాని ఒకరోజు వీరు నాటకమునకు పోగా కాబోయే అల్లుడు 'ఆడవేషం' వేయడంచూచి, విసిగి, మరునాడు ఆ సంబంధం

రిజిష్టరీ ఉత్తరంమూలంగా రద్దుచేసుకొని, దేశంలోకల్లా పేద పిల్లవాడికి ఇచ్చి వివాహంచేస్తానని నిశ్చయించుకుని, నన్ను కనిపెట్టారు. ప్రతివిషయంలోను నన్ను సంప్రదించేవారు. నాకే సిగ్గుగుతూండేది. ఆయన శాసనసభలో సభ్యులు. నేను బి. ఏ. క్లాసువిద్యార్థిని ఆయెను. 1904 వ సంవత్సరము P.R. College అధ్యక్షపదవిలో నున్న వేంకటేశ్వర అయ్యరుగారికి కమిటీవారు నోటీసు ఇయ్యగా, మేమందరము నాయుడుగారిని దరఖాస్తు పెట్టమంటే ఆయనకు ధర్మసందేహము గలిగెను. "ఒకరినోటి అన్నముతీసివేసేకమిటీక్రిందమనము ఏలాగు నౌకరీచేయడమా" అని. అయితే దీనికిసమాధానము, నేనున్ను, అవతల శ్రీ వీరేశలింగంపంతులుగారున్ను ఒక్కమాటే, ఒకేవిధమున ఇచ్చితిమి. అంతట నాయుడుగారు దరఖాస్తుపెట్టిరి. దరఖాస్తులోమాత్రం ఒకవ్యంగ్యమయిన వాక్యముగలదు. "I am taking History and English for the highest classes in this Institution" అనివ్రాయగా కమిటీమెంబర్లు అందరికిసహజముగ F.A. Class లకు అని అర్థము స్ఫురించింది. University Calendar తీసి Mahaboob College కొఱకు వెతుకగా అది ఎక్కడాకనుపించ లేదు. అప్పుడు మెంబర్లుకు సమాధానముగ, ఈకాలేజీ నిజాం డొమినియనులో నుండుటచే Calendar లో లేదని జవాబు చెప్పగా వారునమ్మిరి.

ఇంతేకాదు. కాకినాడ అంతా రెండుతెగలుగ, విభజింపబడ్డది. పేరాజుపంతులుగారికి, రాజమండ్రిలోనున్న సుబ్బా

రావుపంతులుగారికి సుతరాము నాయుడుగారు రావడము ఇష్టములేదు. వీరు బ్రాహ్మణేతరపక్షపాతులని, బ్రహ్మసమాజవాదులు అని ఆక్షేపణచేసినారు. మా మామగారుకూడా ఈ సందేహమే చూపుతే నేను, అట్టి దురభిప్రాయమును నివారించి, వారిచేత వప్పించితిని. ఫలితం, చిరకాలం స్నేహంగా వున్న గంజాం వేంకటరత్నంగారు, పేరాజుగారు అభిప్రాయభేదమునుగలవారైరి. పేరాజుగారు, సుబ్బారావుపంతులుగారు శ్రీనివాసశాస్త్రిగారిని అభిమానించిరి. మా మామగారు, పిఠాపురంరాజాగారి కేసులోపనిచేసి, రాజమండ్రిం జిల్లాకోర్టులో ఇప్పుడు మహారాజుగానున్నవారు, మైనరుగానుండి, ఓడిపోయినపుడు, కలెక్టరు "కమ్మింగు" వద్దకువెళ్ళి, "మైనరును మా స్వాధీనంచెయ్యండి" అనిఅడిగి మైనరుపింతల్లి చల్లాయమ్మారావుగారి ఆదరణతో వీరికేసు హైకోర్టుకు Privy Council కు తీసుకువెళ్ళి, జమీందారీ వీరికై ఖాయం చేయించినవారు. అప్పుడు మైన రగు పిఠాపురం రాజావారు పట్టంలో Newington Institute లో ఉంటూండేవారు. వారి అభిప్రాయం పడికట్టురాయివలెపనిచేస్తుందని అందరూ ఎరుగుదురు. వీరి పెద్దవకీలుభాష్యం అయ్యంగారు. అయ్యంగారిచేత మైనరుకు చెప్పిస్తారని వదంతికలిగింది. "Beware of minor being influenced by Bhashyam Iyangar" అని మా మామగారు ఎల్లుండి ఓటింగు అనగా నాకు తంతినిచ్చిరి. అదిపట్టుకొని శ్రీ మొక్కపాటి సుబ్బారాయుడువద్దకు నేనువెళ్ళి, ఒకవేళ

Bhasyam ayangar శనివారం కభురంపితే, సోమవారంచూచే యేర్పాటుచేయించమని నేను యిచ్చినసలహామీద సుబ్బారాయుడు ఆప్రకారమే తంతునడిపెను. ఈలోపుగ ఆదివారం వోటింగు కాకినాడలో జరుగుతుంది. ఆప్రకారమే తంతిరావడము, సోమవారం చూడడం, Bhasyam Iyengar శ్రీనివాస శాస్త్రిగారిపక్షము వహించడము "అయ్యో, నిన్ననే Voting అయిందండీ" అని మైనరుగారు జబాబుచెప్పడం తటస్థించింది. నాయుడుగారికెక్కువ వోట్లువచ్చినవి. గదపగదపాతిరిగి,కోవల్లి హనుమంతరావుగారు, పిల్లలమర్రి ఆంజనేయులుగారు, నేనుచేసిన కృషి ఫలించినది.

నాయుడుగారు, బందరు వదలినప్పటినుండీ, ఏటేట వేసవి శలవులలో చెన్నపట్నం వెళ్ళేఅలవాటు. తమ్ముడు వెంకయ్యగారు (R.Venkayya Bros) అనేపేరట పెద్ద Photographic Studio ను Mount Road లో జరుపుతూండే వారు.



మేము బందరులో నున్నప్పుడు నాయుడు గారి కుమార్తెకు 10 యేండ్లయినా లేవు. ఎక్కువ గారాబంగా పెంచారు. వయస్సు వచ్చినతరువాత వివాహం చేయబూని, వరునికొఱకు ప్రయత్నిస్తుండగా అయిదో సంవత్సరం, అనగా ఆఖరుసంవత్సరం, M. B. C. M క్లాసులో చదువుతున్న వేణుగోపాల నాయుడు. B. A. గారి పేరు నేనుసూచించితిని. వీరు లింగ బలిజీలు. నాయుడుగారి శాఖకంటె గొప్పశాఖ. అయితే

ఇతనిభార్య చిన్నతనములోనే పోయింది. ద్వితీయము. నేను నాయుడుగారి పేర వ్రాశాను. "మీకు ద్వితీయ మని ఆక్షేపణ ఉండునేమో, బాల్యంలోపోయింది. భార్యాభర్తలు ఒకరి నొకరు ఎరుగరు" అని. అందుకు బదులుగ, నాయుడుగారిట్లు వ్రాసిరి. "my principle of monogamy, like that other priniciple of Vegetarianism is one I impose upon myself and however much I would like to see it practised by others, I cannot object if others dont abide by it." ఇందువల్ల నాకు ధైర్యముగలిగి, ఈ సంబంధము చేయక తప్పదంటిని. కాని కొంతకాలమైన తరువాత నాయుడు గారు, నాస్నేహితులగు C. V. Ramachari గారి పేరట ఒక కార్డువ్రాసి "Tell Pattabhi that Caste is in superable." ఈ ఉత్తరం అందిన అనంతరం, మామూలు వేసంగిశెలవులకు నాయుడు గారు పట్నంరాగా, Broadway లో Brougham లో మేమిద్దరము వెళ్ళుచుండగా నేను తాచుపాములాగ లేచి, ఆకార్డులో వ్రాసిన భావమును ఖండించితిని. నావయస్సు 22 సంవత్సరములు. వారి వయస్సు 40 దాటింది. పాపం ఏమిఅనకుండా వూరుకున్నారు. అప్పటికి నాకు ప్రాజ్ఞ వచ్చి "నాహద్దు మీరుతున్నానా" అని సందేహించితిని.

నాయుడు గారు University Examiner అయినారు. Matriculation కు Paraphrase and Composition పేపర్లు దిద్దేవారు. అయితే వేళకు పనిపూర్తిచేయడం అలవాటు

లేదుగా. మేమే చివరలోజులలో దిద్దుతూండేవాళ్ళము. నేను, మొక్కపాటి సుబ్బారాయుడు, C. V. Ramachari. అందరిలోను కఠినం సుబ్బారాయుడిది. అందరిలోను బాహుళ్యం నాది. మొత్తంమీద ఏలాగో చివరరోజుకు మార్కులపట్టీ వెళ్ళేది.

వీరు సికింద్రాబాదు వెళ్ళేరోజులలోనే Madras University Registrar పదవిఖాళీపడ్డది. అప్పటి రిజిష్ట్రారు European. Chloral Hydras అను విషంతాగి, నిద్రపోయిన వాడు పక్కలోంచి లేవనేలేదు. నాయుడు గారు దరఖాస్తు పెట్టారు. Dr. Miller ఒప్పుకోలేదు. "నీవు Educationist గానే ఉండవలె" నని వ్రాశారు. బందరులో వీరున్న కాలంలో కూడ వల్లూరు ఎస్టేటు మేనేజరు పదవికి దరఖాస్తు పెట్టినారు. అపనీ కాలేదు. నేనుమాత్రం ఆక్షేపించుతుండేవాడను.

1917 వ సం॥ 1 Feb. మాసంలో Justice Party ఆరంభమైంది. అప్పటినుంచి వీరి అభిమానము ఆపార్టీ వైపు మొగ్గుతూండేది. క్రమంగా, పానుగల్లు రాజావారి అనుగ్రహమునకు పాత్రులై వీరి Conference లను ప్రారంభించునప్పుడెల్ల ప్రార్థనలకు నాయుడు గారు ఆహ్వానింపబడేవారు. చివరకు Madras University Vice Chancellor అయినారు. ఆపదవి ముగిసినపిమ్మట నేను వీరినిచూచుటకు పిఠాపురం వెళ్ళితిని. అంతకుపూర్వము 5, 6 సంవత్సరాలుగ వీరిని చూడ

డము తగ్గిపోయింది. ఏలయన అంతవరకు లోపలికిబోయే అల వాటు, క్రమముగ సింహద్వారము మూయడం, తలుపు కొట్టడం, 20, 25 నిమిషాలవరకు పిలుపురావకపోడం తటస్థించింది. అంతటితో వెళ్లడం మానివేసినాను. పిఠాపురంవెళ్ళడం వారి కోరికమీదనే వెళ్ళితిని. Car కూడా పంపారు. ఆయన మనస్సులో కొండంత విచారమున్నట్లు స్పష్టమయింది. "ఇన్నేళ్ళుపనిచేశానుగాని, ఏచిన్న సంస్కరణ గావింపలేక పోయినాను.

(1) రిజిష్ట్రారుపని ఖాళీవస్తే England లో Advertise చెయ్యవద్దుఅన్నాను. ఒప్పుకోలేదు Maephael.

(2) University డబ్బు మన Madras Cental Urban Bank లో వేయమన్నాను. ఒప్పుకోలేదు.

(3) University Text books మనమే అచ్చువేయించిఅమ్ముదామన్నాను. ఒప్పుకోలేదు. ఇందుమూలంగా మనకు కొన్ని వేలరూపాయలలాభము పోగొట్టుకున్నాము. ఈదొరలు తమదేశపులాభమే చూచుకుంటారుగాని మనదేశపులాభము చూడరు". అన్నారు. "నాయుడుగారూ, ఇన్ని సంవత్సరాలబట్టీ మేము మొత్తుకుంటూన్నమాట అదేగదాండి. మీకు Dr. Miller ఆయన మేనల్లుళ్ళు Russel & Maephael గార్లు God-Holy ghost and Christ ల వలె కనుపించారు. పోనీండి. ఇప్పటికైనా తమకు యదార్థము తెలిసిందిగదా అన్నాను. "ఆ తెలిసింది" అన్నారు.

నాయుడుగారు సంస్కరణప్రియులయినప్పటికి చిన్నపిల్ల హిందూ మతాచారములకు విరుద్ధముగనడవడం వీరికిగిట్టదు. నేను F. A. క్లాసులో నుండగా, ఎవరో "మన పట్టాభి, జంఝ్యం తీసి వేస్తాడండి. తండ్రి తద్దినం పెట్టడు" అని కాలేజీకి వెళ్ళేమార్గంలో నామీంద చాడీచెప్పతే, నన్నుపిలిచి "నిజమే నా" అని అడిగిమందలించేవారు. కాలేజీ విద్యార్థు లెవ్వరు విధవావివాహం చేసికొనడం వీరి కిష్టముండేదికాదు.

అట్లుగాచేసికొన్న కోకా సుబ్బారావు నాయుడుగారు బందరులో 1896_97 లో Gymnastic Teacher గా నుండి, పిమ్మట Secunderabad కు Goods master గా వెళ్ళారు. నాయుడుగారు పిఠాపురం రాజావారి ఆదరణపొందిన తరువాత "మన సుబ్బారావు నాయుడును ఆప్రకారం వదిలి ఉపేక్ష చేయుట ధర్మంగాదని నేను పదేపదేచెప్పేవాడిని. తుదకు ఇతనిని Kanghi Superintendent గా పిలిపించారు. తరువాత తన శక్తి సామర్థ్యములవల్ల Dewan అయినారు.

మొట్టమొదట శ్రీపిఠాపురం రాజావారు రాజ్యానికి రాగానే నాయుడు గారు మొక్కపాటి సుబ్బారాయుడిని Private Secretary గా ఏర్పాటుచేసినారు అప్పుడే 1906-07 లో నన్ను రాజావారికి Doctor గా రావలసిందని చాలా బలవంతం చేశారు. కాని నేనందుకు ఒప్పుకోలేదు. మామామ గారికి తెలిపాను ఈ సంగతి. అప్పుడు ఆయనవ్రాసిన జాబు

ఇంకా జ్ఞాపకంఉన్నది: "I hear you are making good, from the testimony of Sri Rao Bahadur Puranam Venkatappayya Pantulu garu. You are well situated where you are. Your object must be to become the first citizen of your place. Zamindari Service is the last choice that I would recommend. The meanest Kasa can undo the fate of the tallest man in the Estate."

ఇంకొక్క మాటచెప్పి ముగిస్తాను. వేసంగి శెలవులలో నాయుడు గారు మద్రాసువెళ్ళే ఆచారమంటినే, 1903 లో ఆయన పొన్నూరి Station వద్ద నలుగురు ఆడపిల్లలను, ముష్టిఎత్తుకునే వాళ్ళను చూచి, నాతో చెప్పారుగదా, "ఈ పిల్లలవయస్సు 11 మొదలు 3 వరకున్నది. వీళ్ళు ఇక్కడుంటే చెడిపోతారు. వీళ్ళను మనంబాగుచెయ్యాలి"అని. వెంటనే నేను మొక్కపాటి సుబ్బారాయుడు పొన్నూరి వెళ్ళాము. పిల్లలు వస్తామన్నారు. ఈమాట తెలిపి, తరువాత వారం మళ్ళీ పొన్నూరివెళ్ళి వాళ్ళను తీసుకురాబోతుండగా, అక్కడి Porters అడ్డంవచ్చి అభ్యంతరపెట్టారు. అంతట మేము అక్కడి Police man ను తీసుకొని magistrate గారి వద్దకు వెళ్ళి సంగతి అంతాచెప్పగా, ఆయన, అదృష్టవశమున నాయుడు గారిని ఎరిగిఉన్నవారగుటచే మాకు అనుమతి ఇచ్చారు. ఈనలుగురే పెద్దవాళ్ళయినారు. పెద్ద అమ్మాయి Post Master ను, రెండవ అమ్మాయి Co-operative Assistant Registrar ను పెళ్ళిచేసికొన్నారు. మూడవ అమ్మాయి మొక్కపాటి సుబ్బారాయుని మేనళ్ళుడును చేసుకొంది. నాల్గవ అమ్మాయి సత్తి

రాజు శేషగిరిరావు అను B. A. B. L. ను చేసికొన్నది. ఈ నలుగురు మాలపిల్లలు. తరువాత ఇరువురు క్రైస్తవులయినారు. ఇరువురు బ్రహ్మసమాజములోనే నున్నారు.

నాయుడు గారు Secunderabad వెళ్ళినతరువాత అక్కడ రాజాబహదూర్ మొదలియారు గారను వకీలు వీరికి స్నేహితులయినారు. ఒకనాడు వారికి ఉత్తరం వ్రాస్తూంటే వెనుకనుంచి నేను చూస్తున్నాను. "I am cutting some new teeth, but not of wisdom.''Pattabhi is eavesdropping from behind the Chair and he adds ''Too old for that'' and "I endorse it." అని వ్రాసి అపరిమితంగా సంతోషించారు.

ఆంధ్ర దేశమున కంతకును నాయుడు గారు మార్గదర్శి. సాంఘిక పారిశుద్ధ్యమను విత్తనమును దేశమందంతట వెదజల్లారు. అవన్ని మొక్కలు మొలచి పంట నిచ్చినవి. వీరు జాతీయనిర్మాతయని చెప్పుటకు ఇంచుకైన సందేహము వలదు.

గ్రంథకర్తగారు నాకు పరిచితులు గారు. కాని విన్నపుస్తకం రాగానే సాంతముగాచదివి, ఈ రోజున పీఠిక వ్రాశాను. పుస్తకము ప్రౌఢభాషలో వ్రాయబడ్డది. నేను బజారుభాషలో పీఠిక వ్రాశాను. ఈ పుస్తకము ఆంధ్రదేశమునందు వేలకొలది వ్యాపింపగలదని నమ్మకము.

19 Canning Lane
New DELHI
15-6-1951

భోగరాజు పట్టాభి సీతారామయ్య.

# విషయసూచిక.

---

విషయము : ... పుట

" A great man is a gift of God."

—*Carlyle.*

మత్కర్మ కృ న్మత్పరమో
మద్భక్త స్సంగవర్జితః
నిర్వైర స్సర్వభూతేషు
య స్సమామేతి పాండవ.

" ఎవ్వఁడు సమస్తభూతములయందు వైరభావమును విడిచి, సమబుద్ధితో మెలంగునో, అట్టి నన్నారాధించు భక్తుఁడు కర్మయోగాచరణచే నిహసుఖముల నంది, నన్నుఁ జేరఁగలఁడు."

భగవద్గీత ౧౦ అ. ౫౫ శ్లో.

" Every life is a gospel of God."

—*Brahmarshi.*

ఓమ్

బ్రహ్మ కృపా హి కేవలమ్!

# బ్రహ్మర్షి

## పందొమ్మిదవ శతాబ్దాంతమున భారతదేశమునందలి మత సాంఘిక రాజకీయ స్థితిగతులు

శ్రీమంతమై, సకల సౌభాగ్యములకాకరమై, రత్నగర్భ నాబరగి ధర్మవీరులకు కర్మవీరులకు జన్మస్థానమై, కవులకు గాయకులకు నిలయమై, పవిత్రగంగా గోదావరి కృష్ణ కావేరి మొదలగు పుణ్యనదులకు పుట్టినిల్లయి, వివిధములయిన వనస్పతులకాలవాలమయి, మహోన్నత పర్వతశ్రేణీ విరాజితమై, తపోవనప్రసిద్ధమై, పరమేశ్వరుఁ డద్వితీయుఁడనియు నేకేశ్వరుఁ డనియు జాటిన ఋషులకు భక్తులకు నెలవై, పవిత్రభూమిగా వాసిగాంచిన భరతఖండము పందొమ్మిదవ శతాబ్దాంతమున నతి శోచనీయమగు స్థితిలో నుండెను.

ధర్మపరాయణులగు నార్యులొనర్చెడి సూర్యేంద్రాగ్ని దేవతారాధనములు, నిత్యనైమిత్తికాదికర్మలు ప్రధానముగా గల వైదికమతము నాఁడు వెనుకఁ బడిపోయెను. బ్రహ్మ మొక్కఁడే యనియు, నతనిని దమ హృదయములలో దర్శించి

యెల్లరు నమృతత్వమును బొందనగుననియు, జ్ఞానాత్మకమైన తత్త్వవిచారమే మోక్షైక సాధనమనియుఁ బ్రబోధించు తత్త్వ జ్ఞాన గర్భితములైన యుపనిషద్గ్రంథములఁ గూర్చి తలపెట్టు వారానాఁడు లేకుండిరి. ప్రపంచమంతయు దుఃఖమయము, తృష్ణవలన దుఃఖము కలుగుచున్నది. దుఃఖనివృత్తియే మోక్షము, జీవహింసాత్మకములైన యజ్ఞయాగాదికములు నిరర్థకములు, వానిని వర్జించి మనోవాక్కాయకర్మలఁ బరిశుద్ధముగా నుంచికొని సర్వజీవరాశుల యెడ దయా ప్రేమలతో వర్తించుటవలననే మానవుఁడు నిర్వాణము నొందవచ్చునని గౌతమ బుద్ధుఁ డుపదేశించిన మార్గముకూడ నవలంబనీయము కాక పోయెను. బ్రహ్మవిష్ణుమహేశ్వరుల సృజించి యవతారములకు, విగ్రహపూజాడంబరములకు నిలయములైన పౌరాణిక శైవ వైష్ణవ సంప్రదాయములును నీతిదూరములై బాహ్యాచార ప్రధానములై యుండెను.

తరువాత భారతదేశము మహమ్మదీయపరిపాలనకులోను గాఁగా దానితో ఇస్లాము మతముగూడ నీ దేశములోఁ బ్రవేశించి స్థావరమును గల్పించుకొనెను. మహమ్మదీయుల పాలనమున భక్తిప్రధానములైన యనేక మతసంప్రదాయములు భారతదేశములోని వివిధప్రాంతములయందుఁ దలయెత్తెను. వానిలో గొన్ని హిందూమహమ్మదీయమతముల సమన్వయమునకుఁ దోడ్పడెను. కబీరు, నానకు, తుకారాము, తులసీదాసు, చైతన్యస్వామి, రామదాసు మున్నగు భక్తాగ్రేసరులు

సర్వమత సమన్వయ ప్రయత్నములఁ జేసిరి. 19 వ-శతాబ్దాంతమున మహమ్మదీయ ప్రభుత్వము, పాలనము లంతరించిన పిదప ఐరోపాక్రైస్తవులు దేశప్రభువులైరి. అప్పుడు క్రైస్తవ మతప్రచారమునకు బాగుగా ప్రాపుగలిగెను. క్రైస్తవ ప్రచారకు లొకవైపునను, మహమ్మదీయులు మఱియొకవైపునను హిందువులను, హిందువుల సంప్రదాయములను ధర్మములను నాక్షేపించుచుండ, వారు ఖిన్నులై మిన్నకుండవలసినవారైరి. హిందూదేవాలయములలోని పూజారులును, ధర్మకర్తలును జ్ఞానశూన్యులై యుండిరి.

ఇట్లు మతము పేరిట జరుగు దుర్ణయములు, బహుదేవతారాధనము, విగ్రహపూజ, బాహ్యాకర్మకలాపములు మున్నగు మూఢవిశ్వాసములే మన భారతావనియందలి నిరీశ్వరవాదమునకుఁ గారణము లయ్యెను. అట్టితఱి నాంగ్లవిద్యావిజ్ఞానముల వ్యాప్తితోఁ బాటు పశ్చిమదేశములందు విరివిగా సాగుచున్న నిరీశ్వరవాదఝంఝూమారుతము ప్రాగ్దేశముల పైఁ గూడ వీచి హిందూదేశమునం దప్పుడప్పుడే మొలకలెత్తుచున్న నిరీశ్వరవాదమునకు దోహద మొసంగెను.

రాజకీయరంగములో మహమ్మదీయ సామ్రాజ్యమంతరించెను. మహారాష్ట్రుల ప్రతిభ కూలిపోయెను. ఆంగ్లేయులు స్థానరముల నేర్పఱచుకొని వర్తకమును సాగించుటేగాక సంపూర్ణరాజ్యభారమును వహించిరి. ఆంగ్లేయులు సంఘసంస్కరణములతోఁ బాటు విద్యావ్యాప్తినిగూడఁ జేయుచు వచ్చిరి.

వైద్యశాలలను నెలకొల్పి ప్రజల రోగనివారణాదికముల కుపక రించుచుండిరి. క్రైస్తవమతప్రబోధకులు వేలకొలఁది హైంద వులను, ముఖ్యముగా నిమ్నజాతీయులనుఁ దమ మతములోఁ గలుపుకొనుచుండిరి. సంస్కృతము, అరబ్బీ, పరిష్యను భాష లతోఁ బాటు ఆంగ్లేయముగూడ గ్రమముగ నీ దేశమున వ్యాప్తమొందసాగెను. ఆంగ్లేయపాఠశాలలు, కళాశాలలు నెలకొని యాంగ్లభాషాపరిచయము, విజ్ఞానము, వాఙ్మయము హిందూదేశమున పాదుకొన సాధనము లయ్యెను.

మత రాజకీయము లిట్లుండుటయే గాక సాంఘికముగా గూడ భారతదేశము చాల వెనుకఁబడియుండెను. సర్వులకును జ్ఞానదాయకమగు విద్య యానాఁడు కొందఱికే అందు బాటులో నుండెను. సంస్కృతపఠనమున కధికారమున్న ద్విజు లుపనిషత్తులు మున్నగు సద్గ్రంథములఁ, జదువుటయందు, నర్థము చేసికొనుటయందు, నందలి సిద్ధాంతముల ననుసరించి జీవించుటయందు నిర్లక్ష్యభావమును వహించిరి. స్త్రీలకు, శూద్రులకు, మతగ్రంథపఠనాదికముల యెడఁ దగిన యవకా శాధికారములు లేకుండెను.

అంతేగాదు. సంఘమునందు స్త్రీలకుఁ గల స్థానము మిగుల శోచనీయమయి యుండెను. ఆ కాలమున హిందూ నారీమణు లనుభవించిన కష్టము లపారము. సహగమన దురా చారము, బాల్యవివాహములు, నిర్బంధవైధవ్యము, దుర్గా పూజలు, మానవ బలులు, శిశుహత్యలు, తొలిబిడ్డను గంగ

కర్పించు నాచారములు మున్నగువానితో భారతావని క్రుంగి కృశించినది. అట్టి సమయమున నవభారత పితామహుఁడగు రాజర్షి రాజా రామమోహనరాయలవారు వంగ దేశమున జన్మించి దేశమున నంధప్రాయముగ నాచారము పేర జరగు చున్న సమస్త దుష్కార్యములను నరికట్ట యత్నించెను. నిద్రా వస్థయందున్న హైందవజాతిని మేల్కొల్పెను. ధర్మరక్షణకై దేశీయులు బద్ధకంకణులగు నట్లొనర్చెను. ధర్మాచరణ సత్య వ్రతపాలనములపట్లఁ బ్రహ్లాదుని కై వడిఁ దలిదండ్రులను, బంధు వర్గమునుగూడ ధిక్కరించి ధీరత్వమును నెఱపెను. వేదోపనిష త్తులం దిమిడియున్న యేకేశ్వరోపాసనమును నెలకొల్పి సర్వ మత సామరస్యప్రధానమగు బ్రాహ్మసమాజమును నెలకొల్పెను. ఈశ్వరపితృత్వము, సర్వమానవభ్రాతృత్వమునుఁ బ్రకటించి, యా నాఁటి సంఘమందు స్త్రీకి గలస్థానమును జూచి, విలపించి, సహ గమనమును మాన్పి, స్త్రీకి పురుషునకువలె సమస్త విషయముల లోను సమానమైన ప్రతిపత్తి, హక్కులుగలవని నిరూపించెను. సర్వాంగసుందరమును, సంపూర్ణ వికసితమునగు భావిభారత మును నిర్మించుటకు సర్వతోముఖ సంస్కరణ మావశ్యకమని గ్రహించి, మతము, సంఘము, రాజనీతి, విద్యమున్నగు వివిధ కార్య క్షేత్రములయందును నాఁడాతఁడు కృషి గావించి ఇంగ్లండు నందలి బ్రిస్టలు నగరమునఁ గాలధర్మము నొందెను.

రాజర్షి రాజా రామమోహనరాయలువారు గతించు నాఁటి కాంధ్ర దేశపుఁ బరిస్థితులు గూడ పైనిజెప్పినట్లే యుండె

ను. ఆనాఁడాంధ్ర నారీమణు లనుభవించిన కష్టము లపారములు. సహగమన దురాచార మడుగంటినను బాలవితంతువుల స్థితి మిక్కిలి దుర్భరముగాను, హేయముగాను నుండెను. చాల మంది వితంతువులు వివాహములు చేసికొని సంసారసౌఖ్యములఁ దేలియాడుదమనుకొన్నను సంఘముయొక్క క్రౌర్యమునకు భయపడి వివాహములఁ జేసికొననేరక మిన్నకుండవలసినవా రైరి. పాశ్చాత్యనవనాగరకతా ప్రభావమున నాఁటి కులస్త్రీలు స్వేచ్ఛగా విహరింపఁ జొచ్చిరి. వేశ్యాసంపర్క మానాఁడొక గౌరవముగాఁ బురుషులలోఁ బాటింపఁబడుచుండెను. జమీందారులు, మొఖాసాదారులు, అగ్రహారీకులు, వేయేల, ధనవంతులైనవారెల్ల నుంపుడుకత్తెల నుంచుకొనుటొక మర్యాదగా నెంచుచుండెడివారు. వారలచే వినోదములకై నృత్యగీతాదులను నడివీధులలోఁ గావింపఁజేయుచు, వినోదించుచుఁ, దమ ధనమును,గాలమును వ్యర్థపఱచుచుండెడివారు. స్త్రీలలో నవిద్య హెచ్చై దాని వాతావరణమే గృహజీవనమునఁ దాండవింపఁజొచ్చెను. ఆ దినములలో లంచములు పుచ్చుకొననివాఁ డప్రయోజకుఁ డని భావింపఁబడుచుండెను. లంచములు పుచ్చుకొనుట యుద్యోగధర్మమని నమ్మి యిచ్చువారును బుచ్చుకొనువారును దానిని దప్పుగాఁ దలంపకుండిరి. శూద్రుల, నిమ్నజాతీయుల బ్రతుకు దుర్భరముగా నుండెను.

ఇట్టి విపరీత విపత్కర పరిస్థితులలో విశాలవిశ్వమానవ కోటికంతకు నేకైక మతము కాఁదగిన బ్రాహ్మమతధర్మమును

స్వీకరించి, యాంధ్ర దేశము నావరించిన యజ్ఞానతమస్సును బాపుటకు, ఘోరతమ దురాచారములం బటాపంచలు చేయుటకు, నాంధ్రప్రజానీకముయొక్క సాంఘికజీవనమును సంస్కరించుటకు, నవ్యాంధ్రనిర్మాతలును, నీతికోవిదులును, పండితోత్తములును, సంస్కారప్రియులును, కర్మధర్మవీరులు నగు శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారును, శ్రీ రఘుపతి వేంకటరత్నము నాయఁడుగారును, ఉదయించి యాంధ్రావని నన్నివిధముల నుద్ధరించిరి.

## 2. ఆధుని కాంధ్ర యుగ నిర్మాతలు.

### శ్రీ పంతులుగారు — శ్రీ నాయఁడుగారు.

ఆధుని కాంధ్రియుగ స్థాపనమునకు మూలకారణులై యాంధ్ర దేశమున సంఘ సంస్కరణమునందును మతసంస్కరణము నందును, యావజ్జీవము కృషిసలిపి, ఋషిప్రాయులై, మానవసేవా పరాయణులై వెలసిన మహాపురుషు లిరువురు గలరు. వారు కందుకూరి వీరేశలింగము పంతులు, రఘుపతి వేంకటరత్నమునాయఁడు గారలు. వీరేశలింగముపంతులుగారు తెనుఁగునాట నాఁడు నెలకొనిన వివిధోద్యమములకును బునాదులు వేసి, కార్యదీక్షతోఁ బనిచేసి, పెక్కు సంస్థలను స్థాపించి యాంధ్రమాత సుపుత్రులలో నగ్రగణ్యులైనారు. వారి యనుయాయులగు శ్రీ నాయఁడుగారు పంతులుగారిని దమ 'నాయకుని' గా గుర్తించి, వారి నాయకత్వమున జీవయాత్రను

నెఱపి, యద్యతనాంధ్ర వైజ్ఞానికబుద్ధితో నెగడి వారికి కుడి భుజమై సేవాజీవనమున నిమగ్నులై యీశ్వర ప్రార్థనము నందును, మానవసేవయందును మునిగి తేలుచు, పలువురు దీనులకు హీనులకు; అనాథలకు అగతికులకు; వితంతువులకు విద్యార్థులకు నాశ్రయము నొసఁగి, ధన్యజీవు లైనారు.

విద్వాంసులుగను, విద్యా ప్రదాతలుగను వెలసిన వీరిరువురును ఘనతకెక్కిన ఋషివర్యులుగను, లోకోపకారులుగను గూడ వన్నె గాంచిరి. మనోహర వ్యక్తిత్వ సచ్ఛీలములతో నీశ్వర వరప్రసాదులైన వారిరువురు నంతేవాసుల యాత్మలను ప్రేమ సువర్ణ బంధములతోఁ బెనవైచి వారికిఁ దమఁ బరిచయ ప్రేమ భాగ్యముల నొసఁగిరి. ఈ యాధునిక యుగమున నాంధ్ర భూమిలో వారల భావావేశమును, ఆత్మోన్నతిని, జవిచూడని యాస్తికులుగాని, వారి సాహాయ్యమును సంపోషణమునుపొందని మహోద్యమ సంస్థలుగాని, వారి చేయూఁతచే విద్యావిజ్ఞానముల నొందని దీనజన నిమ్నజాతి సంఘములుఁగాని, వారిని స్మరించి, యేకాంతమున బాష్పముల జాలువార్చని యనాథ వితంతువులుగాని లేరు.

వీర లిరువురును బ్రాహ్మసమాజ సభ్యులై దక్షిణ భారతీయులలో సూర్య చంద్రులవలె భాసిల్లి, యనాచారాజ్ఞాన భావాంధకారములఁ బాఱఁద్రోలిరి. ఎడతెఱిపిలేక, పాదుకొని యున్న సంఘమునందలి దురాచారముల రూపుమాపుట కయి, రణరంగమున కుఱుకు శూరుల ఖడ్గములకైవడి, వీరు

కలములఁ జేఁబూని, యమోఘములగు తమప్రాఁతల చేతను, గంభీరోపన్యాసములచేతను, నాంధ్రులయం దలజడిని గలిగించి, మూఢ విశ్వాసముల మూలకుఁద్రోయ జీవితాంతము వఱకుఁ బాటుపడిరి.

వారు కుల మత భేదములఁ బాటింపని యనుష్ఠానిక బ్రాహ్మలు. సర్వ మతములందు నుదారభావముతో మసలిన యుదాత్త చరితులు. మానసికేశ్వరోపాసనవలన నాత్మ పరి శుద్ధియు, జీవిత పరమార్థములు లభించునని యుద్బోధించిన ప్రబోధకులు. గాఢమగు దైవభక్తిని వారెన్నడును విడువలేదు. పరమేశ్వరభక్తితో, పరిశుద్ధాస్తిక భావనతో తమసంస్కరణ ములను మేళవించి యాంధ్రజాతీయ జీవనమునకు కొంగ్రొత్త మార్గమును జూపినారు. ప్రతిమారాధన మాత్మాభివృద్ధి కాటం కమనియు, కుల తత్త్వభావనలు, అస్పృశ్యతాది విభేదములు నైకమత్యమునకు భంగకర మనియు, స్త్రీల నిర్బంధ వైధవ్య ము మాతృజాతి స్వేచ్ఛకు హానికరమనియు, బాల్యవివాహము లనారోగ్యమున కాకరము లనియు, దేవదాసీ విధానము స్త్రీలోక పాతివ్రత్యమునకు కళంక మనియు, అవి వేద సమ్మ తములు గావనియుఁ, బరిశుద్ధ హిందూధర్మమునకు వ్యతిరేకము లనియు దమ రచనల మూలమున, నుపన్యాసముల మూలమున నాంధ్రలోకమున కుద్బోధించి యాంధ్రాభ్యుదయమునకు మూలపురుషులైరి.

సంఘమునకు వేరు పురుగులవలెనుండి సాంఘిక జీవిత మును, నైతిక జీవనమును గ్రుంగదీయు దుష్టాచారముల నిర్మూ

లించుటలో వారిఱువురును గనఁబఱిచిన పట్టుదలయు, కృషియు ననన్య సామాన్యములు. వీరు వేశ్యావృత్తిని నిరసించుచు, దాని బ్రోత్సాహించువారిని గర్హించుచు బ్రహసనములందును, బ్రసంగములందును, బత్రికావ్యాసములందును సంస్కరణ బీజముల నితరులలోను, కళావంతులలోను నాటి, కళావంతుల సంస్కరణమునకుఁ దోడ్పడిరి, సంఘపారిశుద్ధ్యము కొఱకును, వేశ్యావృత్తి నిర్మూలనోద్యమమునకును, వీరూరూరఁ దిరిగి, యుపన్యాసములనిచ్చి, సంఘముల స్థాపించి, నిర్మలమైన బుద్ధితోడను, సునిశితమైన వాక్కులతోడను, చెడుత్రోవల సంచరించు పెద్దలకును చిన్నలకును, యువకులకును విద్యార్థులకును, వారివారి లోపములఁజూపి యపమార్గముల సంచరించుట యాత్మవినాశకరమని, యవమానకరమని బోధించి స్త్రీమూర్తి యందు మాతృ స్వరూపమును జూపిరి.

అగ్రకులములవారితోబాటు పల్లెలయందును, పట్టణములయందును గలిసిమెలసి వసింపవలను గానిపరిస్థితు లేర్పడి, చెఱువులందు, నూతులందు గల నీటిని నలుగురితోఁబాటు పాన పచనములకు వినియోగపఱచుకొను నవకాశములు లేక, విజ్ఞులను విబుధులను జేరి విద్యల నార్జించు వీలునుగాని తుదకు నలుగురితోగలిసి భగవంతు నర్చించు భాగ్యమునుగాని, పొందక అంటరానివారని కడజాతివారని హేయములగు నామములఁతో పిలువబడుచు సంఘదూరులగు నిమ్నజాతీయు లనుభవించు హింసాకాండచూచి అనుకంపజెంది పతితపావనుడగు పరమేశ్వరుని యనుగ్రహమువలన నాదీనులపాలిటి కల్పతరువులై ఈ

మహాపురుషులు వారల నాదరించి, దమ యపార ప్రేమను వారిపై బ్రసరింపఁజేయుచు వారి కాశ్రయము నిచ్చియు, నాశ్రమములఁ గల్పించియు, దమ విద్యాసంస్థలలో వారి కుచితముగ జదువు గఱపు వసతుల గల్పించి హరిజనాభివృద్ధికై యావజ్జీవనము పాటుపడిరి.

సాంఘికోన్నతికి స్త్రీల యభ్యుదయము ముఖ్యమైనదని గుర్తించి వారల యభివృద్ధికి నవ్యాంధ్ర నిర్మాతలగు వీరు గావించినకృషి యపారము. స్త్రీవిద్యకొఱకుఁ బ్రచారముజేసియు, స్వయముగాఁ బాఠశాలల నెలకొల్పియు, అనాథలగుస్త్రీలను బెంచి పోషించియు స్త్రీజాతి కెంతయుఁ దోడ్పడిరి. అతి బాల్య వివాహములు సంఘమున కంతకు హానికరములని కనిపెట్టి, వాని నంతరింపఁజేయుట కెంతో పనిచేసిరి. స్త్రీలకు మిక్కిలి బాధకరములగు నిర్బంధవైధవ్య విధానములఁ దొలగించుట కయి యెక్కువగఁ బాటుపడి దేశమున వితంతూద్వాహములు పెక్కింటిని ఘటింపఁజేసి వ్యయప్రయాసల కోర్చి కార్యశూరులైరి. ఊరూరఁ దిరిగి వితంతువులఁ జేర్చి, వారలకై శరణాలయముల నేర్పఱిచి, ధైర్యౌదార్యములతో వాని నాదర్శప్రాయముగ నడిపిరి. స్త్రీలకుఁగూడ విద్యాసంస్కారములను, స్వాతంత్ర్యమును సమకూర్చినయెడల, వారేవిధమునను బురుషులకుఁ దీసిపోరని గ్రహించి, తాము స్థాపించిన విద్యాశాలలలో స్త్రీలనుగూడఁ బ్రవేశపెట్టిరి. జాతీయక్షేమమునకై స్త్రీల యభివృద్ధి యావశ్యకమని 1920 వ సంవత్సరమునకు ముందు ఆంధ్ర దేశమునఁ గనిపెట్టి దానికి బ్రాముఖ్యమునిచ్చినవారరుదు.

ఆంధ్రప్రాంతములలో వీ రిరువు రే యిట్టికృషి గావించి స్త్రీ జాతి నన్నిమార్గములందును సముద్ధరించినారు. పూర్వాచారపరా యణులవలన తీవ్రప్రతిఘటనము గల్గుచుండినను, తమపై నాంక్షలు, బహిష్కారములు సాగుచుండినను, తమ్ముఁ గించపఱచుటకై యభియోగములు ముష్కరచర్యలు సాగుచుండినను వాని నన్నిటిని సహనముతో సహించి, ధైర్యముతో నెదుర్కొని, పూర్వాచార పరాయణులకు గాని, దుష్టాచారములకు గాని లొంగక, కాలమున కెదురీఁత నీది స్త్రీ జాత్యుద్ధరణకై పాటుపడిరి.

రాజకీయములందన్నను వారిరువురును మితవాదులు. దేశీయమహాసభను గూర్చియు, దాని మహాశయముల గూర్చియు వా రుపన్యాసముల నిచ్చియు, వ్యాసములవ్రాసియు దేశీయులలో నవోత్సాహమును బురికొల్పిరి. అతివాదులనఁబడు జాతీయవాదులానాఁడు రాజకీయములఁ దీవ్రవాదులై ప్రభుత్వమును, ప్రభుత్వోద్యోగులను నిందించునప్పుడు, అట్టి చర్యలవలన స్వాతంత్ర్యము చేకూరదనియు, సాంఘికలోపముల దొలఁగింపఁబని చేయవలెననియు, మన యభివృద్ధి సర్వతోముఖముగ నుండినప్పుడే వాస్తవజాతీయాభివృద్ధి కలుగుననియు బోధించిరి. కాంగ్రెసునందతివాదులైన వారానాఁటి రాజకీయములందమితోత్సాహముఁజూపు చున్న "ఎడ్లి నార్టను" దొరకు రాజకీయ వర్గమునందు గౌరవస్థానమొసంగ, నైతిక జీవనమున వెనుకబడియున్న "నార్టను" వంటి వానికెన్నికఁ

గన్న నాయకులలో నట్టిగణ్యాస్థానము నిచ్చుట తగదని ప్రతి ఘటించుటకు వెనుదీయని ధీరత్వము వీరిలో నెందుకొని యుండెను.

ధనమునెడగాని, పదవులపయిగాని వారికి వ్యామోహము లేదు. తాముకష్టపడి సంపాదించిన-ధనము నంతయును బ్రజోపయోగ కార్యములకును, సాంఘికోన్నతి గల్గించు ధర్మ సంస్థల నిర్వహించుటకు నిచ్చివేసిరి. వారట్టిసంస్థల స్వయముగా స్థాపించి, యాయన్నతాదర్శమందితరులకు గుణపాఠముల నేర్పిరి. ధనవంతులు తమకు దైవముప్రసాదించిన ధనమును ధర్మకర్తలవలె ప్రజోపయోగమునకును లాభమునకును విని యోగింపవలెనని యుద్బోధించిరి.

కడచిన రెండు శతాబ్దులనుండియు నధోగతినొందిన హైందవ జాతిని సాంఘిక ధార్మికరంగములందు సముద్ధరించుచు, రాజకీయాభివృద్ధిని గలిగింప బంగాళా దేశమున శ్రీరాజా రామమోహనరాయలు, దేవేంద్రనాథులు, కేశవ చంద్రసేనులు, ఈశ్వరచంద్ర విద్యాసాగరులును; పశ్చిమమున దయానందులును, భండార్కరును, రేనడేయును; దక్షిణమున సుబ్రహ్మణ్యాదులును జేసిన సంఘసంస్కరణోద్యమ వాహినులను వీరలు తెలుఁగునాఁటఁ బ్రవహింపఁజేసి యాంధ్రావనిని బునీతము గావించిరి. ఈ నవ్యాంధ్ర నిర్మాతలు ధన్యులు. వారి చేఁతలు సంస్థలు, భావములు, భావనలు, కరదీపికలై యాంధ్ర ప్రజానీకమును నడిపించును గాక.

### 3. శ్రీవేంకట రత్నము నాయఁడు గారి పూర్వులు

శ్రీవేంకట రత్నము నాయఁడు గారి పూర్వులు ప్రసిద్ధి గన్న తెలగా కుటుంబములలో వైష్ణవసంప్రదాయమునకుఁ జెందినవారు. వారి తాతముత్తాతలు తండ్రిగారును నాఁటి తురుష్క ప్రభుత్వోద్యోగులై ఖ్యాతిని, మన్ననల నందిరి. వీరి పితామహులు సైనికోద్యోగమును విరమించి మచిలీపట్టణమునఁ బ్రశాంత జీవనమును సాగించుచుఁ బండితుల నాదరించి, దాన ధర్మములఁ జేయుచు, భారత భాగవతరామాయణాది సద్గ్రంథములను, పురాణేతి హాసములను జదివించుచు, భగవద్భక్తినిగూర్చి చింతనము చేయుచు నెల్లప్పుడు పరమేశ్వర ధ్యాన నిమగ్నులై యుండెడివారు.

వారికి రఘుపతి అప్పయ్య నాయఁడను సుపుత్రుఁడుదయించెను. శ్రీ అప్పయ్యగారునుఁ బెద్దల యడుగుజాడల నడుచుచుఁ జిన్నతనముననే ప్రభుత్వసైనిక శాఖయందుఁ బ్రవేశించిఁ దమవిశుద్ధ వర్తనము వలనను, స్వామిభక్తి మూలముననను గ్రమక్రమముగ నున్నతపదవుల నందుచు కడకు "సుబేదారు" పదవినందిరి. వీరు తోడివారిలో నీతియు, నియమము గలమేటి యని వన్నెగాంచిరి.

శ్రీ అప్పయ్యనాయఁడు గారు కీర్తిగన్న తెలగాకుటుంబము నకుఁజెందిన శ్రీమతి శేషమ్మయను పుణ్యాంగన నుద్వాహమైరి. ఆయమ్మ యౌదార్యమున వన్నెకెక్కిన వైష్ణవభక్తురాలు. గృహకార్యములను సరిదిద్దుటలోను, గృహమునకే తెంచిన వారి నాదరించుటలోను, బంధుమిత్రుల గౌరవించుటలోను,

బిడ్డల సాకుటలోను జక్కని శ్రద్ధను జూపి యాదర్శ గృహిణి యను పేరు గాంచినది. ఆమె నాఁటి స్త్రీలకెల్ల నాయకమణియై సౌందర్యరాశియై సౌందర్యమునకు వన్నెదెచ్చు పాతి వ్రత్యమునై ప్రఖ్యాతిగాంచినది. ఈమె తండ్రిగారుగూడ సైని కోద్యోగి యగుట, తండ్రి గారిని బట్టియే గాకఁ దల్లిగారి వంశమును బట్టిగూడ శ్రీనాయఁడు గారు యుద్ధవీరుల వంశము నుండి యవతరించిన వారయిరి.

ఆపుణ్య దంపతుల యపూర్వ దాంపత్యఫలితముగా నిరువురు పుత్రులుద్భవించిరి. వారిలోఁ బెద్దవారు శ్రీ వేంకట రత్నము నాయఁడు గారు. రెండవవారు శ్రీ వెంకయ్య నాయఁడు గారు. తల్లిదండ్రుల భక్తివిశ్వాసములు, నీతివర్తనము, కార్య దీక్ష శ్రీనాయఁడు గారి కుగ్గుపాలతోఁ బెట్టినవియై, భావి జీవి తమున వారు సర్వమతసమన్వయ కర్తయగుటకు కారణము లయ్యెను.

జనకుల వృత్తిని బట్టి కుమారుఁడు బ్రహ్మణ్యుఁడగుటకుఁ దగుకారణములు కనఁబడవు. కాని తండ్రికొడుకుల జీవితము లలోఁ గొన్ని సామ్యములున్నవి. తండ్రి సైనికశాఖలోఁ జేరి కత్తిచేఁబట్టి ఖ్యాతిగాంచెను. తనయుడు విద్యాశాఖలో జేరి కలముచేఁబట్టి ఖ్యాతిఁగాంచినాఁడు. జనకుఁడు బాహ్యశత్రువులను జయించెను. నందనుఁడంత శ్శత్రువుల నిర్జించెను. తండ్రి రాజ భక్తుఁడు. కొడుకు దైవభక్తుఁడు జనకుఁడు శస్త్రధరుఁడు. కుమారుఁడు శాస్త్రవేత్త. ఇట్లు జనకనందను లిరువురు వేర్వేరు శాఖలందగ్రేసరులైరి.

## 4. జన్మస్థానము, జననము, బాల్యము, విద్యాభ్యాసము.

చరిత్ర ప్రసిద్ధిగాంచిన కృష్ణా తరంగిణీతీర దేశమున నొప్పుచు బందరను నామాంతరముగల మచిలీ పట్టణమున, దుందుభి నామసంవత్సరమున నాశ్వియుజ మాసమున, శుక్ల పక్షమున, మహర్నవమి దినమున ననగా క్రీస్తుశకము 1862 వ సంవత్సరమున సెప్టెంబరు నెలలో శ్రీరఘుపతి వేంకటరత్నము నాయఁడు గారు జన్మించిరి. 1864 వ-సంవత్సరమున నా పట్ట ణమునుఁ దుడిచి వైచిన పెనుగాలి తుపానులో పరమేశ్వర కారుణ్యమున సజీవులై నిలిచిన వారిలో శ్రీ వేంకరత్నము నాయఁడు గారొకరు.

ఆకాలములో సుబేదారుఁడొక జమీందారుఁడనియే చెప్ప వచ్చును. అట్టి కుటుంబమున జన్మించుటచే శ్రీ వేంకట రత్నము నాయఁడు గారు సమస్త భోగభాగ్యములఁ దుల దూగుచు గారాబుపట్టియై పెరిగెను. పూవు విడిచినదోడనే సువాసన వెదఁజల్లు రీతిని శ్రీనాయఁడు గారు చిన్నతనముననే గొప్ప ధీశక్తిని బ్రదర్శింపసాగిరి. తండ్రిగారు తనయుని యద్భుతమే ధాశక్తినిగుర్తించి, కుమారునియెడఁ బ్రత్యేకశ్రద్ధను, ఆదరణ మును వహించిరి. పుత్రునికి విద్యాబుద్ధులు గఱపుటయం దెక్కువ శ్రద్ధాసక్తులను జూపిరి.

చిన్నతనమందే యథావిధిగ విద్యాభ్యాసముఁజేయించి గ్రామపాఠశాలకు శ్రీనాయఁడుగారి నంపుచుండెడివారు. తదు పరి శ్రీఅప్పయ్య సుబేదారుగారి సేనానివహములు బర్మా యుద్ధమునకుఁబోయి యచట విజయపరంపరల నందికొనెను.

పిమ్మట వారి పటాలము లుత్తరహిందూస్థానమునను, నడిమి మాగాణములలోను జాలకాలముండుటచే, సుబేదారుగారు దమ కుటుంబము నక్కడకుఁ బిలిపించుకొనిరి. శ్రీ నాయఁడు గారు మాటలాడు భాష తెనుఁగేయైనను, నివసించు మండలము లలో నాంధ్రభాష లేకపోవుటచే నుర్దూమౌల్వీలయొద్ద నుర్దూ భాష నభ్యసించిరి. ఆ భాషలో నీయన యనర్గళముగా సంభాషించుట మాత్రమేగాక సారస్వతమును గూడ నిపుణతతోఁ జదివి మహమ్మదీయ పండితులగు మౌల్వీలకు నే విషయమునను దీసి పోని సాహిత్యమును చిన్ననాఁటనే సంపాదించిరి.

శ్రీ నాయఁడుగారి జనకులు సైనికోద్యోగులగుటవలన వారును దమ తండ్రితోఁ బాటుఁ దెనుఁగుగడ్డ పొలిమేరల దాటి సుదూరభూముల కేగవలసివచ్చుటచే, నచటివాడుక నను సరించి, ప్రభుత్వమువారి నిర్ణీత ప్రణాళిక ననుసరించి వారు మాతృభాషను విసర్జించి, దప్పనిసరిగా, నుర్దూపారసీకభాషలను నేర్వవలసిన వారైరి. ఆభాషలలో వ్రాయఁబడిన ప్రతిపాఠమును "దయామయుఁడు, కృపాళువు నగు నీశ్వరుఁడు" అను మాట లతో నారంభింపఁ బడుచుండెడిది. వానిని జదివినప్పుడెల్ల శ్రీనాయఁడు గారికి "హైందవ గృహములందును, దేవాల యము లందును గల విగ్రహము లిట్టి సంబోధనకర్హములేనా?" యను ప్రశ్న ముదయించెడిది. దేవతా మతవిషయములపై పాఠములం దచ్చటచ్చట వచ్చుభాగములను శ్రద్ధతోఁ బఠించి వానినిగూర్చి దీర్ఘముగా శ్రీ నాయఁడుగా రాలోచించుచుండెడి వారు. బడికి వచ్చుచుఁబోవునపుడెల్ల నేకేశ్వరునిగూర్చిన పారసీక

పద్యముల నానందాతిరేకమున వల్లైవేయుచుండెడివారు. చిన్న తనముననే వారి నేకేశ్వరమూర్తిని దమ హృదయఫలకమున నిర్మించుకొనుటచే భావిజీవితములో బ్రహ్మర్షు లగుటకు దగిన యాధ్యాత్మికబీజము లప్పుడే వారి మనమున నాటుకొనినవి. ఖురానునందలి మొదటి సూరా(పద్యము) గూడ వారి దృష్టిని ధ్యానము నెడను ఏకేశ్వరార్చనము దెసకునే మరల్చినది. పిన్న వయస్సగుటచే వారి సిద్ధాంతము దృఢరూపమును దాల్పక పోయినను నేకేశ్వర విశ్వాసము మాత్రము వారి మనమున గాఢముగా నాటుకొనెను.

సంయుక్తమండలములో నున్న "బాందా" యను పట్టణమున నున్నప్పుడు శ్రీ నాయఁడుగారు జిల్లాహైస్కూలులో "బాబు దీనానాధ బెనర్జీ" "బాబు గంగాధరముఖర్జీ" యను వంగదేశీయుల యొద్ద విద్యాభ్యాసముఁ జేసెను. వారు మాధ్య మికపాఠశాలా తరగతులలోఁ జదువుచున్నప్పుడు బంగాళా దేశ మునందలి చరిత్రాధ్యాపకుఁడగు "లైత్ బ్రిడ్జి" దొర వ్రాసిన భారతదేశచరిత్రయను పుస్తకముఁ జదువుట తటస్థించెను. గంగాధర ముఖర్జీగారు విలియం బెంటిక్ ప్రభుని పరిపాలనను గూర్చి చదివించుచుండిరి. అందు శ్రీ రాజారామమోహన రాయలువారు "బ్రిస్టలు" పట్టణమున 18౬౩ సం॥న మరణించె నని వ్రాయఁబడియుండెను, ఆపాఠ్యభాగమును జదువునప్పుడు శ్రీ నాయఁడుగారు లేచి "అయ్యా! - ఇందలి రాజా రామ మోహనరాయలవా రెవరు? వారి విషయ మిందేల యుదా

హరింపఁబడె-"నని ప్రశ్నించిరి. తాను బ్రాహ్మమతావలంబి కాకుండుటచేతను, బ్రాహ్మసమాజమును గూర్చి చెప్పుకొనఁదగిన మాత్రము వినుటచేఁ గల్గిన జ్ఞానము కలవాఁడగుటచేతను, నా యుపాధ్యాయుఁడు శ్రీ నాయఁడుగారితో "భారతీయులు క్రైస్తవులుగా మారకుండునట్లు చేయుటకు రాజర్షి రాజా రామమోహనరాయలవారిచే స్థాపింపఁబడిన మతసంస్థయే బ్రాహ్మసమాజమనియు, విగ్రహారాధనములేని యాధ్యాత్మికోపాసనమే యందలి ముఖ్యలక్షణమనియు"ఁ జెప్పెను.

ఆ పాఠశాలాప్రధానోపాధ్యాయులగు దీనానాథ బెనర్జీ బాబు కుమారుఁడు పూర్ణచంద్ర బెనర్జీ శ్రీ నాయఁడుగారికి సహపాఠి. అతఁడు క్రైస్తవుఁడు. వారి వయస్సులకు దగినట్లిరువురు మిత్రులు దమతమ మతములను గూర్చి చర్చించి యుపాసన మెల్ల యాధ్యాత్మికమై యుండవలెనని యంగీకరించిరి. కాని శ్రీ నాయఁడుగారు మాత్రము ఏసుక్రీస్తు దేవుఁడు గాడని వాదించుచుండిరి. ఇట్లు తమ యుపాధ్యాయులనుండి రాజర్షి రాజారామమోహనరాయల వారిని గూర్చి వినినపిదప శ్రీ నాయఁడుగారు తమ మిత్రునితో "పూర్ణచంద్రా! బ్రాహ్మసమాజమే నా మతమని" తమ నిశ్చితాభిప్రాయమును బ్రకటించిరి. అప్పుడు శ్రీ నాయఁడుగారి దృష్టి యప్పటికి సజీవులై రామమోహనరాయలవారి మతోద్యమమునకు ముఖ్యనాయకులై, మహావక్తలని పేరుగాంచిన బ్రహ్మానంద కేశవ చంద్ర సేనులవారివైపునకు మరలెను. "ఇతర మతస్థులతో కేశవచంద్రసేనుల

వారు వాదప్రతివాదములు సలుపలేదా?" యని శ్రీనాయఁడు గారి ప్రశ్న. "ప్రముఖక్రైస్తవమతప్రచారకులతో వారు విమర్శలకు గడంగి"రని యందుకు సమాధానము. అటులైనచో "దాని ఫలితమేమి?" యని మరల ప్రశ్న. "ఏకేశ్వరవిశ్వాసము గలిగి, యేకేశ్వరారాధనము చేయువానికి క్రైస్తవమతప్రచారకులచే మతవివాదమున నోటమియా? యని ప్రశ్నకు ప్రశ్నతో సమాధానము. ఇట్టి ప్రశ్నోత్తర పరంపర శ్రీ నాయఁడు గారి లేత హృదయమును గలంచివైచినది. ఆమరణాంతము నేకేశ్వరోపాసనమను ముఖ్యసిద్ధాంతముపైననే శ్రీనాయఁడుగారి మత విశ్వాసమాధారపడియుండెను. దృఢముగా నిట్లు మనస్సున నాటుకొనునట్లు సుస్థిరములగు పునాదులపై శ్రీ నాయఁడుగా రేకేశ్వరోపాసనాసౌధమును పిన్ననాఁటనే నిర్మించుకొనిరి. మనసు పరిపక్వముగాని పామరుల కేకాగ్రతను గల్పించి, భక్తిని బాదుకొల్పుటకు విగ్రహము లెంతయో యవసరములను విషయముపై నెంతేని వాదప్రతివాదములు జరుగుట కవకాశము గలదు. కాని శ్రీ నాయఁడుగారికి మాత్రము వారి పూర్వపుణ్యవశమున నిట్టి సగుణోపాసన మక్కరలేకయే కేవలము మహర్షులకు మాత్రమే లభ్యమగు నిర్గుణబ్రహ్మము నారాధించు భాగ్యము గలిగెను. ఇట్టి నిర్గుణోపాసన పండిత పామరులను వివక్షతలేక యెల్లరును జేయవలసినదే యని శ్రీ నాయఁడుగారి యభిప్రాయము.

పిమ్మట సుబేదారు అప్పయ్యనాయఁడుగారు హైదరాబాదునకు బదిలీకాగా శ్రీ నాయఁడుగారు హైదరాబాదు

లోని నైజాము గవర్న మెంటు హైస్కూలు ప్రధానోపాధ్యాయులైన డాక్టరు అఘోరనాధచటోపాధ్యాయగారియొద్ద కొంత కాలము విద్యాభ్యాసము గావించిరి. వీరు శ్రీమతి సరోజని నాయఁడుగారి జనకులు. పిమ్మట చుడర్ ఘాట్ లోని సెయింటు జార్జి గ్రామరు పాఠశాలా ప్రధానోపాధ్యాయులగు "డబ్లు. ఎ. హోమ్" యను దొరవారియొద్ద నిర్దుష్టమైన నాంగ్లభాషను నేర్చి "మెట్రికుృలేషను" పరీక్షను ముగించి శాస్త్రవిద్యాభ్యాసము నిమిత్తము చెన్నపురికి వెడలి యచ్చటి క్రైస్తవకళాశాలలోఁ జేరిరి.

## 5. శ్రీ నాయఁడుగారు - మదరాసు విద్యాభ్యాసము

దక్షిణ హిందూదేశమున విద్యావ్యాప్తికి మిక్కిలియుఁ దోడ్పడిన ఎడింబర్గు నివాసి డాక్టరు 'మిల్లరు' దొరగారపుడు క్రైస్తవ కళాశాలకు ప్రధానాధ్యాపకులుగా నుండిరి. ఆకర్షణీయమైన వ్యక్తిత్వముగలిగి, తమ నైతికవిఖ్యాతి దెసల నలంకరింపఁజేసిన శ్రీ మిల్లరు దొరగారి యధీనమున విద్యనభ్యసింప గలుగుట శ్రీ నాయఁడుగారి యదృష్టమని చెప్పవచ్చును. యువకులైన శ్రీ నాయఁడుగా రా గురూత్తముని మదికెక్కు ప్రవర్తనము గలిగి విద్యార్జనము నొనర్చుచు గురూత్తములు 'నా ప్రియమైన బిడ్డలారా !'యని వాత్సల్యముతోఁ బిలుచు కొలఁది మంది విద్యార్థులలో నొక్కరగు భాగ్యమును సంపాదింపగలిగిరి. నిరుపమ మేధావియు, నుదారహృదయుఁడైన గురూత్తముని దృష్టి నాకర్షించు సత్ప్రవర్తనగలిగి వారితో ననుదిన సాహచర్యభాగ్యమును శ్రీ నాయఁడుగా రందిరి. ఇంతియేగాక

వీరికి మరియొక యుత్తమావకాశముకూడ లభించినది. ఉదారాశయ పూరితులు, ఉత్సాహభరితులు, నవసంస్కార జీవన దీక్షాపరులును నగు శ్రీ కె. నటరాజను, ఓ. కందస్వామిసెట్టి శ్రీనివాసరావు, నారాయణరావు మొదలుగాఁగల కొందఱి యువకుల స్నేహభాగ్యము వీరికిఁ గలిగినది.

యువకులగు శ్రీ నాయఁడుగారప్పటికే సుప్రసిద్ధాంగ్ల రచయితలైన కార్లైలు, టెన్నిసను, వర్డ్సు వర్తు, బ్రౌనింగుల కవితామాధుర్యములఁ జవిచూచి యుండిరి. వీరిలో నొక్కొక్క మహాకవియు, శ్రీ నాయఁడుగారి కొక్కొక్క సుగుణమును ప్రసాదించెను. 'కార్లైలు' లోని శ్రద్ధ సునిశిత వివేకము; టెన్నిసన్ లోని ప్రతీక్ష; బ్రౌనింగులోని సద్విశ్వాసము; వర్డ్సు వర్తులోని ప్రకృతి మాధుర్యభావము వీరికి సంక్రమించినవి. వీరు ఎం. ఏ. పరీక్షకై మిల్టనుయొక్క 'పేరడైజురిగైన్డు (Paradise Regained) అను గ్రంథముపై వ్రాసి పంపిన వ్యాసరాజము పరీక్షాధికారుల దృష్టి కాశ్చర్యము కలిగించినది. వారు వ్యాసమునకై గ్రహించినవస్తువే వారి మానసిక శక్తిప్రాబల్యమును భావాభినివేశమును వారిలో నెట్లు పెంపొందుచుండెనో వ్యక్తమొనర్చెను. 1885 సంవత్సరమున నాయఁడుగారు ప్రత్యేక కృషిజేసి భౌతిక శాస్త్రమున పట్టభద్రులైరి. పిమ్మట వారు బి. యల్. పరీక్షకై యనేక విఫలప్రయత్నము లొనర్చియుండిరి. ఒక్కొక్కసారి పరీక్షహాలులో బ్రవేశించి ప్రశ్నపత్రము చూచి వెలుపలికి వచ్చెడివారు. ఒక్కొక్కసారి యొకరోజు మాత్రమే పరీక్షకు హాజరై తక్కిన భాగములకు వెళ్ళుట మా

నెడివారు. 'ఏఁటేట ఇఙ్లీబదిరూపాయలు పరీక్ష దరఖాస్తు రుసుము రూపమున విశ్వవిద్యాలయమునకు వార్షికము నంపు చుందురా' యని శ్రీ నాయఁడుగారిని వారి మిత్రులు గేలి సేయుచుండిరి. బహుశః శ్రీ నాయఁడుగా రప్పటికి భగవం తుఁడుతన్ను న్యాయశాస్త్రాభ్యాసమునకుఁగాక దానికంటె నున్న తమైన ప్రేమజీవనమునకొఱకుమాత్రమే సృజించెననుట గుర్తింప రైరేమో!

ఈ రీతిని శ్రీ వేంకటరత్నమునాయఁడుగారు తన యిరు వదిమూఁడవయేట నాంగ్లేయ కళాశాలలో పట్టభద్రు లగుటయే గాక పర్షియను, అరబ్బీభాషలుకూడ నేర్చుకొనిరి. మహమ్మ దీయుల పవిత్రగ్రంథమగు ఖురానును నరబ్బీభాషలోఁ బఠించిరి. విగ్రహారాధనమునందలి వాస్తవిక స్వరూపము నాకళింపుచేసి కొనిరి. "సూఫీ" లను మహమ్మదీయ భక్తాగ్రేసరులు వ్రాసిన వ్రాఁతలు హైందవ వేదాంతసారముతో నేకీభవించుటను జూచి యాశ్చర్యము నందిరి. తమ తండ్రిగారి 'బదిలీల' వలన చాలఁగాలము మహమ్మదీయ ప్రభువుల పాలనములో నున్న ప్రాంతములందు నివసించుటచే నిస్లాము సంప్రదాయములును, వేషభాషలును చిరుతప్రాయముననే వారి కబ్బినవి. పై జామా నుదొడిగి, షెర్వానీ ధరించి, తెల్లని పాగా తలకుఁజుట్టి, హాఫీజు రూమీ సాదీ మున్నగు సూఫీ భక్తుల గ్రంథములనుండి యనే కోదాహరణము లిచ్చుచుఁ జిన్ననాఁడే శ్రోతల నానందాబ్ధి నోలలాడించెడివారు.

వారి విద్యావ్యాసంగ మెప్పటికప్పుడే యంత మగునట్లు గాన్పించెడిది. కాని దైవానుగ్రహమే వారి నట్లు విద్యాప్రవా

ర్ణులను గావించినది. శ్రీ నాయఁడుగారి జనకులతో వారితోడి సైనికోద్యోగులు "మీ వేంకటరత్న మింకను జదుకొనుచునే యున్నాఁడందురే దానికంతములేదా" అని పరిహాసముఁ జేయుచుండెడివారు. శ్రీ అప్పయ్యసుబేదారుగారి మఱియొక సుబేదారు మిత్రుఁడు 'మీ వేంకటరత్నము ఎం. ఏ, చదువుచున్నాఁడంటిరే, దానితరువాతనింక నేమైన టి. ఏ. యున్నదా!" యని చమత్కరింప శ్రీనాయఁడుగారి తండ్రిగారంత విద్యావంతులు గాకపోయినను విద్యాగౌరవము నెఱిఁగియుండుటనుబట్టి చదువుకొనవలెనను నభిలాషయున్నంతవఱకు నాపుత్త్రుఁడు చదువుకొనవలసినదే" యని వారు కృతనిశ్చయముతో సమాధానమిచ్చుచుండిరి. శ్రీ నాయఁడుగారి విద్యాభ్యాసమునుగూర్చి తండ్రిగారెంతశ్రద్ధనుజూపిరో దీనివలన మనకు దెలియగలదు.

శ్రీ నాయఁడుగారు 1891 సంవత్సరమున ఎం. ఏ డిగ్రీని; 1897 వ సంవత్సరమున ఎల్. టి. డిగ్రీని పొందిరి.

## 6. శ్రీ నాయఁడుగారు — మదరాసు బ్రాహ్మసమాజము.

చిఱుతప్రాయమునుండియు బ్రాహ్మసమాజమునిన నొక యావేశము, నుత్సాహమును శ్రీ నాయఁడుగారికిఁ గలవు. అయినను నాయుత్సాహము క్రియారూపము దాల్చి వారు బ్రాహ్మమతావలంబులగుట కేవలము పండిత శివనాథశాస్త్రి గారిమూలముననేయని చెప్పక తప్పదు. 1881 సం॥న శ్రీ నాయఁడుగారు ఎఫ్. ఏ. తరగతిలో జదువుచున్నపుడు కలకత్తా సాధారణ బ్రాహ్మ సమాజ సంస్థాపకులును, ప్రచారకులు నగు

పండిత శివనాథశాస్త్రి ఎం. ఏ. గారు మదరాసువచ్చి, బ్రాహ్మసమాజమతమును గుఱించి జడివానలవంటి గంభీరోపన్యాసము లొసంగి నవభాజనములవలె నున్న విద్యార్థుల హృదయక్షేత్రములందు బ్రాహ్మమత బీజముల నంకురింపఁజేసిరి.

శ్రీ శాస్త్రిగారు తమ జీవిత మంతయు భగవత్సేవా కైంకర్యముల కర్పిత మొనర్చిన మహావిద్వాంసులు. మేటి వక్తలు. వారి ముఖమునుండి నిర్గతమైన ప్రతివాక్యమును శ్రోతల హృదయముల సూటిగా జొచ్చుకొని వారి సందేహాంధకారమును పటాపంచలుచేయజాలి యుండెడిది. ఋషితుల్యులును, విద్వాంసులునైన శ్రీ శాస్త్రిగారు యువకులైన శ్రీ నాయఁడుగారి హృదయముపై విశ్వాస ముద్రను నాటి కొలఁది దినములలోనే వారి విశ్వాసమును జూఱగొనిరి. శ్రీ నాయఁడుగారు శ్రీ శివనాథశాస్త్రిగారి నాధ్యాత్మిక మార్గదర్శిగా నంగీకరించి వారియొద్దనే బ్రహ్మోపదేశము నందిరి. నాఁటినుండియు శ్రీ నాయఁడుగారికి పండిత శివనాథశాస్త్రిగారివంటి మహాపురుషులచేఁ బోషింపఁ బడిన బ్రాహ్మసమాజమున కుచిత రీతిని తాముగూడ పాటుపడి సేవచేయవలెనను కోరిక గాఢమయ్యెను. "ఉన్నతపదవులకు గాని, యార్థికాభ్యున్నతికి గాని పాటుపడక, సత్యపంథానువర్తియై భూతదయయే పరమధర్మముగా నెంచుట మోక్షోపలబ్ధికి ముఖ్యమార్గ" మని యానాఁడు బోధించిన పండిత శివనాథశాస్త్రిగారి యుపన్యాసోపదేశవాక్యములే శ్రీ నాయఁడుగారి చెవిలో మరణాంతము మాఱుమ్రోగుచుండె

డివి. అవియే వారి కుత్సాహమును జనింపఁజేసి కార్యశూరులనుగాఁ జేసినవి.

1882వ సం॥లో శ్రీ నాయఁడుగారికి బ్రిహ్మమతావలంబకు లయిన శ్రీ మన్నవ బుచ్చయ్యపంతులుగారి పరిచయ సహవాసభాగ్యము లబ్బుటచే బ్రిహ్మసమాజమతమునం దభిమాన మెక్కువయ్యెను. శ్రీ నాయఁడుగారి హృదయమున నదివఱకే యంకురించియున్న బ్రాహ్మమతబీజము క్రమక్రమముగా మొలకెత్తి మ్రానుగట్టి వృక్షము గాఁజొచ్చెను. శ్రీ బుచ్చయ్య పంతులుగారు నిరుపమానులైన యీశ్వరసేవకులు. "బ్రాహ్మధర్మమును" దెలుఁగున వ్రాసి ప్రచురించి యాంధ్రులకు బ్రాహ్మధర్మ సువార్తను, సందేశమును నందఁజేసిన పుణ్య పురుషులు. బ్రిహ్మస్తోత్రము బ్రిహ్మసద్య కల్పకము, ఈశ్వర స్తవములఁ దెలుఁగున ముద్రింపించి, యాంధ్రులలో బ్రహ్మజ్ఞానమును పెంపొందించిన మహామహులు. బ్రాహ్మసమాజ ఎసైలమ్ ముద్రాక్షరశాలను స్థాపించి, బ్రాహ్మవాఙ్మయమును ప్రచారములోనికిఁ దెచ్చి దక్షిణదేశబ్రిహ్మసమాజమున కొక స్వరూపమును జిత్రించి తీర్చి దిద్దిన మహాపురుషులు. దక్షిణ ఇండియా బ్రాహ్మసమాజ మందిరనిర్మాణమునకై కేయుంబవళ్ళు విరాళముల సేకరించి మందిరనిర్మాణమును గావించి 1-1-1885 సం॥న కలకత్తానుండి పండిత శివనాథశాస్త్రిగారిని రావించి వారి పవిత్రహస్తములచే భగవదర్పితము గావింపఁజేసినట్టి ఘనులు. వారి పవిత్రకార్యనిర్వహణమునకై శ్రీ నాయఁడుగారుకూడ వాడవాడలఁ దిరిగి, సహా

కరించి తమ పర్యవేక్షణక్రింద సమాజమును నిర్మింపఁజేసినారు. బ్రాహ్మసమాజ "రేగడ్ స్కూలు" ను స్థాపించుటకు శ్రీ నాయఁడుగారే కారకులు. మదరాసులోని యన్నదానసమాజమున సభ్యులై దాని యున్నతికై విరాళముల నొసగూర్చి యాపాఠశాలలోని విద్యార్థులకు మాధ్యాహ్నికభోజన మా యన్నదానసమాజమునుండి వచ్చు నేర్పాట్లను జేసి పలువురి మన్ననలకుఁ బాత్రులైరి.

ఈదినములలోనే ఛానింగు, పార్కరులయొక్కయు, ఫ్రాన్సిస్ కాబ్ మార్టినోలయొక్కయు రచనలు వారి దృష్టి నాకర్షించి హృదయము నుజ్జ్వలింపఁజేసినవి. ఈ యుదారాశయుల రచనలమూలముగా వారి హృదయశక్తియొక్క యమూల్యావేశము శ్రీ నాయఁడుగారికిఁగూడ సంక్రమించెను. కాబ్ కన్య యొక్క 'రెలిజియస్ డ్యూటీ' యనుమహత్తరగ్రంథమునుచదివి వారుముగ్ధులైరి. అప్పుడప్పుడు శ్రీనాయఁడుగారు, వారియువక మిత్రులతో రతనుబజారులోని తమ సౌధాగ్రమున నిష్టాగోష్ఠి సలుపు సమయములం దాగ్రంథములోని 'వందనసమర్పణ' మను ప్రకరణమునందలి కొన్నిభాగములను జదువుచు నిర్మలానందముతో వారిని విస్మయచిత్తులుగ నొనర్చెడివారు. అన్నిటికన్న శ్రీ నాయఁడుగారు ఇంగ్లండు దేశపు ఋషిపుంగవులైన 'డాక్టరు మార్టినో' మహాశయుల రచనలచే హృదయమును మిక్కిలి యుజ్జ్వలము గావించుకొనిరి. గతశతాబ్దిలో నింగ్లండుదేశమున నిరీశ్వరవాదము వెల్లువఁగాఁ బ్రవహించి యాదేశమునకుఁ బ్రళయము కలుగఁజేసినకాలమున డాక్టరు

మార్టినో యొక్కఁడే నిశ్చలభూధరమువలె నిలిచి, నిరీశ్వర వాదులలో నగ్రగణ్యులయిన టిండాల్, హక్సులే, స్పెన్సర్లను ధైర్యసాహసములతోఁ బ్రతిఘటించి, యాస్తికవాదము వైపు ప్రజలను మరల్చి, వారికి భగవదాస్తిక్యబుద్ధియందు సహేతుకము, న్యాయసమ్మతము నయిన విశ్వాసమును పాదుకొల్పెను. మార్టినో మహాశయులు వ్రాసిన 'మతపరిశీలనము - దాని మూలము - అవధి' యను గ్రంథము శ్రీ నాయఁడుగారి హృదయముపై శాశ్వతవిశ్వాసమును ముద్రించిన దనిన నాశ్చర్యమేమియు లేదు. బ్రహ్మాండ మగు విషయములను యుక్తియుక్తముగను, హేతుబద్ధముగను నిర్ధారణ మొనర్చుచు, వైజ్ఞానికప్రమాణముల నుదహరించుచు, మనోహర మగు మంజుల శైలితో, హృదయము నావేశపూరితముగా నొనరించునట్లు వ్రాయఁబడిన యాగ్రంథ మైహికజీవితము నెట్లు మధురవంతముగాఁ జేయకుండఁ గలదు ? హైందవవేదాంతశాస్త్రమును, సంస్కృతసారస్వతమును సమగ్రముగఁ బరిశోధించి వానియెడ నెంతో మమతఁ జూపునట్టి బ్రాహ్మసారస్వతపితామహుఁ డనఁదగు 'సీతానాథతత్త్వభూషణ' పండితుఁడు సహితము 'మార్టినో' మహాశయుని గ్రంథములను బఠించిన తరువాతనే తమ కాధ్యాత్మికభావవికాసము గలిగిన దని నుడివియుండెను. అట్టియెడ శ్రీ నాయఁడుగారి మనస్సీమ నం దాధ్యాత్మికబీజములు మొలకెత్తుటకు 'మార్టినో' గ్రంథములే తొలకరివర్షము లయిన వని చెప్పుటలో నాశ్చర్యము లేదు. సమాజప్రార్థనాసమావేశములందు శ్రీ నాయఁడుగారిచే

'మార్టినో' గ్రంథములనుండి యెత్తి చూపఁబడిన సూక్తులు శ్రోతలను 'మార్టినో' గ్రంథములను జదువవలె నను నిశ్చయమునకుఁ బురికొల్పెడివి. మార్టినో వ్రాసిన గ్రంథములను జదువుట యనిన స్వర్గధామమునందలి శాంతివాయువులను బీల్చి పరమేశ్వర సాన్నిధ్యమును జేరుటయే యగు ననిపించెడిది.

శ్రీ నాయఁడుగా రాంగ్లమున లభించినంతవఱకు బ్రాహ్మసారస్వతమును సమగ్రపఠన మొనరించిరి. సంగత్సభలలో నొక్కొక్కప్పు డాయన శ్రీ రాజా రామమోహనరాయల వారి 'తుహ్ఫతుల్ మువహిద్దీన్' అను గ్రంథమునుండి మృదుమధుర వాక్యముల నెత్తి యుదాహరించి రాయలవారి కుశాగ్రబుద్ధిని, సత్యదృష్టిని మెచ్చుకొనుచుండెడివారు. మఱికొన్ని సమయములందు మహర్షి దేవేంద్రనాథ ఠాకూరుగారి యపూర్వానుభవములను వర్ణించుచు, భక్తియుతమగు వారి ప్రవచనములను విపులీకరించి, వారి ధ్యాననిష్ఠాగరిష్ఠతకు మిత్రులు మెచ్చునట్లు జేసెడివారు. ఇంకను కొన్ని వేళలందు బ్రహ్మానంద కేశవచంద్రుల గ్రంథములనుండి కొన్ని వాక్యములను జదివి మత ప్రపూర్ణమగు వారి జీవిత వాహినిలో నెటు లెంతటి కష్టపాషాణము లైనను కొట్టుకొనిపోవుచుండెడివో సహచరులకు నిరూపించెడివారు. మఱికొన్ని వేళలందు ప్రతాపచంద్ర ముజుందారుల గ్రంథముల నుండి మధురవచనములను జదివి సామాజికుల నానందింపఁజేసెడివారు. ఇంకను గొన్ని వేళలందు శివనాథశాస్త్రి పండితుల జీవితోదంతమును చెంతఁ గూడిన సోదరబృందము

నకు వినిపించి యందలి గంభీరనీతిని వారి మనస్సులందు నాటు నట్లు చేసెడివారు.

ఏమహానుభావుని కర్మక్షేత్ర మింతవిశాలమై, శక్తిమంతమై, యలోకసామాన్యమై యుండెనో, ఫలానుభవ మిట్లు యుగయుగాంతవ్యాప్తమై యుండెనో, యా పురుషోత్తముని హృదయమును దెలిసికొనవలసినయెడలఁ గొంచెము సూక్ష్మదృష్టితో, గంభీరభావముతో నాలోచింపవలసియుండును. శ్రీ నాయఁడుగా రింతింత ఘనకార్యములను జేసిపోయెనుగదా! ఆయన స్వయముగా నెట్టి లోకోత్తరమానవుఁడై యుండెనో యాలోచింతము. విద్యార్థిదశయం దాయన పలువు రాంగ్లేయులతోడను, సమగ్ర పాశ్చాత్య నాగరికతా ప్రపంచము యొక్క సాహిత్యముతోడను, ఇతిహాసములతోడను విశేషపరిచయము నొందిరి. దీనిఫలముగా మఱికొన్ని యున్నతాదర్శము లాయనహృదయసీమయం దుజ్జ్వలములై ప్రకాశించెను.

శ్రీ నాయఁడుగారు నవసంజీవినీ శక్తియుతులు. వారెన్నో మహాకార్యములనుజేసియుండిరి. నిశ్చయమే. కాని, యవి యన్నియు తేజోవంతమును, సరసమును నగు వారి మహాప్రాణశక్తియొక్క చిన్నచిన్న ప్రకాశమాత్రములు. వారి దృష్టి సుదూరప్రసారితము. వారి కార్యముల ఫలము సుదూరగమ్యమనుమాటయు నిశ్చయమే, వారు కేవలము బుద్ధి ప్రచోదితము లగు తమ యభిప్రాయములచే నడుపఁబడు మానవులేకాక హృదయావేగముచే నడుపఁబడెడివారు. వారి కార్యములయొక్క ప్రధాన ప్రేరణము

కేవల మానవబుద్ధినుండియు, ప్రతిభనుండియు మాత్రమే యుత్పన్నముగాక సంజీవినీశక్తిభరిత మగు వారి హృదయసరో వరమునుండి ప్రాదుర్భావ మొందినది. ఇదివారి యంతర్జీవన రహస్యము. దానిని వారు తమ విద్యార్థి దశయందే నల వఱచుకొనిరి. ఈవిద్యార్థిదశయందే ప్రకృతిగతగంభీరత్వము, రాగయుతవైష్ణవభావము, నీరెంటికిని దోడు,మఱికొన్ని నూతన ప్రభావములు శ్రీనాయఁడుగారి జీవితమునందుఁ బ్రవర్ధితము లయినవి.

## 7. శ్రీ నాయఁడుగారి వైవాహిక జీవితము.

సుబేదారు అప్పయ్యనాయఁడుగారు శ్రీ నాయఁడుగారికి 'శేషమాంబ' యను సత్కుల సంజాతనెంచి యతివైభవముతో వివాహ మొనరించిరి. ఆమె స్ఫురద్రూపి. కరుణాంతఃకరణము గలది. వినయసంపన్న. భక్తిపరురాలు. గృహనిర్వహణమునం దందెవేసిన చేయి. భర్తృబాంధవమిత్రరాజియెడల దయగల్గి సదా భర్తృసంసేవనమునందే కాలము గడపుచుండెడి పరమ సాధ్వి. ఆమె చిన్నతనమున తఱచుగా నిరుగుపొరుగు మహమ్మ దీయ గృహముల కేఁగెడిది. మహమ్మదీయ స్త్రీలామె నెక్కు వగా ప్రేమించెడివారు. ఆమె గృహస్థాశ్రమమునఁ దన కోమల హృదయముతోఁ దన దేవు "నల్లా" యని బిలిచెడిది. ఇది మహమ్మదీయుల హృదయమున గాఢమైన విశ్వాసమును నెలకొల్పెను. అల్లా యన్నను పరబ్రహ్మమన్నను నొక్కటే యను ధర్మసూత్రమును జిన్ననాఁడే యామె గుర్తించియుండెను.

భర్తగారి బ్రాహ్మధర్మమును స్వీకరించి మనోవాక్కాయకర్మముల నాధర్మమును బాటించునెడ నామె యత్తమామల కోపమునకుగూడ గుఱియగుచుండెడిది. కాని యంతఃకరణమునందైనను భర్తృ భావములఁ జవదాటి సంచరించెడిదికాదు.

అన్యోన్యానురాగముతో వైవాహికజీవితమును సాగించుచుండిన యీ పుణ్యదంపతులకు 1887 సంవత్సరమున మొదటిసారి యొక పుత్రరత్న ముదయించెను. కాని యాబిడ్డ డొకటిన్నర మాసములు మాత్రమే బ్రతికి మరణించెను. పుత్రమరణమునకై వాపోవు నాదంపతులఁ జూచి, తోడనే శ్రీ నాయఁడుగారి జనకులు "వీఁడు బ్రాహ్మసమాజములోఁ జేరి భగవంతునికి ద్రోహ మొనర్చుటచే వీని కుమారుఁడు మరణించినాఁ"డని కోపముతోఁ బలికిరి. అంతియే గాక వారు శ్రీ నాయఁడుగారి నిఁక ముందెన్నఁడును బ్రాహ్మసమాజముతో నెట్టి సంబంధమును గల్పించుకొననని వాగ్దానము చేయుమనిరి. అపుడు శ్రీ నాయఁడుగా రెంతయు సంతాపించి యానాఁడు భోజనము మానిరి. తలిదండ్రు లంతటితో నూరకొనక, నారి సతీమణి కడకేగి "నీవు మావానిని సమాజమునకుఁ బోకుండ మాన్పింపలేవా?" యని యడుగ నామె సందేహింపక "నేనట్లు వారికిఁ జెప్పుట కిచ్చగింప"నని జవాబిచ్చెను. అప్పుడు శ్రీ నాయఁడుగారి జనకులు తామే యిల్లు విడిచి యెందైనఁ బోదుమని కోపముతోఁ బల్కిరి. అంత శ్రీ నాయఁడుగారి జనని కుమారునితో నింట నుండుటయా, భర్తను వెన్నంటిపోవుటయా, యను సందిగ్ధస్థితి వృద్ధాప్యమునకుఁ దోడుగాఁ దన్ను బాధింప

కుమారుని గౌఁగిలించుకొని "నాయనా నేనేమి చేయుదును. మన యింట నీ ప్రహ్లాదనాటకము జరుగుట నాకు బాధగా నున్నది. మీ తండ్రి కొడుకుల తగవులాట యేమియు బాగుగా లేదని" పలుకుటయు నప్పుడు శ్రీ నాయఁడుగారు తమ యుద్రేకమును సవరించుకొని మాతృదేవత నారాధించిరి. శ్రీ నాయఁడుగారి సోదరులు శ్రీ వెంకయ్యగారు బయటకు వెడలి యన్నగారికి బుద్ధి చెప్పించు నుద్దేశముతో నిరుగుపొరుగువారిని దీసికొని వచ్చిరి. భోజనానంతరము శ్రీ నాయఁడుగారి జనని వారితో "నాయనా నీవు నీ మతమును విడిచిపెట్టవలసినదని నేను గోరుటలేదు. కొన్ని వారములు సమాజమునకుఁ బోవుట మాత్రము మానుమ"ని వేఁడుకొనెను. అప్పుడు శ్రీ నాయఁడుగారి మనస్సులో నొక తీవ్రసంఘర్షణము జెలరేగి, తుదకు వారు జననిమాట కెదురాడకుండుట జరిగెను. అంత నామె భర్తయొద్ద కేఁగి "పై వారమునుండి మనవాఁడు సమాజమునకిఁక వెళ్ళఁడు మీకింకను వానిపైఁ గోపమేల" యని వారిని దాత్కాలికముగా సమాధాన పఱచెను.

కాని యింటఁ బరుషవాక్యములతోఁ దండ్రిగారు తమ్మింకను బాధించుచున్నకొలఁది వారు భరింపలేక, యొకనాఁడు తమ సతీమణితో "మనమిట్లనేక విధముల బాధపడుటకంటె సమాజపుగొడవ వదలిపెట్టుటయే మంచిదిగాఁగాన్పించుచున్నది. నీవేమందువు?" అని ప్రశ్నించుటయు నందులకామె సూటిగా "నాకాసంగతి తెలియదు. మీరుమానుకొనిన మానుకొనుఁడు. నేనుమాత్రము బ్రాహ్మసమాజమునకుఁబోకమానను. ఆ ధర్మము

నువిడువ"ను" అని గట్టిగాఁజెప్పెను. అప్పుడు శ్రీనాయఁడుగారామె ధృడసంకల్పమునకు మెచ్చి నిజమునకదియే తమయభిమతమని పలికిరి.

శ్రీనాయఁడుగారిధర్మము బ్రాహ్మధర్మమయినను వారితండ్రిగారిది వైష్ణవసంప్రదాయమగుటచే శ్రీకృష్ణుని చిత్రపటములు శ్రీనాయఁడుగారి పడకగదిలోఁ వ్రేలాడుగట్టఁబడి యుండెడివి. తమసిద్ధాంతమునకట్లుండుట పూర్తిగా విరుద్ధమేయైనను దమకు దండ్రిగారి యెడలఁగల భక్తిభావమునుఁ బురస్కరించుకొని వానినిగూడ శ్రీనాయఁడుగారు గౌరవించుచునే యుండెడివారు.

శ్రీనాయఁడుగారికిని వారిపెద్దలకునుగల యాత్మీయ సంబంధములు దైవవిధినట్లుండుటచేఁ గాఁబోలు నానాఁటికి మరింత విషమించుటయు వారు గృహమును వీడుటయు జరిగెను. ఇతరగ్రామములలోఁ దాముద్యోగస్వీకరణము గావించుట, తలిదండ్రులకు దూరముగానుండుట యీ మతవిభేదముల మూలముననే యని గ్రహింపనగును.

1889 వ సంవత్సరమున శ్రీనాయఁడు గారికి గళత్రవియోగము సంభవించెను. సాధ్వీలలామయగు శేషమాంబగారొక పుత్రికఁగని పరమ పదించిరి. అప్పటికి నాయఁడు గారివయస్సిరువది యేడేండ్లుమాత్రమే. అయినను గీర్తిశేషురాలయిన తమయర్ధాంగి యందలి ప్రేమచే వారు మరల వివాహము జేసికొనలేదు. సంపూర్ణమైన విద్య, నిండుయౌవనము, చక్కదనము, సుగుణసంపద, మున్నగుయోగ్యతలు గలిగియుండుటచే శ్రీనాయఁడుగారు వివాహమాడుట కిచ్ఛగించినచో గొప్ప

పదవులలో నున్న తెలగా లెందరెందరో గొప్ప కట్న ములఁ గానుకలనిచ్చి తమకన్యల నిచ్చియుందురు. కొందరు జమీందారులు వాస్తవముగా వారి పుత్రికలనిచ్చి శ్రీనాయఁడు గారి కుద్వాహ మొనరింపఁబోయిరి. కాని శ్రీ నాయఁడుగారు వివాహమునకియ్యకొనరైరి. జన్మమున నొక్కసారియేవివాహ ముగాని రెండవసారికూడదని మనస్సున సిద్ధాంతీకరించుకొనిన యేకపత్నీవ్రతశాలి శ్రీనాయఁడుగారు. వాయుభక్షులై పర్ణభ క్షులై, గహనాంతరములఁ జిరతపస్సొనర్చి జితేంద్రియులైన యార్యఋషులవలె సంఘమధ్యమునసుండి సకల సౌఖ్యములననుభ వింపఁగల మానవులు తమ యింద్రియముల నిగ్రహించుకొను టయెంత కష్టమో యూహింపుఁడు. అర్ధశతాబ్దమునకు వార మోషుముగా సాగించిన యంతర్బాహ్యేంద్రియ నిగ్రహము శ్రీరాముని దలపునకు దెచ్చునదై యుండును "సతాం కేనో ద్దిష్టం విషమ మసిధారావ్రతమిదమ్"అను నార్యోక్తిపీరియందు యథార్థమైనది. ఈయేబదేండ్లు బ్రహ్మచర్యమునకుంతితదీక్షతోఁ బాలించిన శ్రీనాయఁడుగారిమృతకళేబరముయొక్కహృదయపీఠిపై వారిసతీమణి ఛాయాచిత్రమునుంచిదహన సంస్కారము గావించు నప్పటి దృశ్యము చూచినవారికి బూర్వభారతసంయముల గాథ లొక్కసారిగ జ్ఞప్తికివచ్చినవి. శ్రీనాయఁడుగారి దివ్యవ్రతమే యాంధ్రయువకుల కాదర్శమైనది. వారి నిష్కళంక చరిత్రయే వారిప్రియశిష్యులైన డాక్టరు రామకృష్ణారావుగారికి మార్గదర్శ కమై వారి నస్ఖలితబ్రహ్మచారిగఁ జేసినది. తమ శిష్యులగు శ్రీవేమూరి రామకృష్ణారావు పండితులనుగూర్చి తలచినప్పుడెల్ల

శ్రీ నాయఁడుగారు తమశిష్యుని నిష్కళంకజీవితమునకు నస్ఖలిత బ్రహ్మచర్యమునకు నచ్చెరువందుచు "నాశిష్యుని ముందు నేనెంతటివాడను అని తమ యానందమును బ్రకటించుచుండెడివారు. ఈవిషయమున "పుత్రాదిచ్ఛేత్పరాజయమ్" అనునట్లు తమ శిష్యునిచేతఁబా మోటమి చెందుటకు శ్రీనాయఁడుగారు సంతోషమునే వెలిబుచ్చుచుండెడివారు.

## 8. వక్తృత్వము; పత్రికానిర్వహణము.

తమ వయసువా రగు యువకులు ధనసంపాదనమునకై నడుములు గట్టుచుండ శ్రీనాయఁడుగారుమాత్రము మానవహృదయమును నిర్మలముగను, నున్నతముగను జేయఁజాలునట్టి భావసముపార్జనమునకే పూనుకొనిరి. వర్డ్స్వర్తు, టెనిసను, కార్లైలు, బ్రౌనింగు, పార్కరు, ఛానింగు, మార్టినో మొదలగు మహనీయుల గ్రంథములఁ జదివి, యాంగ్లేయ సారస్వతముయొక్క సారమును జూచిరి. వారికి ధారణాశక్తి మెండు. భావమును మాత్రమే జ్ఞాపకముంచుకొనుటలో వారికిఁ దృప్తిలేదు. మక్కికి మక్కిగా వారికా పదజాలమే కావలెను. లేదా యట్టి యర్థప్రతిపాదకములైన జ్ఞాపకముంచుకొనుటకు వీలుగా నుండునట్టి యొకటి రెండు మాటలైనను గావలెను. తొలుదొల్త వారి యుపన్యాసములు వినువారి కంత యింపుగానుండెడివి కావు. పిన్నవా రగుటనో, వారి యెదుటఁ జేరిన సంఘమును జూచియో, వారు శ్రోతలపై భావ పరంపరలను నిజముగాఁ గురిపించెడివారు. వారి ధోరణియు పందెపు గుఱ్ఱపు వేగమును మించియుండెడిది. అందుచే వారి యుపన్యాసములు విను

వారికి భావవికాసము గలుగుటకు మాఱుగా వర్షము మొత్తి మొత్తి కురిసి వెలిసినట్లయ్యెడిది. కాని యచిర కాలములోనే వారిలో నపూర్వమగు మార్పు కానవచ్చినది. భావములను క్రమానుగతముగ సంధించి, చక్కని పదముల నుపయోగించి, హాస్యరస పూరితములగు నితిహాసములతో వారు మత్తగజగమన ధోరణిని మెల్ల మెల్లగ నుపన్యసించు పద్ధతి నలవఱచుకొనిరి. వారివలె విద్యాపారంగతు లనేకు లుండవచ్చును. కాని విదేశభాషయైన యాంగ్ల భాషలో నిట్టి మహావక్తృత్వ మబ్బు టరిది. వా రుపన్యసించునప్పుడు శబ్దముల నిమిత్తము ప్రయత్నము చేయనక్కఱలేక వానియంత టవియే జిహ్వాగ్రమున వచ్చి నిలిచెడివి. ఆ శబ్దసౌష్ఠవము, భావ గాంభీర్యము, ప్రయోగ నైపుణ్యము, రసపుష్టియు వారి యుపన్యాసములు వీనుల విందుగా విన్న వారికే యనుభవైకవేద్యములుగాని వాని రామణీయక మిట్టిదని వర్ణింప నలవిగాదు. శ్రోతలు మంత్రములచేతఁ గట్టువడినట్లు నిశ్చేష్టు లగుచుండెడివారు. ఆనంద బాష్పముల రాల్చెడివారు. మేనఁ బులకలు దాల్చెడివారు. ఆ యుపన్యాసముల నాకర్ణించుటొక యదృష్టమే యనవచ్చును. ఈశ్వర దత్తమగు వాక్చాతురిచే శ్రోతలను గంటలకొలఁది మంత్రముగ్ధులుగ నొనరించెడి శక్తి వారికిఁ గలదు. అట్టి శక్తిని వారు సత్య ప్రచారమునకును, ధర్మాచరణమునకును దప్ప నితర కార్యముల కుపయోగింపకుండు టొక గొప్ప విషయము.

ఆంగ్లేయ పారసీక భాషలం దాయన మంచి పండితుఁడు. వారికా భాషలందలి శక్తి సామర్థ్యము లాశ్చర్యకరములు.

వారి వక్తృత్వము సాటిలేనిది. వారి యుపన్యాసములు మనోహరములై, యుత్తేజకరములై, యాశువుగఁ జెప్పబడినను విజ్ఞానబంధురములై లిఖితోపన్యాసములవలె నుండెడివి. వారి వ్రాఁతలు, నుపన్యాసములు, గూడ ధారాళమయి మనోజ్ఞమయిన శైలితో నొప్పారెడివి. మహాకవి షేక్స్పియరు కృతుల విషయమున వారికిఁగల పాండితీ విజ్ఞానములు జగద్విఖ్యాతములు. బందరు నోబులు కళాశాలయం దాంగ్లేయోపాధ్యాయులుగా నుండి షేక్స్పియరు నాటకములఁగూర్చి నా రుపన్యసించునప్పు డైరోపా దేశీయులగు సహాధ్యాయులు కళాశాలాధ్యక్షులుకూడ శ్రద్ధతో నాలకించుచుండెడివారు. వారు శాసనసభలో సభ్యులుగా నున్న కాలములో నా సభాధ్యక్షుఁడైన సర్. లయనల్ డేవిడ్సను దొరగారే దైన సందర్భమున షేక్స్పియరు గ్రంథములనుండి వాక్యముల నుదాహరించునపుడు శ్రీ నాయఁడుగారి దెసఁజూచి యందుఁ దప్పులున్న సవరింపుఁడని పల్కుచుండెడివారు. ఇయ్యది యనన్యసామాన్యమయిన వారి యాంగ్లభాషా వైదుష్యమునకొక విమలాదర్శము.

వారు గొప్ప కావ్యములను రచించిన కవి గాకపోయినను వారి రచనలందును వారి యుపన్యాసములందును గవిత్వమునకుఁ గొదువలేదు. సృష్టియందలి ప్రతి మానవుని హృదయమును జ్వాజ్వల్యమానముగ నొనర్చు నాత్మజ్యోతియే వారి కద్భుతమగు భావనాశక్తిని బ్రసాదించినది. ఆంగ్ల సారస్వత బోధకులుగా వారికిఁగల్గిన ప్రతిభావకాశములే వారి నాంగ్ల సారస్వత కుసుమ మంజరీ సౌరభము సంతతము గ్రోలునట్లొన

ర్చి వారి భావనాశక్తిని బ్రదీప్తమొనర్చినవి. దీనికితోడు పారసీక సూఫీవేదాంత సంబంధికమగు కవనమునందుఁ గల యభిరుచియు, వివిధదేశ మత వాఙ్మయములందలి నీతికథల యెడఁ గల మక్కువయు దానికి మరింత వికాసమును గలిగించినవి. నీతిబోధకములగు చిన్నచిన్న కథలేగదా సుందరమయిన యాధ్యాత్మిక మందిరమునకు పునాదులు. మార్టినోపండితుఁడు చెప్పినట్లు మతగ్రంథములు పద్యాత్మకములై యుండవలెను. ఇట్టి పద్యరచనాప్రతిభ శ్రీనాయఁడుగారికిఁ గలదనియేమనము చెప్పవచ్చును. కాని ముఖ్యముగ వారాంగ్లసారస్వతమున వాసిగాంచిన రస్కిన్ కార్లైల్ శ్రేణికిఁ జెందినవారలగా గణింపఁదగును. ఛందోబద్ధము లగు పద్యముల వ్రాసినంతమాత్రమునఁ గవి కాఁజాలఁడు. శ్రీ నాయఁడుగారిరచన లన్నియు గద్యాత్మకములే యైనను నప్రతిమానపాండితి, ధీశక్తి, పదలాలిత్యము, నర్థగౌరవము, మున్నగు సత్కవితా లక్షణములతో విరాజిల్లు నారచనలు పద్యకావ్యములకన్న మిన్నలే యని యెన్ననగును. అగోచరము లగు నాధ్యాత్మికవిషయములను రమణీయభావనాశక్తిచే గోచరింపఁజేయవలెను కాని వానిని శాస్త్రజ్ఞుని కొలతపాత్రతోఁ గొలిచి చెప్పుట సాధ్యము గాదు.

ఆధ్యాత్మికవిషయములను బోధించుటలో మన తత్త్వశాస్త్రపారంగతులును, బోధకాగ్రణియు నగు శ్రీ నాయఁడుగారి శక్తి యద్వితీయము. నిత్యజీవితమునుండి సుపరిచితము లగు దృష్టాంతములను దీసికొని శ్రోతల మనఃఫలకములందు సుందరాధ్యాత్మికవిషయములఁ జిత్రించు నద్భుతశక్తి వారికి మెండుగాఁ గలదు.

1881-వ సంవత్సరమునాఁటికే యనఁగా, ఎఫ్. ఏ. చదువుకాలమునందే శ్రీ నాయఁడుగారు పత్రికలకు వ్యాసముల వ్రాయుచు, సభలలో మాట్లాడుచుండెడివారు. వారపుడు విగ్రహారాధనవిషయమై పత్రికలలో వ్రాయనిదే, సభలలో నుపన్యసింపనిదే యూరకుండెడివారుగారు. ఆవిషయములపై వ్రాయునప్పుడు, నుపన్యసించునప్పుడు పరవశు లగుచుండెడివారు. విగ్రహారాధనమువలని నష్టములనుగూర్చి యుపన్యసింపనిదే మతవిషయములపై మాట్లాడుట కిష్టపడెడివారుగారు. కాని రానురాను వారికీ పట్టుదల తగ్గి యాధ్యాత్మికారాధనము హెచ్చినది. విగ్రహారాధనమునుగూర్చిన హేతువాదము నిరుపయోగ మనియుఁ, గావలసినది పరమేశ్వరారాధనమే యనియు వారి యభిప్రాయము.

1885-వ సం॥న శ్రీ నాయఁడుగారు బి. ఏ. తరగతిలో నుత్తీర్ణు లయినపిదప 1886 వ సంవత్సరాంతమువఱకు 'ఫెల్లో వర్కరు', 'పీపుల్సు ఫ్రెండ్' అనెడి యాంగ్లవారపత్రికలకు సంపాదకులుగా నుండి మతరాజకీయసాంఘికార్థికవిషయముల యందుఁ దమ సునిశితభావముల వెల్లడించెడివారు. భారతీయ జనసామాన్యముయొక్క యాతిభాధలను స్త్రీల జీవితము నందలి వివిధక్లేశములను, ఆదియాంధ్రుల దైన్యజీవనమును, కేవల జాత్యహంకారోన్మత్తులైన ద్విజవర్గముయొక్క నైతిక పతనమును, మతాధికారుల యవినీతికార్యములవలన, పరదేశ ప్రభువుల పీడనమువలన గలిగిన యమాయక ప్రజానీకము యొక్క దుస్థితిని శ్రీ నాయఁడుగారు కనులారఁజూచుటచే

యాదుఃఖములను దూరీకృతము చేయుటకు వారిహృదయ మెప్పుడును సానుభూతితో నార్ద్రమై తహతహఁజెందెడిది. ముఖ్యముగా వారువిద్యానైతికాధ్యాత్మికవిషయములనేగాక సంఘదురాచార దుర్వర్తనముల మాన్పి, నాఁటిప్రజల నీతివంతులుగాఁ జేయుటకు; తద్ద్వారమునఁ బ్రజలను, దేశము నున్నతికిఁ దెచ్చుటకు యత్నించిరి. నాఁటిసంఘమునఁ బాతుకొనిపోయిన దుష్టాచారములఁ గని లంచములఁ గొను రాచకీయోద్యోగులు, వేశ్యాంగనలఁ జేరఁదీయు శృంగారపురుషులు, మూఢాచారములలో మున్కలిడు శ్రోత్రియులు, నీతిమాలిన బాహ్యవేషములను వేసికొని మతవిరుద్ధముగాఁ బ్రవర్తించు మతాధికారులు, ధర్మకర్తలు, పూజారులు, మున్నగువారిని జిన్న పెద్ద యను భేదములేక సంఘమునందుఁ గల లోపముల నెన్నింటినో సవరించుటకుఁ దమ నిశితలేఖినితో నిర్భయముగా, నిష్పక్షపాతముగా, నిస్సంకోచముగా శేముషీప్రతిభతో విమర్శించుచుండెడివారు. సంఘమునఁనైతికపతనము నొందిన వేశ్యాంగనల దుస్థితికై వగచి 'వేశ్యాంగనావృత్తినిర్మూలనోద్యమము, సంఘపారిశుద్ధ్యము' అను సంస్థల స్థాపించి, వాని సదాశయములను దన పత్రికలలోఁ బ్రకటించి, సంఘమును బాగుపఱుపఁ బ్రయత్నించెడివారు. వీని నిట్లు ప్రచారములోనికిఁ దెచ్చునప్పుడు సంఘమునందు గగ్గోలు పుట్టె,ప్రతికక్షు లెక్కువై, వారిని వారి సదాశయములను బ్రతిఘటించుచు వచ్చిరి. అట్లు వారు తీవ్రప్రతిఘటనల సాగించుచున్నను, తాము వారి యాంక్షలకు గుఱియగుచున్నను, శ్రీనాయఁడుగారు ధైర్యముతో వాని నెదు

ర్కొనిరి. ప్రతికక్షులయెడ నుదారభావముతో వ్యవహరించుట వారికి నైజగుణము. వాదక్షేత్రమునం దుదారభావప్రదర్శనము శ్రీ నాయఁడుగారి చరిత్రమునందలి యత్యుజ్జ్వల దృశ్యములలో నొక్కటి. వీరి యౌదార్యమును జూచి ప్రతికక్షులు పులకాంకితు లయిరి. ఇట్టి మహత్త్వము, ఉదారభావము వాస్తవముగా శ్రీనాయఁడుగారికి స్వభావసిద్ధములై యుండెను. ఐరోపీయ వీరధర్మముయొక్క (Chivalry) చరిత్రనుండి దృష్టాంతములను దర్శించుటచే బహుశః వారి హృదయమునందలి యీభావము మఱింత యుజ్జ్వలతరమై యొప్పెను.

9. సంఘపారిశుద్ధ్య వేశ్యావృత్తి నిర్మూలనోద్యమములు.

హిందూదేశమున బౌద్ధ యుగము, స్వర్ణ యుగము. బౌద్ధధర్మవ్యాప్తికై దేశమునందుఁ బలుచోటుల నారామములును, స్థూపములును వెలసినవి. అందలి మనోహరము లగు శిల్పములు నాఁటికిని నేఁటికి నాదర్శప్రాయములై, మకుటాయమానములై పాశ్చాత్యులఁగూడఁ జకితుల నొనర్చుచున్నవి.

బౌద్ధమతధర్మమునందుఁ గల పవిత్రవిశ్వాసముచేతను, ఆ ధర్మము వ్యాప్తి నందింపవలె ననెడి యుత్సాహముచేతను, నాఁటి ప్రభువులు, ప్రజలు తాము నమ్మినధర్మము నింటింట, వాడవాడల, దేశదేశములఁ బ్రచారము గావించుటకుఁ దమ సర్వస్వము నర్పించియుండిరి. బౌద్ధపండితులను, బాలకులను సామాన్యప్రజ లనుకరించుట సహజము గదా!

మాన్యుఁ డయిన యశోకచక్రవర్తికాలమున బౌద్ధమతవ్యాప్తి నలుదెసలను సాఁగినది. ఆ మతప్రచారమునకై చక్రి

వర్తి తన ప్రియపుత్త్రిక యగు 'సంఘమిత్ర' నర్పించి మార్గ దర్శకుఁ డాయెను. 'యథా రాజా తథా ప్రజాః' యను నార్యోక్తి ననుసరించి నాఁటి ప్రజలుగూడఁ దమ పుత్త్రులను పుత్త్రికారత్నములనుగూడ నర్పించి బౌద్ధధర్మప్రచారమున కెక్కువగఁ దోడ్పడిరి. మతప్రబోధము స్త్రీలయందుఁ గూడఁ గలిగిననేగాని యేమత మైనను స్థిరముగా నుండఁజాల దనుట యెల్లరకు ననుభవమే. పురుషుఁ డెంతటి మహోన్నతభావ ములు గలవాఁ డైనను వానిని గృహమున నాచరింపఁజేయఁ జాలకపోయినచో నాఁడువారి మూఢాచారములకు నమ్మికలకు లొంగవలసినవాఁ డగుచుండును.

సంఘమునందలి పైరహస్యమును గుర్తించిన యశోక చక్రవర్తి 'సంఘమిత్ర' నర్పించుటచే నాఁటి సామాన్య స్త్రీలును బౌద్ధధర్మావలంబకు లగుటయేగాక మతప్రచారము నకుఁ గావలసిన గాన నృత్యాదికళలం దారితేరి ప్రచారము గావించుటచేతనే బౌద్ధధర్మము బర్మా, సింహళము, చీనా, జపాను మున్నగు ప్రదేశములందుఁ గూడ వ్యాపించి నేఁటికిని చిరస్థాయిగ నుండఁగల్గినది.

కాలక్రమమున బౌద్ధమతము మనదేశమున క్షీణింప నారంభించెను. ద్వైతాద్వైతవిశిష్టాద్వైతమతస్థాపకు లగు శ్రీ మధ్వశంకరరామానుజాచార్యులవారు తిరిగి హిందూమత మును స్థాపించుటకై దీక్షఁబూని బౌద్ధమతమును ఖండింప నారంభించిరి. బౌద్ధాలయము లన్నియుఁ గ్రమముగ శైవ వైష్ణవాలయములుగ మారినవి. బౌద్ధధర్మవ్యాప్తికిఁ దోడ్పడిన

నా స్త్రీలును వారి సంతతివారును దేవదాసీసంఘముగ హిందూ సంఘముచే మార్చఁబడి దేవాలయములందు నృత్యగీతాభినయములతోఁ గాలము గడుప నారంభించిరి. ప్రప్రథమమున నవివాహితలుగ నుండి పవిత్రజీవితములఁ గడపుచు మత వ్యాప్తికిఁ దోడ్పడుటయే జీవితాశయముగా నెంచిన యీ స్త్రీలోకము తరువాత దేవాలయమతాధికారులయు, ధర్మకర్తలయు, పూజారులయు, ధనికులయు కుటిల కుతంత్రములకు లోనుగావలసినవారై తమ ధార్మికజీవితమును గోల్పోయి హేయాతిహేయమైన వ్యభిచారదుస్థితికి లోను గావలసినవారైరి.

అంధప్రాయముగ నాచారమునకు దాసిలొగ్గి హిందూ సంఘ మంతయు దేవదాసీలకు సంఘమునం దొక ప్రత్యేక స్థానము నొసంగినది. దేవుని యూరేగింపు టుత్సవములందే గాక వివాహాదిశుభకార్యములందును వీరు లేకున్నచో శోభాయమానముగ నుండదని తలంచుచుఁ బలువురు వారిచే మేళములఁ గట్టించి వినోదించుచుండిరి. ప్రజలు కళలయం దభిమానముచే కాంతల కుండవలసిన నైతికప్రవర్తన లేకున్నను లక్ష్యపెట్టక వారి నుంచుకొనుటొక గౌరవముగ, మర్యాదగ నెంచుచుఁ గాలమును బుచ్చుచుండిరే కాని యిట్టిసంఘము ప్రత్యేకజాతిగ నుండుట భారతజాతికిని, నారీలోకమునకును కళంకదాయక మని గ్రహించువారు మచ్చునకైన లేకుండిరి.

వేలకొలఁదివత్సరములు గడచుచున్నను నీసంఘమును గూర్చిగాని, దీని సంస్కరణమును గూర్చిగాని విచారించిన

వారు లేకుండిరి. ఇట్టిపరిస్థితులలో వంగదేశమున రామమోహనుఁడు జన్మించి దేశమున నంధప్రాయముగ నాచరింపఁబడుచున్న సమస్తదుష్టశక్తులను నరికట్ట యత్నించెను.

విశ్వజనీనమైన బ్రాహ్మమతమును స్థాపించి ఈశ్వరపితృత్వమును సర్వమానవసౌభ్రాతృత్వమును బ్రజలలోఁ బాదుకొల్పెను. ఈ దివ్యమతధర్మములు క్రమముగాఁ బ్రచారములోనికి వచ్చి నవ్యాంధ్రనిర్మాత లయిన వీరేశలింగము, వేంకటరత్నముగారల నాకర్షించినవి. వీ రిరువురును బ్రాహ్మమతావలంబకులై దక్షిణభారతములో సూర్యచంద్రులై యనాచారాజ్ఞానాంధకారములఁ బాఱఁదోలిరి. ఈ రెండుజ్యోతులు చిరకాలము ప్రకాశించి తమ తేజము దశదిశల వ్యాపింపఁజేసి తప్పుదారిని బోవు పెక్కండ్రను జీఁకటినుండి మరలించి, యుత్తమమార్గమున నడిపించి, నేఁ డస్తమించినను నమ్మహాజ్యోతుల ప్రభ యాంధ్రదేశమున సంఘమతసంస్కరణాధ్యాయములలో మొట్టమొదటఁ జేర్కొనఁబడుచు, కనఁబడక యే యాంధ్రదేశమునఁ బ్రతి గృహమునను, బ్రతి పతితునందును, బ్రతియనాథయందును దీఁగలలో విద్యుచ్ఛక్తి లీనమైయున్న తెఱఁగున మాటుపడియుండి సన్మార్గమును జూపుచున్నవి. శ్రీ పంతులుగారు జీవితాంతము నెడతెరిపిలేక సంఘదురాచారములను రూపుమాప యత్నించిరి.

శ్రీ పంతులుగారు నూతన బీజములు నాటి పరమపదించినను కళావంతులపాలిటి కల్పతరువైన శ్రీ వేంకటరత్నము నాయుఁడుగారు తమ యపార ప్రేమను వర్షింపఁజేయుచుఁ గళా

వంతులసంస్కరణోద్యమమునకు వాస్తవముగఁ బునాదులువైచి తోడ్పడినారు. శ్రీ నాయఁడుగారు వేశ్యావృత్తిలో మగ్గి మాడిపోవుచున్న మహిళల నుద్ధరింపఁ గంకణముపూని కార్యరూపమున సంస్కరణమునకు గడంగిరి. ఆంగ్ల సారస్వతోపాధ్యాయులుగ నున్న తరుణమున, బందరు పట్టణమునందలి విద్యార్థులకు వారి యపార ప్రజ్ఞవలన మహాపురుషుల జీవితాఖ్యానములలో చిట్టిపొట్టి కథలలో, పరిహాసములలో విద్యార్థులకుఁ దెలియకుండునట్లుగనే వారికి చిత్తసంస్కారము గల్గించెడివారు. వేశ్యలలోఁ గూడ మాతృస్వరూపమును వెల్లడించినారు. పతితులలో నీశ్వరుఁ బతితపావనరూపమును జూపెట్టినారు. పాపపంకముచాటునఁ బవిత్రతను జూడఁగల విశ్వాసము, దైన్యమున ఆత్మగరిమను బ్రతిష్ఠింపఁగల ధీరవృత్తిని, దౌర్బల్యమున శక్తిని సాధింపఁగల యుపాసనాబలమును విద్యార్థులకుఁ జూపెట్టి వారిని దమఁ పాదపీఠమునకుఁ గట్టివైచుకొనినారు.

వేశ్యలలో మాతృస్వరూపమును వెల్లడించి శిష్యులవలన మేళముల నిరసించునట్లు ప్రతిజ్ఞాపత్రములఁ గైకొని ప్రోత్సాహపఱచిరి. ఇట్లు ప్రతిపట్టణమునకుఁ బోయి ప్రబోధముగావించి వారలలో నైతికబలమును బెంపొందించి, ప్రతి పట్టణమందును 'సంఘ పారిశుద్ధ్యము - వేశ్యావృత్తి నిర్మూలనోద్యమము' అను సంఘములను స్థాపించి, వారినుండి ప్రతిజ్ఞాపత్రములఁ గైకొని, పవిత్రసంఘముల నెలకొల్పి గొప్ప యాందోళన గలుగఁజేసిరి. అందువలన శ్రీ నాయఁడుగారిపై నప్పటి సంఘము కొంత దండెత్తెను. అనేకు లనేకవిధములఁ దీవ్రప్రతిఘటనకుఁ బూను

కొనిరి. కొందరాయుద్యమము నడవిబాతుల వేఁటాడుటవంటి దనిరి. అది మత సంబంధమైన దనియు, దానిని సంస్కరింపఁ బూనుట తప్పనియు మఱికొందరు వాదింపఁబూనిరి. యోగ్యులు గొప్ప సంస్కర్త లని పిలువఁబడువారు సయితము హిమాలయముల పెకలింపఁబూను టెట్లనో వేశ్యావృత్తి నిర్మూలన మొనర్ప నెంచుటయట్టిదేయనియు, నది వట్టి భ్రమాత్మక మైనదనియుఁ బలుకుచు శ్రీ నాయఁడుగారిని బెక్కువిధముల నిరుత్సాహపరుపబూనిరి. అర్థములేని వేళాకోళములతో వెక్కిరింతలతోఁగూడిన దినము లెప్పటికైన గతించి సంఘమునందు దైవానుగ్రహమువలనఁ బ్రబోధము కలుగకుండునా యని శ్రీ నాయఁడుగా రాశించి ధ్యానింపని దినము లేదు.

ప్రార్థనా శీలురగు శ్రీనాయఁడుగారు కళావంతుల యభాగ్యజీవితమునకయి యంగలార్చుచు నిట్టి దుర్భర దురాచారము నశించిపోవలెనని పరమేశ్వరు నొకవైపు ప్రార్థించుచుఁ దమ విద్యార్థుల సాహాయ్యముతో దీని నెదుర్కొనుచు గొప్పయాందోళనము లేవఁదీసిరి.

బాహ్యప్రపంచమున కళావంతుల సంస్కరణమున కనుకూలముగ నాందోళనముచేయుచుఁ దోడ్పడుచుండఁ గళావంతులలో మాత్రము కదలికలేక యెట్లుండఁగలదు? ప్రతి దేవదాసీ హృదయమునందును గొప్ప సంచలనము బయలుదేఱెను. మంచిచెడ్డల నరయక యంధప్రాయముగ గతించిపోవుచున్న స్వీయజీవితములను వారు పరీక్షించుకొనుట ప్రారంభమాయెను. ప్రతి వేశ్యాగృహమునను దీనినిగూర్చి చర్చలు, సంభాషణలు బయ

ల్వెడలెను. విద్యాధికులందుగూడ గొప్ప సంచలనము గల్గెను. వాదోపవాదములు చెలరేగెను. శ్రీనాయఁడుగారి ప్రియశిష్యులగు గుడిసేవ సుబ్బయ్య మున్నగు సంస్కరణపరాయణుల చేయూతఁతోఁ గళావంతుల సంఘసంస్కరణసభలు ప్రారంభమైనవి. వైవాహిక సంఘములు నెలకొల్పఁబడినవి. విద్యాసంఘములు వర్ధిల్లినవి. ప్రచారకమండలులు ప్రబలినవి. వార్తాపత్రికలు వెలసినవి. ప్రస్తుతమున్న బాలికలకెల్ల వివాహములు జరుపు పట్టుదల పెరిగినది. ఇంతటి గొప్పమార్పు యర్ధశతాబ్దిలోఁ గలుగుటకు శ్రీ నాయఁడుగారి తపస్సు, వారి కార్యాచరణము, వారి శిష్యుల యుత్కృష్టసేవలే కారణములని చరిత్ర నిర్ధారణచేసినది. ఇట్లు కళావంతులలోనే చైతన్యము గలిగినంతనే శ్రీ నాయఁడుగారి కృషి ఫలించెను. నోటిమాటలతోనుఁ, ప్రసంగములతోను గాలము పోనీక శ్రీనాయఁడుగారు కళావంతుల బాలురలో విద్యావ్యాప్తిగల్గి వారితరవృత్తులఁ జేపట్టునప్పుడు వారియందాత్మశక్తి విజృంభించి వారి గౌరవమును కాపాడుకొందు రని తలఁచి, కళావంతుల విద్యార్థులకు సర్వవిధములఁ దోడ్పడసాఁగిరి. ఇంతేగాక యే బీదదేవదాసియైనను తన పుత్రికకు వివాహ మొనర్చెద నని చెప్పి వివాహవ్యయమునకుఁ దోడ్పాటు కావలె నని యడుగుటయే తడవుగ శ్రీనాయఁడుగారు సంతోషముతో సాయ మొనర్చెడివారు. ఈరీతిని శ్రీనాయఁడుగారు బాలికల వివాహములకు, బాలుర విద్యకు సహాయపడియు, విద్యయందారితేఱినవారి కుద్యోగము లిప్పించియు, సంఘమును బాగుపఱచవలె నని ఘనమయిన

యనురక్తితోఁ గదలికను గలిగించిరి. వారి శిష్యులగు శ్రీ పిఠాపురము మహారాజావారుకూడ కళావంతుల దుస్థితికై మిక్కిలి దుఃఖించి వారి వివాహవ్యయములకును, విద్యావ్యాప్తికిని వేలకొలఁది రూప్యముల నొసఁగి శ్రీ నాయఁడుగారి సత్సంకల్పమునకు సర్వవిధముల సాహాయ్యము నొసంగిరి.

కళావంతుల సంఘసంస్కరణ మిట్లుత్సాహముతో సాగుచున్నను, దేవదాసీలలో నౌకరీయీనాములు గలవారు తమ యీనాములనుఁ బోగొట్టుకొనఁజాలక వారి పుత్రికలను దేవదాసీలుగఁ జేయుచుండుటవలన సంస్కరణోద్యమ మొకవిధముగఁ గుంటువడఁజొచ్చెను. ఈ సమస్యనుండి తప్పించుకొను టెట్లు లని యావేదనతో నంగలార్చు కళావంతుల సంస్కరణపరాయణులకు శ్రీనాయఁడుగారు శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు మదరాసు శాసనసభలలో గంభీరోపన్యాసముల నొసఁగి శాసనముల మార్పించి యుత్సాహమును గల్పించిరి. మదరాసు శాసన నిర్మాణసభలో దేవాదాయధర్మాదాయ చట్టమును సవరింపఁజేసి దేవదాసీల నౌకరీయీనాములను సేరీలుగా మార్పించి, ప్రస్తుత మున్నవారినిగూడ నౌకరీబానిసత్వమునుండి తప్పించి, ముందుసంతతి దేవదాసీవృత్తికి లోనుగాకుండునట్లుగాఁ జేసిరి. పడుపువృత్తిని విడిచి పవిత్రముగ జీవయాత్ర గడుప నిచ్ఛగించు పడఁతులకు మదరాసునగరమున శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు శరణాలయమును నెలకొల్పి వారిని స్త్రీలోకమున కుపకరించు నితరవృత్తులందుఁ బ్రవీణలఁ గావించుచుండిరి. శ్రీనాయఁడుగారు, శ్రీమతి రెడ్డిగారు కళా

వంతులలోని కొఱఁతలనుఁ బాపుటకు సర్వదా సంసిద్ధులై వారి సంస్కరణసభల నలంకరించుచు, వారి యాప్తిసార్థముల నెఱిఁగి తోడ్పడుచు సంఘము నింత సత్వరముగ సంస్కరింపఁ గల్గిరి. వీరి దర్శన సాన్నిధ్య భాగ్యములఁ గాంచిన కళావంతులు సమ్మోహితులై తమ్ముద్ధరించిన సదయహృదయులు వీరిని గుర్తించి, స్మరించుచు, వారిని దమ హృదయాలయములందు నేఁటికిని నర్చించుచున్నా రనుటలో నతిశయోక్తి యేమాత్రమును లేదు.

## 10. సంఘపారిశుద్ధ్య - వేశ్యావృత్తినిర్మూలనోద్యమములందు శ్రీ నాయఁడుగారి కొన్ని యనుభవములు.

వారి ధర్మచింత హృద్గత మైనది. ఎప్పు డీజ్ఞానము సాధకునికి హృద్గత మగునో, అప్పు డాతఁడు దేశకాలపరిస్థితులచే బంధింపఁబడఁడు. అందుచేతనే వీరి సంస్కరణలు బాహ్యస్థితిగతుల కనుగుణ్య మగునటుల విధింపఁబడిన ధర్మములుగాక యంతరసాధనలయొక్క బాహ్యారూపములు. ఈ సాధుపుంగవుని మృదుహృదయము ప్రేమపూరితమై యుండుటనుబట్టి వారియం దిట్టి జనాదరణభావములు కలిగినవి. దుష్టులను, పాపులను, గాంచినపుడు సాధుహృదయమునందేహ్యము జనింపదు. మీఁదు మిక్కిలి కరుణ, అనురాగము, పరితాపము, బాధ జనించి, వారిని గాఢాలింగనము జేసికొనును. వెన్నెలవెదజల్లుచంద్రుని గాని, చక్కని సౌరభమును వెదఁజల్లు పుష్పమునుగాని, సంధ్యాకాలపు యాకాశమును గాని జూచినపుడు మానవుని హృదయమున నెట్టి యానందము కలుగునో, సాధుజీవనుని

భక్తి, నిర్మలత, ప్రేమ యనుభవించినప్పుడుగూడ నట్టిపరమా నందమే ప్రతిసామాన్య మానవునియందుఁగలుగును.

త్రికరణశుద్ధి గల మతసాంఘికసంస్కర్తగా శ్రీనాయఁడు గా రాంధ్రదేశమునకే గాక యావద్భారతదేశమునకుఁ గూడ నెన్నఁటికి మఱపురాని యమూల్యసేవను విద్యార్థిదశనుండియుఁ గావించుచు వచ్చిరి. వారు వాక్శూరులు గారు. ఉత్సాహో త్తేజములతోఁ దమ యుద్దేశములను గేవలము క్రియారూప మున నిర్వహించిన మహాపురుషులు. పరమేశ్వరుఁ డాయన కుద్దేశించిన కార్యమును దృఢవిశ్వాసబలముతో జగత్సన్నుత ముగ నెఱవేర్చిరి. విద్యావిషయములలో నాఱితేరిన మహా మేధావు లగుటచే శ్రీనాయఁడుగారు ప్రజల విద్యాభివృద్ధికి, సర్వతోముఖ సంఘసంస్కరణమునకు మనస్ఫూర్తిగఁ గృషి యొనర్చిరి.

సాధకులైన శ్రీ నాయఁడుగారి జీవితమున కంతటికి మకు టాయమానమైనవి వారి సంఘపారిశుద్ధ్య వేశ్యావృత్తి నిర్మూల నోద్యమములు. వారు విశుద్ధవర్తనులలో విశుద్ధవర్తనులు. వారి సంపూర్ణగ్రంథములలో రెండవ సంపుటమునందు ముద్రించఁబ డిన వ్యాసములందు సంఘపారిశుద్ధ్యము-వేశ్యావృత్తినిర్మూల నోద్యమములకు సంబంధించిన వారి భావములు పొందుపఱుపఁ బడినవి. భావగాంభీర్యమునకును, నైతికావేశోద్వేగమునకును, రసోన్నతికిని, హృదయవైశాల్యమునకును వారి జీవిత మొక మహోదారగ్రంథము. చిత్రకళామయ మగు నలంకారము. వారి యాధ్యాత్మికశక్తిసంపదకు కలకత్తాలో జరగిన యఖిల

భారతాస్తిక మహాసభా సమావేశమునందు వారొసంగిన యుపన్యాసము గొప్ప తార్కాణము. ఆయుపన్యాస మందలి వీరి శైలి డాక్టరు మార్టినోశైలిని బోలి జీవితపరమార్థసంచయముల నెఱింగించు భావోన్నతశిఖరములకు మనలను దీసికొనిపోవును. పూర్వోదాహృతము లయిన వ్యాసములు రెండును వారి గ్రంథావళియందెల్ల నమూల్యమణులై ప్రకాశించుచు మానవుల కృశితాత్మలకుఁ బునరుజ్జీవనమును బ్రసాదింపఁగల యాధ్యాత్మికశక్తితో నిండియున్నవి.

శ్రీ నాయఁడుగారు విద్యార్థిగా నున్నప్పుడే మదరాసునందు భోగముమేళముల నిషేధించు నుద్యమమును లేవఁదీసిరి. అచిరకాలములోనే యాయుద్యమము పురోగమించి రాష్ట్రేతరప్రదేశములకుఁగూడ దాని ప్రభావము ప్రాఁకినది. వారుత్తరసర్కారులలో నొకచోటినుండి మఱియొకచోటికి సంఘపారిశుద్ధ్యమునుగూర్చియు, భోగముమేళములను నిషేధించు నుద్యమమునుగూర్చియు నుపన్యాసముల నిచ్చికొనుచు, నీ యుద్యమములను బలపఱచు సంఘములను స్థాపించుచు, నాంధ్రదేశమున కపార మగు సేవ నొనర్చిరి. ఈయుద్యమసందర్భముననే వారు పైనఁ బేర్కొనిన సంఘపారిశుద్ధ్యమును గూర్చిన వ్యాసము వ్రాయుట తటస్థించినది. వారు మదరాసు విడిచి వెళ్ళినతరువాత నీయుద్యమవిషయమై కృషిచేయువారు లేక క్రమముగా నది యచట సన్నగిల్లినది. ఈయుద్యమపరిస్థితులు యథాస్థితికి వచ్చినవి. సంఘముగూడ యథాప్రకారము భోగముమేళముల నేర్పాటు జేసికొనుచుఁ దృప్తి నందినది. నిర్జీవ

మఱు సంఘము మృతాచారములనే పట్టి ప్రాఁకులాడునుగదా! ఉత్సవసందర్భములందు వేశ్యలచే గజ్జె కట్టించుట మానవజాతికొక కళంకమేగాక యది యొక విద్రోహకర మగు నేరమే యనియు, వివాహకార్యక్రమములందు భోగము మేళములకుఁ దావొసంగరా దనియు, ఆభిజాత్యసౌశీల్యములకు భోగము మేళములకు సంబంధించిన వినోదము లనుగుణములు గావనియు జను లెంచసాఁగిరి. శ్రీనాయఁడుగా రాదినములలో భోగము మేళముల నిషేధించు నుద్యమమును లేవఁదీసినప్పుడు నవనాగరికులును, శుద్ధశ్రోత్రియులును, దేవాలయ ధర్మకర్తలు, వీరు వా రననేల యాబాలగోపాల మొక్కుమ్మడి తీవ్ర మగు ప్రతిఘటనములను లేవఁదీసి శ్రీ నాయఁడుగారి ప్రాణములఁ దీయ యత్నించిరి. కొన్నికొన్ని సభలలోని తీవ్రప్రతిఘటనను జూచి యుక్తియుక్తముగ "వేశ్యమాతలయెడ మా కెట్టికోపమును లేదు. వారల యాత్మలు పతనముగాకుండుటకే మే మీయుద్యమమును లేవఁదీసినాము." అని హేతుబద్ధముగ సమాధాన మిచ్చుచుండెడివారు.

శ్రీనాయఁడుగారు వేశ్యాయువతులనుజూచినప్పుడు, వారి గభీరహృదయమునుండి జాలితో భావతరంగము లువ్వెత్తున లేచి, కనుగ్రుడ్లనుండి యశ్రుధారలై ప్రవహించెడివి. కన్య రక్తమాంసాదులను విక్రయించునట్టి పడుపువృత్తియందు బంధింపఁబడి మానవనైతికజీవితవినాశము జూచి వారి హృదయాంతరాళమున నగ్నిజ్వాలలఁ బోలు యావేదన జనించి, దహించునట్టి దుఃఖాబ్ధియందు ముంచివేసెడిది.

శ్రీ నాయఁడుగారికిని వారి పూర్వవిద్యార్థులకును గల సంబంధము కాలనియతి లేక శాశ్వతమైనది. వారు తమ విద్యార్థుల కిచ్చు వీడ్కోలుసందేశములో "బాబూ! మీరు భోగముమేళములను నిషేధించు నుద్యమముయొక్క విలువను గాని, బలమునుగాని తగ్గించునట్టి పనులేమియుఁ జేయక దానిని బలపఱచుటకుఁ జేతనైనంత సాయముఁ జేయుఁడు" అని చెప్పుచుండెడివారు.

ఒకప్పుడు శ్రీనాయఁడుగారు తమ బంధువులు కొనఁదలఁచిన యొకయింటినిఁ జూచుటకు వెడలిరి. లోన నడు గిడు సరి కాయింట సింగారించుకొని కిలకిలలాడుచున్న నందగత్తెలు గానవచ్చిరి. మొదట శ్రీ నాయఁడుగారికి వా రెవరో తెలియు లేదు. (తెలిసియున్నను వా రాస్త్రీల నదేవిధమున సంబోధించి యుండు ననుకొనఁడు.) ఆయన వారిని దమ సహజధోరణిని 'అమ్మా' యనియే పిలిచిరి. శ్రీ నాయుఁడుగారి సుందరసమున్నత విగ్రహమును జూచి వారు సాదరముగా గౌరవించిరి. 'అమ్మా' యని శ్రీ నాయఁడుగారు నోరారఁ బిలువఁగానే లోకమంతయు విటులచే నిండియుండలేదనియు, అన్యకాంతలను సోదరీభావముతోను, మాతృభావముతోను జూచువారుగూడఁ గలరని యు వారు భావించిరి.

ఆంధ్రవాఙ్మయమునందును, సంగీతమునందును నధికారముతో మాట్లాడఁగల పండితులొక రొకప్పుడు భోగముమేళములను నిషేధించు నుద్యమము పట్లను, సంఘపారిశుద్ధ్యోద్యమ విషయముననను దప్ప మిగిలిన సంఘసంస్కరణాభిప్రాయము

లతోఁ దాను శ్రీ వేంకటరత్నము నాయఁడుగారితో నేకీభ వింతునని పలికెను.

శ్రీ నాయఁడుగారు తా మితరులకన్న లేశమైనను నధి కులమను భావము నెన్నఁడు గల్గియుండెడివారు కారు. వేశ్యానృ త్యముచేయుచు నవయవ ప్రదర్శనముచేసి యాడుచుండుట తన కన్నులారఁ జూచినప్పు డెవని హృదయము కంపించి "ఆ యాడుచిన్నది నా కుమారిత కాదా" యనిపింపకుండునని విశాలహృదయముగల శ్రీనాయఁడుగా రనుచుండెడివారు దానిని బురస్కరించుకొని యీక్రింది యుపమానమును వారు చెప్పు చుండెడివారు. ఒక దోషిని గారాగారమునకుఁ గొనిపోవు చున్నప్పుడు పాశ్చాత్య భక్తాగ్రేసరుఁడైన 'జాన్ వెస్లీ' యీ దృశ్యమును జూచి "ఆపోవువాఁడు దైవానుగ్రహ మర్థించి యేఁగు జాన్ వెస్లీయే గదా" యని యనుకొనెను. అదే విధ విధమున మన యెట్టయెదుట నవయవప్రదర్శనముఁ జేసి యాడు చుండు వేశ్యాంగనను జూచునప్పుడు మన కామెయెడ బుత్రికా భావమో సోదరీభావమో గాక మఱియేమి జనించునని శ్రీ నాయఁడుగారు నుడువుచుండెడివారు.

కొందఱు వారిని "వేశ్యలాడునప్పుడు పోయి యీ పా టనుమాత్రము వినరాదా" యనిప్రశ్నింప నందుకాయన "మీ సోదరిచే నట్లు జనసమూహమునెదుటఁ బాడించుటకు మీరిష్ట పడుదురేని నాకెట్టి యభ్యంతరమును లేదు" అని మృదువుగ మందలించుచుండెడివారు.

శ్రీ నాయఁడుగారు మచిలీపట్టణములో నున్నప్పుడొక పర్యా యము వా రిరువురు ముగ్గురు స్నేహితులతోఁ గూర్చుండుట

తటస్థించెను. ఇంతలో నొక డిప్యూటీకలెక్టరుగారి డఫేదారు వచ్చి శ్రీ నాయఁడుగారి స్నేహితులతో "మిమ్ములను మా యయ్యగారు వారింట నిపుడు జరుగుచున్న బోగముమేళము ను జూచుటకు దయచేయవలసినదిగా నాహ్వానింప నన్నంపినారు. మఱియు వారు నన్ను "నోరీ! నీవు శ్రీనాయఁడుగారితో మాత్ర మీసంగతి జెప్పకుము. సింహమువలె వారు నీపైఁ గర్జింపఁగలరు సుమీ" యని ప్రత్యేకముగా నాదేశించినార"ని పలికెను.

ఒక పర్యాయము శ్రీ నాయఁడుగారి న్యాయవాది మిత్రులయింట, ఆమిత్రుని తండ్రిగారగు నొక డిప్యూటీకలెక్టరుగారొక వివాహమును మచిలీపట్టణముననే చేయుచుండిరి. ఆహ్వానపత్రికలలోని కార్యక్రమమునందు బోగముమేళముగూడ నుండునని యచ్చువేయింపఁబడెను. శ్రీ నాయఁడుగారి స్నేహితులొకరు తప్పనిసరిగా నా వివాహమునకు హాజరు గావలసి వచ్చెను. శ్రీ నాయఁడుగారును, వారును గలిసి యొక బండిలోఁ గూర్చుండి యాపెద్ద మనుష్యుని యింటికిఁబోయిరి. కాని శ్రీ నాయఁడుగారు మాత్రము బండినుండి దిగలేదు. శ్రీనాయఁడుగారి మిత్రులుమాత్రము లోనికేఁగి పెండ్లిపెద్దలతో శ్రీ నాయఁడుగారు వచ్చినట్లు చెప్పుటయు, కంగారుతో వా రీవలికి వచ్చి తడబడుమాటలతో, అయ్యా తామిట్లు బయట నిలుచుండుట ధర్మమా, నేను మీ కాహ్వాన పత్రిక నంపలేదు కాబోలు. క్షమింపుఁడు' అని యనుటయు, నందుకు శ్రీ నాయఁడుగారు "అయ్యా! మీశుభలేఖ నా కందినది. నా కృతజ్ఞతాభివందనము లివిగో; కాని మీ యాహ్వానమును మన్నించి యానం

దించు భాగ్యము నాకులేదు. నాకిష్టములేని బోగముమేళము నీ వివాహసమయమున మీరు ప్రోత్సహించుచున్నారు. కాన నే నచ్చటకు రాఁజాలనని ఖండితముగాఁ జెప్పిరి.

ఉత్తమసతీమతల్లుల కాలవాలమని ప్రసిద్ధికెక్కిన నీదేశ ములోఁ దరతరములనుండి పాదుకొని సంఘపతనమునకుఁ గారణమైన యీ ఘోరదురాచారమును వేశ్యావృత్తిని నిర్మూలనము జేయకుండుట మనలను మనమే యవమానపఱచుకొనుట గాక మఱేమగును ? మధురాతిమధురము, పవిత్రాతిపవిత్రము ఆధ్యాత్మిక నిశ్శ్రేణిలో ప్రధాన సోపానము అగు గృహజీవనమును రుచి చూడవలసిన సోదరీరత్నముల నెందఱెందఱినో యట్టి సహజోన్నతస్థితికి దూరీకరించుటను జూచి సైరింపఁ జాలక శ్రీనాయఁడుగారు సంస్కరణోద్యమనాయకులై మదరాసునందును, మచిలీపట్టణమునందును, సికిందరాబాదునందును, కాకినాడయందును వేయేల యావదాంధ్రదేశమునందును జాతీయజీవనమును బరిశుద్ధపఱచి యున్నత వేదికపై నధిష్ఠింపఁ జేయుట కపారమయిన కృషిగావించిరి.

"నన్ను ప్రేమించు వారందఱు నా మార్గమునే యనుసరించి దానినే ప్రేమింపవలెనని నేనననుఁ. కాని హేయమగు మన ప్రస్తుత సాంఘిక స్థితియందు వినోదవిహారములందు సహితము మనము స్వయముగాఁ బారిశుద్ధ్య సూత్రము నా చరణలోఁ బెట్టకున్నచో నాత్మద్రోహుల మై, యాత్మవంచనము గావించుకొన్న వారమగుదుము. తారు ముట్టుకొని వ్రేళ్ళు నల్లఁబడఁగూడదను టెట్లు పొసఁగును? సంఘ

కాలుష్యమునకు దారితీయు పనులన్నిటియెడ మనము విము ఖత చూపవలసినదే. దానికిఁ గారకులు స్త్రీలు కానిండు పురుషులు కానిండు, అట్టివారినెల్ల నెన్నఁడు దరిఁజేరనీయరాదు.'' అని శ్రీ నాయఁడుగారు సంఘపారిశుద్ధ్యమును గూర్చిన దమ యభిప్రాయములను బాహాటముగఁ జాటుటయేగాక మనోవాక్కాయకర్మలచే స్వయముగ నాచరించి సంఘపారిశుద్ధ్యోద్యమమున మార్గదర్శకులైరి.

సంఘవినాశకారకములగు మద్యపానమును సినీమాలను గూడ శ్రీ నాయఁడుగారు రోయుచుండెడివారు. మద్యము "అబ్కారీ''యను మృదుపదముమాటున దాఁగియున్న యొక కాలకూటవిషమనియు, నది ద్రవరూపమున నున్న దావానలమనియు, బట్టీపెట్టఁబడిన నరకకూపమునందలి గంధకధృతియే యనియు, దానిని గ్రోలుటవలన నిల్లు గుల్లయగుటచే నది సంఘమునకు మిగుల హానికరమనియుఁ దలఁచి తన్నిరోధమునకయి తీవ్రప్రచారమును సాగించిరి.

శ్రీ నాయఁడుగారు సినీమా ప్రకటనలను గూర్చి యీ క్రింది విధమున నసహ్యించుకొనుచుండెడివారు. సినీమా తార-తార యనునది కేవలము మృగ్యపదార్థము. అది యొక యెండమావి వంటిది. "వచ్చి చూడుఁడు, చూచి యానందింపు'' డని సినీమా ప్రకటనలలో మనము చూచుచుందుము. చూచి యానందించి—ఆనందించి కర్మము ననుసరించి చేసికొన్నంత యనుభవింపవలసివచ్చును. ఇట్టి ప్రకటనల వలలోఁ జిక్కుకొని మనము చివర కంధకారకూపమునఁ బడిపోవుచున్నాము. "నా

జీవితమునందు సుగుణలేశ మేమైన నున్నచో దానిని దీర్చిదిద్ది యీ జీవితములందుఁ బ్రతిఫలింపఁజేసి సంఘకాలుష్యము నణఁగింపుడు. నిర్మల ప్రేమయే స్వర్గధామమునకుఁ ద్రోవ. ఆప్రేమ కలుషితమై, కోపమను విషముచేఁ పంకిలమైనప్పుడే యది నరకప్రాయ మగును" అని శ్రీ నాయఁడుగారు పలుకుచుండెడివారు.

## 11. గు రు దే వు లు

శ్రీనాయఁడు గారు జ్ఞానగురువు. సుగభీరజ్ఞానసముద్రమును మథించి గ్రహించిన జ్ఞానామృతముచే సిక్తముఁజేసి, జ్ఞానజ్యోతిచే దీప్తమొనరించి, జ్ఞానప్రతిభల, నాత్మీయుల జీవసదీపముల నుజ్జ్వలమొనర్చి ధన్యముగావించిన జ్ఞానకోవిదులు. వివిధ విషయములతో వివిధ దృష్టాంతములతో, వివిధ సత్కారములతో, వివిధ సదనుష్ఠానములతో జ్యోతిర్మయుఁడగు భగవానుని దివ్యరూపమునుఁ బతితులకుఁ బ్రదర్శించిన మహాజ్ఞాని. లోకములో గురువులనేకులుందురు. గురుదేవు లెక్కడెక్కడో యెన్నఁడెన్నఁడో యవతరించుచుండును. సామాన్య మానవుఁడు గురువుకాగలఁడు. గురువర్యుఁడు కాగలఁడు. కాని కేవలము ఋషిమాత్రమే గురుదేవుఁడు కాగలఁడు. అట్టి గురుదేవులు శ్రీనాయఁడు గారు. శరత్కాసారము కంటె స్వచ్ఛమైనది యువకుని హృదయము అతఁడు తనభావనపక్షముల నెన్నఁడును ముడుచుకొనలేఁడు. వానికగన హార్మ్యములు పర్వతముకన్న స్పష్టములై నచలములుగాఁదోఁచును. వానిబ్రతుకేయలౌకికాను భూతికో యంగలార్చును.

వానిదాహమునకుఁ బాలకడలి చాలనట్లుండును. మఱియు నవ యుగోదయమును వసంతసమయములో నొకచేతితో సమర్పిం చుట కమృతభాండమును రెండవచేత స్వీకరించుట కక్ష యపాత్రను నుంచుకొని యాంశాశల నాహ్వానించు పిపా సాతురుఁడై యువకుఁడు పఱతెంచును, అట్టి యువకులు విద్యార్థులై పరుగుపరుగున విచ్చేసినపుడు వారికంటె నాతు రుఁడై తనమనోభాండారమును హృదయనిధానమును దెఱచి కొని గురుదేవుఁడెదురుగా నవతరించి పితృప్రేమతో నాలింగన మొనర్చి స్వాగతమొసఁగినప్పు డెన్నోయనుభవములు విక సించును. ఎన్నో సంఘట్టనలు ఫలించును. ఏఁబదిసంవత్సరము లభినవాంధ్రయువకులను రెండు సోపానముల మీఁద నెక్కించి సత్యసాన్నిధ్యమున నిలువఁబెట్టిన సత్యాన్వేషి శ్రీనాయఁడు గారు. భగవానుని సర్వవిధముల జీవితమునందు దర్శించి, అసత్యాంధకారముచే నావరింపఁబడిన తోడి సహచరులకును తనవిద్యార్థులకును సత్యస్వరూపుని యథార్థరూపమును నిరూ పించి "అస్తీతిఅల్లాహో" "దేవుఁడుకలఁడు" అను మహామంత్ర మును సమన్వయించి వారల హృదయాంతరాళములలోఁ జొప్పించి వారిజీవితములఁబునీతమొనర్చి ధన్యములు గావింప సంకల్పించిన సత్యరతుఁడు శ్రీనాయఁడు గారు. పాఠశాలయుఁ బ్రార్థనాలయమును, నధ్యాపకపీఠము నాచార్యవేదికయు వారి సన్నిధానమునఁగలిసి పోయెడివి.

కవికివలెనే యధ్యాపకునకును దన్మయత భావయో గ్యత, యుద్రిక్తభావన యావశ్యకశక్తులు. శ్రీనాయఁడు గారి

హృదయము శతతంత్రీమహతి. ప్రతివాయునిహతికిని గంపించి పోయెడిది. ప్రతిశిష్యుని తోడియనుభవములే గాక ప్రతికావ్యములోని యనుభవములును నందనానిలములై వారి మనస్సు నుఱ్ఱూఁతలూఁగించెడివి. వారి భావనాశక్తి కవధిలేదు. ఇట్టి తన భావనాపక్షములను దిగంతములవఱకు విప్పి వైదికయోగుల నాఁటి భాగీరథీతీరమునకును బదరికాశ్రమమునకును బ్రయాణమై, యంతలో హాఫీజ్, సాదీమున్నగు పారసీకభక్తుల మధువనములలో వ్రాలి, యప్పుడే షేక్స్పియరు, వర్డ్స్వర్తు, గెటే, కార్లైలువంటి పాశ్చాత్యప్రవక్తల విజ్ఞానగగనవీథులలో వారిమనస్సు విహారము చేయుచుండెడిది. అనుభవింపఁగల హృదయముతో, భావింపఁగల్గు చిత్తముతో, ప్రబోధింపఁగల వాక్ప్రతిభతో నాయఁడు గారు శిష్యులతోఁ గావ్యముల పఠించునపుడు వారిప్రతిభాషణమును బ్రతిశిష్యునిఁ బ్రత్యేకముగఁ బలుకరించునటులుండెడిది. ప్రతిసందేశమును వానికే వినుచున్నట్లుండెడిది. సాయంకాలము శర్వరిగాఁ గరఁగి పోవు సమయమది. పాఠశాలలోని గదిలో మునిమాపుఁజీకట్లు ముసుఁగులొత్తిగిలఁ జేయుచుండును. నూటయేఁబదిమంది విద్యార్థులు నిశ్శబ్దముగా నున్నసమయమది. ఎదురుగాఁ దేజస్తంభమువలె నిలిచిన స్వచ్ఛసుందరమూర్తి, పాదుషా, ప్రవక్త గురుదేవుఁడు శ్రీనాయఁడుగారు పాఠములఁ బ్రవచించునపుడు మిల్టను పారడైజులాస్టు రెండవపర్వములో నిస్టిజియన్ కౌన్సిలు” లో వర్ణితులయిన యామహావీరుల రూపములు ఫ్రూడ్ పదునాఱవశతాబ్దపు నావికుల గాథలు ; టెన్నిసన్ లాన్సిలట్

ఇటెయిమల ప్రణయగాథలు కవిమనః ప్రాంగణములో వలెనే విద్యార్థుల మ్రోలను సుస్పష్టముగా మొలచినట్లుండెడివి.

యువకుఁ డహంకారి. ఎదుటివానిలో యహంకారము నోర్చుకొనలేఁడు. "అది నీకుఁ దగదు". నీతి పద్ధతియిది" యని నేర్పఁబోయిన నేవగించుకొనును. అలాగుననే "నాకెంతయో తెలియును, నీకంతయు నేర్పెద"నన్న యధ్యాపకుని గౌరవింపలేఁడు. గురువుపండితుఁడు కావలెను. పండితునకు వినయమేకైక భూషణము. "నేనెంత తెలిసికొనినవాఁడనో యని గాక నేఁదెలిసికొనిన దెంత బాగుగనున్నదో యనఁ గలుగువాఁడు గురుదేవుఁడు. ఒకని పాండిత్యము తనమీఁదను, నెదుటివాని మీఁదను బాషాణమై కూర్చుండును. మఱొకని పాండిత్యము తనకును దన్నుఁదఱిసినవారికిని బ్రభాపక్షములను దొడుగును. ఈరెండవ షక్కికిఁ జెందినగురుదేవులు శ్రీనాయఁడు గారు. కావ్యకర్తలకు వలెనే గురుదేవులకుఁ గూడ నొకవిశాల సౌహార్ద్రి మొకవిశ్వప్రేమ మవసరము. పురాణపురుషుఁడు వ్యాసునకు ధర్మజు నెడ నెంతయభిమానమో శకునియెడ నంత యనురాగము. షేక్స్పియరునకు ఒథెలో యెడనెంతయాదరమో "ఇయాగో" యెడ నంత సానుభూతి. డిక్సెనునకు ఛజిల్ విట్టు నెడ నెంతప్రేమయో మిసెస్ గేంపు నెడ నంత యనురాగము నని యనిపించును. కావుననే వీరుప్రపంచ మహాకవులు దుర్యోధనుఁడు, కాలనేమి' కాసియస్, ఉర్యాహీప్ లేని యా యా కావ్యములు మనకు దుస్సహములు. వారులేనిచో లోకమెంతయో పోఁగొట్టుకొన్నట్లుండును. ఆ కావ్యాత్మలఁ బూర్తిగా

గ్రహించుకొని యా యా కావ్యముల నన్వయించుచు భావము చెప్పఁగల్గువాని కెంతయో విశాలప్రేమ మవసరము. విద్యార్థులలో నన్నిరకముల ప్రకృతులును గలవు. కవికివలెనే గురుదేవునకును నందఱును ననంతయాత్రామార్గము తుదిని నమరులుగానే గోచరించు చుందురు.

శ్రీ నాయఁడుగారు నిష్కళంకనీతిదండధరులు కారు. ఒక్కొక్కని నీతి చండశాసనము. లోపము సహింపఁజాలదు. ఎదుటివాని జీవితమును వానిప్రేలనే పెకల్చి దానిలోని కల్మషముల నెట్టయెదుటఁ బఱచి చూపును. అట్టిచో వానికి మిగులునవి నిరాశ నిస్పృహలే. గురుదేవుని నీతి యెదుటి వానిలో నిదురించుచున్న యార్జవపటిమ నెగసనఁ ద్రోసి వానిని దానెంత సచ్ఛీలుఁడు కాఁగల్గుదునో యని యనిపించును.

శ్రీ నాయఁడుగా రాంధ్రయువకునకుఁ బ్రసాదించిన వరములు రెండు. ఉదారాశయశీలము, తత్త్వదృష్టి. జీవితమును దారామండలమునకుఁ దగిలించి యాత్ర సాగించుట; పరిత్యాగమువునందును ననంతత్వమును, బ్రత్యనుభూతియందును బరమార్థమును బరిశీలింప యత్నించుటలు వరములై వెలసినవి, వారి సన్నిధానములోనున్నపుడొక చిన్న తలఁపో, యొకచిన్నమాటయో, యొక చిన్న చేఁతయో యనంతవిశ్వములోని కొక్కసారిగాగ వాక్షమును దెఱచెడిది. వా రవిశ్రాంతముగా నమరజగత్తులో సుస్థిరులై యుండెడివారు. లోకమాయన కొకయాత్రా వీథిమాత్రమే గాక వసతిగృహము గూడ నై యుండెను. సామాన్యముగా మార్గాంతమున మనకుఁ గావలసినది దొర

కును. ఈలోకములో( బ్రతిపదమ్మునను మనకు వరము దొర
కును. ఏలయన, నీలోకమున తానే యాత్రాపథము. తానే
గృహము కాన గురుదేవులు కైలాసశృంగముమీఁదనే యెల్ల
ప్పుడు నివసించఁగల్గెడివారు.

పురాణభారతమునాఁటి గురుకులములో గురుదేవుఁ
డుండెడివాఁడు. గురుపత్నియైన తల్లి యుండెడిది. అనుంగు
బిడ్డలయిన యంతేవాసు లుండెడివారు. శ్రీనాయఁడుగారి కళా
శాల గురుకులము. స్థూలదృగావరణము దాఁటిపోయిన గురు
పత్నిని, దమ మాతృదేవతను వారివిద్యార్థులను నిమేషమును
గురుదేవునిలోనే దర్శించు చుండెడివారు. భౌతికజీవితము
చాలించిన ప్రాణేశ్వరి తనలో నవతరించుటచే నసంపూర్ణముగ
నున్న తన ప్రకృతి సమగ్రసుందర మైన దని మహాకవి వ్రాసి
నాఁడు. పండితసామ్రాట్టు, విద్యావ్యాసుఁడు, సంఘసంస్కర్త,
ధీరోదాత్తుఁడు, వీరమూర్ధన్యుఁడు, సంస్కరణోద్యమ మహా
రథుఁడు నయిన యీగురుదేవుఁడువిద్యార్థులతండ్రి. గోక్షీరము
తో,నవనీతముతో, శర్కరతో, శరజ్జ్యోత్స్నతో నిర్మితమయిన
తనహృదయములో ననాథులకుఁ, బతితులకు నభయస్థానమిచ్చి
నట్లే,యాతఁడు ప్రతిశిష్యునకు ననురాగస్థానమిచ్చి పోషించెను.
గురుదేవులకు గురుపత్నితో వియోగము గలిగినది. వారి
విద్యార్థులక ది వరమైనది. సామాన్యునకు వేదన వేదనయే
యగును. తపస్వికి వేదన సృష్టించుశక్తి నిచ్చును. ఆ శక్తి లోక
సంగ్రహార్థ మని గ్రహింప నగును. తీక్ష్ణ మగు సూర్యాతప
మునుఁ బ్రతిరంధ్రమునుండి గ్రహించి వృక్షము ప్రసూనఫల

ప్రదాతయై మనకొఱకు సాక్షాత్కరించును. వేదనానలము చల్లార్చుకొని, సామాన్యమానవుఁ డొక సంతృప్తిని, నొక సుఖస్థితిని, నొక నిద్రావస్థను బొందును. కాని, యీవేదనానలమును జయించినవాఁడు ప్రస్తుతలోకమునకును, భావికాలమునకును తేజస్సునీయఁగల జ్ఞానదీపము వెలిఁగించును. అఘములనుంచి మఱల్చుచు, హితార్థకలితులఁ జేయుచు, గోప్యము దాఁచుచు, గుణముఁ బోషించుచు, నాపన్నుల విడువక, లేవడి వేళ నిచ్చు సన్మిత్రుఁడై, పితృదేవుఁడై, కళాశాలలో విద్యార్థులకు గురుకులవాస మేర్పఱచి, వ్యాసాదులలో నొకఁడై, విద్యార్థులకు నేఁటికిని నమస్కరింపఁదగినవాఁడై భాసిల్లుచున్న గురుదేవుఁడు శ్రీ వేంకటరత్నమునాయఁడుగారు.

పందొమ్మిదవశతాబ్దిలో నాంగ్లరాజ్యాంగలోకమునకు "మాన్లేదార" వివేకమువంటివాఁ డని యొకబుద్ధిశాలి వ్రాసెను. ఏఁబదేండ్లు గురుదేవుఁడు తన శిష్యులనువలెనే యాంధ్రమును బహిర్వివేకమై నడిపించెను. వారిశక్తి లోకోత్తరమయినది. వారికి విరోధుల మనుకొని యాక్షేపణాక్షరముఖరముఖు లయిన దుర్జనులనుగూడఁ బశ్చాత్తాపపూరితులఁగాఁ జేసి, యనుచరులుగా మార్చి, యనుఁగుబిడ్డలుగా నాలింగనముఁ జేసికొను నట్టి శక్తిని గలిగిన విచిత్రచర్యులు శ్రీ నాయఁడుగారు.

## 12. శ్రీ నాయఁడుగారు - ఉపాధ్యాయవృత్తి.

## (1886 – 1904.)

సహజ దయాదాక్షిణ్యములతో సాధుజీవనమును జతపఱచిన యపూర్వబోధకులు శ్రీ నాయఁడుగారు. కళాశాలలో

వారు పాఠములుచెప్పెడి గది ఛాత్రవర్గమునకొక దేవాలయము వంటి దనియు, నందు దాము విద్యాభ్యసనమేగాక యర్చనముగూడ సాగించుచుందుమనియు, వారి శిష్యులు వచించుచుండెడివారు. విధ్యుక్త ధర్మాచరణముచే నుజ్జీవితమగు సంస్కృతి, సంస్కృతిచే వన్నెకెక్కిన ధర్మాచరణము వారిలో మిళితమై యమరశోభ నొందినవి. భక్తి విశ్వాసములు వారిదెస ప్రవహింపజేయని హృదయ మీయాంధ్రదేశమున లేదు. పాముల్ఁ లెరుగక పోవచ్చునుగాని యాంధ్రదేశ విద్యావంతులలో వారి యమృతాత్మను స్మరింపనివా రుండరు. రాజకీయ సంచలనము సద్దణఁగి, శాంతి వాతావరణ మేర్పడి మన దేశస్థులు భారతదేశ చరిత్రను, అభివృద్ధిని, స్ఫురణకుఁ దెచ్చుకొనుతఱి శ్రీ నాయఁడుగారి దివ్యమూర్తి చిరకాల గాఢాంధకారము వెనుకనుండి దివ్యతేజస్సుతో, వెలికివచ్చి దేశాభివృద్ధికిని, దేశసౌఖ్యమునకును మార్గమును జూపఁగలదు.

శ్రీ నాయఁడుగారు మరణాంతము బోధకులుగనే యుండిరి. విధ్యుక్త ధర్మనిర్వహణమే యీశ్వరార్చనముగ వారు భావించుచుండిరి. బోధనశాల వారి కాత్మ పోషణాలయము. పాఠశాలారంగమే యానందనిలయము. తమ వృత్తిని వారు పరమ పవిత్రమగు భగవ దాదేశముగా నెన్నుచుండిరి.

చిన్ననాఁటనుండియు శ్రీ నాయఁడుగారిని పరమేశ్వర విలాస మెట్లకలంకమగు నుపాధ్యాయవృత్తికిఁ బ్రేరేచినదో, యావృత్తి యనిన వారికెంత యభిమానమో వారొక చిన్న కథారూపమున నిట్లు చెప్పుచుండెడివారు. 'నెపోలియను ఇంపీరి

యలు ఫార్ట్యూనుటెల్లరు' అను పుస్తకముచేతఁ బుచ్చుకొని నలుగురు పిల్లలతోఁ గలిసి యొకనాఁడు వారాడుకొనుచుండిరి. అప్పుఁడు 'శ్రీ నాయఁడుగా రేవృత్తి నవలంబింతురు' రని ప్రశ్నించి సోదె యడుగ 'వా రుపాధ్యాయవృత్తినే' యవలంబింతురను సమాధానము వచ్చెనట. 'ఇంపీరియలు ఫార్ట్యూనుటెల్లరు' చెప్పిన సమాధాన మెంతవఱకు నిజమో లోకమునకుఁ జెప్ప నక్కఱలేదు.

శ్రీ నాయఁడుగారు 1886 వ సంవత్సరమునఁ గొన్ని దినములు రాజమహేంద్రవరమునందలి హితకారిణి యున్నతపాఠశాలలోను, మఱికొన్ని దినములు ఏలూరు పట్టణమునందలి సి. యం. యస్. మిషను పాఠశాలయందు నుపాధ్యాయులుగాఁ బనిచేసిరి. ఏలూరుపట్టణమందు మహమ్మదీయుల సంఖ్య యధిక మగుటచే వారి విద్యార్థులలో మహమ్మదీయు లెక్కువమంది గలరు. యువక సహజమగు నుత్సాహముతో శ్రీ నాయఁడుగా రప్పుడు పాఠమధ్యమున మత సంబంధమగు చర్చకుఁ బూనుకొనుచుండెడివారు. ఒకనా డొక ముస్లింవిద్యార్థి వారి మతోపన్యాసము విని విని "యన్ని పాత్రలకు సరిపడు చంచా వంటివారు మీరని" (హెడ్ ఏఫ్ఫుక చెంచా) తన యానందమును వెల్లడించెను. ఇందలి రహస్య మేమనిన మత మనునది మానవునిచేఁ గనుగొనఁబడిన వింతవస్తువు గాదనియు, నది యీశ్వరాత్మ సాక్షాత్కారమనియుఁ జిన్ననాఁటనుండియు శ్రీనాయఁడుగారి యభిప్రాయము. భగవంతుఁడే మానవ హృదయకమలమునందు నెలకొని యాత్మపదార్థమునుండి జ్ఞానామృతమును చిలుకు బాధ్యత వహించునని వారి నమ్మకము.

1887 వ సంవత్సరమున హిందూ కాలేజీ పాఠశాలవారి యాహ్వానముపై శ్రీ నాయఁడుగారు మచిలీపట్టణమున కేఁగి యిరువదినెల లచ్చట బంధుమిత్రులమధ్య, జన్మభూమిలో నుపాధ్యాయులుగ తమ జీవితమును సాగించుట దమకుఁ గలిగిన భాగ్యములలో నొక్కటిగా నెన్నుకొనెడివారు. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" యనిగదా పెద్దల వ్యవహారము. జన్మభూమియందు వారికిఁగల ప్రేమ దృఢతరము. అప్పుడచ్చట వారి యాదరణకుఁ బాత్రులైన శిష్యులు శ్రీ నాయఁడుగారి మరణాంతమువఱకుఁగూడ నాప్తులుగ నుండెడివారు.

1889 వ సంవత్సరమున శ్రీ నాయఁడుగారికిఁ బ్రియ కళత్రవియోగము సంభవించెను.

1891-వ సంవత్సరమువఱకు వారు ఎం. ఏ. పరీక్షకుఁ జదివి, పరీక్షయందుఁ గృతార్థులై 1892-93వ సంవత్సరమువఱకుఁ జెన్నపురిలోఁ బచ్చియప్పకళాశాలయం దాంగ్లసారస్వతమును నేర్పు నధ్యాపకులుగా నుండిరి. 1894 జూనునుండి 1898 సంవత్సరాంతమువఱకు బందరు నోబుల్ కళాశాలలో నాంగ్లేయసారస్వతమునుఁ, చరిత్రమును నేర్పు నధ్యాపకులుగా రమారమి నాల్గుసంవత్సరములు పనిజేసిరి. అచట నున్నకాలములో వారధ్యాపకులే గాక, పాఠశాలవిద్యార్థివసతిగృహమునకుఁ బర్యవేక్షకులుగాను, పురపాలకసంఘసభ్యులుగాను, బ్రాహ్మసమాజ, సోషల్ ప్యూరిటీ అసోసియేషను సభ్యులుగను నుండి విద్యార్థులను, విద్యాధికులను, పురప్రముఖులను, సాధారణప్రజలను సన్మార్గమున నడుపుటకుఁ బాటుపడిరి.

ఆకాలమున వారియొద్ద విద్యాభ్యాస మొనర్చిన బాలకులకు వారికి నమితమైన యన్యోన్యానురాగ ముండెను. వారిప్పటికిని దాము శ్రీ నాయఁడుగారి శిష్యుల మని చెప్పుకొని గర్వింతురు. షేక్స్పియరుమహాకవి నాటకవిమర్శనలలో, కార్లయిలు ఎమర్సనుల వ్యాఖ్యానములలో, మహాపురుషుల జీవితాఖ్యానములలో, చిట్టిపొట్టికథలలో, పరిహాసములలో విద్యార్థులకుఁ దెలియకయే వారి నెక్కడకో యెత్తుకొనిపోయి చిత్తసంస్కారమును గలిగించెడివారు. నరకమున స్వర్గవీథులఁ దీర్చినారు. వారి దపూర్వమైన ప్రబోధము. వారి యాంగ్లభాషాపాటవము, యపూర్వవక్తృత్వములే గాక విద్యార్థుల హృదయముల నాకర్షించినది ముఖ్యముగా వారి సాధుశీలము. వారి సంస్కారోత్సాహము విద్యార్థుల నుద్రేకపఱచినమాట వాస్తవమే గాని వారిని వశ్యులుగాఁ జేసినది నిజముగా వారి దయార్ద్రహృదయము. మనీషావిశేషము, సౌజన్యము, నిర్మలచారిత్రము గల శిష్యులను జూచి శ్రీ నాయఁడుగా రానందించెడివారు.

ఈకాలముననే వారు కృష్ణా ప్రయిమరీ ఎగ్జామినేషను బోర్డు మెంబరుగా నెన్నుకొనఁబడి, యుత్సాహపూరితులై, స్వధర్మనిర్వహణమునం దాసక్తితో, నోపికతో, నలసట నెఱుంగక, గ్రామగ్రామములకుఁ దిరిగి వారి కప్పగించఁబడిన కార్యమును దక్షతతో మూఁడు సంవత్సరములు నిర్వహించిరి.

1897-వ సంవత్సరమున ఎల్. టి. పరీక్షకొఱకు మదరాసు వెడలి, చదివి, కృతార్థులై 1898 సం॥ తిరిగి నోబుల్ కళాశాలలో నధ్యాపకత్వమును స్వీకరించిరి.

నోబుల్ కళాశాల క్రైస్తవ విద్యాలయ మగుటచే నచ్చట క్రీస్తుమతబోధ యెక్కువగా జరుగుచుండెను. శ్రీ నాయఁడుగారు బ్రాహ్మమతావలంబకు లగుటచే బాలురకు నింటివద్ద బ్రాహ్మమతోపదేశము లొనర్చి వారితోఁ గలిసి మెలసియుండుటచే విద్యార్థులందనేకు లాయనమీఁద విశేషాదరము చూపుటయు, వారు క్రైస్తవమతముపట్ల విశేషగౌరవమును గలిగియుండకపోవుటయు ప్రధానోపాధ్యాయులకుఁ గిట్టకపోయెను. శ్రీ నాయఁడుగారు బందరు నోబుల్ కళాశాలలోఁ బనిచేయుచున్నప్పుడు హిందూయువకుఁ డొకఁడు క్రైస్తవమతములోఁ గలియ సంకల్పించెను. కాని శ్రీ నాయఁడుగారి యుపదేశ ప్రభావమువలన నతఁ డాయుద్యమము నుండి విరమించెను. అందుకుఁ గళాశాలా ప్రధానోపాధ్యాయు లయిన దొరగారు కోపించి, శ్రీ నాయఁడుగారిని రావించి, "యీ కళాశాలలో మీరైన నుండవలె, నేనైన నుండవలె, మన మిద్దఱ మిటు నుండుట పొసఁగదు" అని చెప్పినప్పుడు, ఆత్మగౌరవము గల శ్రీ నాయఁడుగారు "నేనే మానుకొనెద" నని నూటయేఁబది రూప్యముల యుద్యోగమునకు వెంటనే విడుదల పత్రము వ్రాసి యిచ్చిరి.

కాని, యద్భుతప్రతిభాశక్తులు గల శ్రీ నాయఁడుగారు తా మున్నయాఱేండ్లలో నక్కడ నెక్కువమార్పును దీసికొని వచ్చిరి. మానవహృదయములను మార్చివేయఁగల వారి యద్భుతశక్తివంటి శక్తి నెవరు నెచ్చటను జూడలేరు. హృదయములను జయించి స్వాధీనపఱచుకొనుటలో వారియంతటివాఁరు లేరని

యందఱును జెప్పుదురు. వారి పూర్వవిద్యార్థు లాప్యాయము గా వారి యాదేశముల శిరసా వహించెదరు. "వారు నా బహిర్వివేక" మని వారి పూర్వశిష్యుఁ డొకఁడు వ్రాసెను. వారి శిష్యుల మని యొకరినిమించి యొకరు చెప్పుకొనుట కెందఱో యాతురపడుచుందురు గర్వపడుచుందురు. వీరు భారత దేశపు ఆర్నాల్డుపండితులు. విద్యార్థుల మనస్సులను స్వాధీన పఱచుకొని, వారి ప్రవర్తనమునకు సుందర రాజమార్గమును నిర్మించుటలో వీరి కున్నంత గంభీరవిశాలప్రభావము ఆర్నాల్డు నకుఁ దప్ప వే ఱెవ్వరికి నున్నట్లు తెలియరాదు. నోబుల్ కళాశాలాధికారులు తమ ప్రచారవిధానమునకు వీరి యునికి యాటంక మని కళాశాలనుండి పంపివేసినవిధానమే విద్యార్థుల హృదయములపయి వీరికిఁ గల పలుకుఁబడిని వేనోళ్ళఁ జాటెడి నది. ఉపాధ్యాయులుగా శ్రీ వేంకటరత్నమునాయఁడుగారి యందు దనకే లోపమును గనఁబడలేదు సరికదా, భారతదేశ మునఁ దన 18 ఏండ్ల యనుభవములో వారికంటె శక్తిసామర్థ్య ములు గల బోధకుని దా మెచ్చటను జూచియుండలే దని యా కళాశాలాధికారియే వ్రాసినారు. కళాశాలాధ్యాపక వర్గము లో ముగ్గురె రోపీయ ప్రచారకు లున్నను, కళాశాలకార్యక్రమ ములో క్రైస్తవమతబోధనమునకుఁ బ్రత్యేకముగ నేర్పా ట్లున్నను; శ్రీ నాయఁడుగారి ప్రతిభ యప్రతిహతమై యన్నిఁటిని దుడిచి వైచినది. వారు బందరుపట్టణమున నున్న కాలమున నచటి ప్రార్థనసమాజము చాల నభివృద్ధి నొందినది. బందరు నుండి వారు వెడలిపోవుట యా పట్టణవాసులకును, నుత్తరాంధ్ర

మండలమునకును దీరని నష్టము. వారి పలుకుబడి యెల్లవేళ లందును మంచికే యుపయోగపడుచుండెడిది. వారు మచిలీ పట్టణమున నున్న కాలములో నాపురమంతయు వారి నైతిక శక్తికి లోఁబడి తానుమాఱెనది. సంఘపారిశుద్ధ్యము, పావిత్ర్యము వారి జీవితమునకు మూలసిద్ధాంతములు. వానికై వారి జీవన సర్వస్వము నర్పించిరి. చెన్నరాష్ట్ర సంఘజీవితములో నిప్పటి కిని గొంతస్థాన మాక్రమించుకొనిన సానిమేళము బందరులో మాత్రమే పూర్ణముగ బహిష్కరింపఁబడినది. ఇప్పుడుగూడఁ బెద్దమనుష్యుఁడెవ్వడును నక్కడ భోగము మేళమునకుఁ జనఁడు. దీనికంతకును శ్రీనాయఁడుగారి యవిరళాధ్యాత్మిక కృషియే కార ణము. వారు బందరు పురమును, ఇహలోకమును విడిచిపోయి నను వారి పవిత్రశక్తి యచట నింకను బనిచేయుచునేయున్నది.

ఆంధ్రదేశమునందు మహాగౌరవము నార్జించిన పురా తన విద్యాసంస్థయగు బందరు నోబుల్ కళాశాలలో భగవ దనుగ్రహమున నధ్యాపకులుగఁ దాము గడపిన నాలుగేండ్లను శ్రీ నాయఁడుగారెన్నఁడు మఱవక, యందుఁ దాము గడిం చిన యపూర్వానుభవమున కానందించుచునే యుండెడివారు. విద్యాశాఖలో దాము జీవిత మారంభించిన క్రొంగొత్త దినము లలో మొదటి యర్ధశాబ్దిని 'క్లార్కు' దొరవంటి యసాధా రణ ప్రజ్ఞాదురంధరుఁడగు ప్రిన్సిపలుకడఁ దాము పనిచేయుట తమ భాగ్యవిశేషమనియు, వారివద్దఁ దామునేర్చుకొనిన విష యము లెన్నియో నుండెననియు, అట్టి యపూర్వావకాశమును భగవంతుఁడు తమకిచ్చుట తమ యదృష్టమే యనియు శ్రీనాయఁ

డుగారు తమపూర్వదినములను సగర్వముగ నప్పుడప్పుడు సమీక్షించుకొనుచుండెడివారు. నోబుల్ కళాశాలా ప్రధానాచార్యులుగ "క్లార్కు" దొర ప్రదర్శించిన యప్రతిమాన ప్రతిభానైపుణ్యములే శ్రీ నాయఁడుగారి కాదర్శములై, తరువాతఁ దాము శ్రీ పీఠికాపురాధీశ కళాశాలవంటి మహాసంస్థల యాజమాన్యము వహించి నిర్వహించుటకు మార్గదర్శకము లైనవి.

బందరు నోబుల్ కాలేజీలో శ్రీ నాయఁడుగారితో సహోపాధ్యాయులుగా నుండి సహకరించినవారిలో రెవరెండ్సు హెచ్. జె. ఓనరు డబ్ల్యు. సి. పెన్ని ఇ. జి. రాబర్ట్సు అనువారిని ముఖ్యముగాఁ బేర్కొనదగును.

బందరు నోబుల్ కళాశాలావర్గముతోడి విభేదమూలమున శ్రీ నాయఁడుగారు 1899 సంవత్సరమునఁ దమ జన్మస్థానమును, బహు ప్రియశిష్యులయు, సహచరులయు సాహచర్యమును విడిచి నిజామురాజ్యములోని సికిందరాబాద్ మహబూబ్ కాలేజీ స్కూలు ప్రధానాధ్యాపకులై 1899 నుండి 1905 సంవత్సరము వరకు రమారమి యాఱువత్సరములు పనిజేసిరి. గుణభూషణుఁడు, సజ్జన శిరోమణియు నగు వా రచిరకాలముననే యచ్చటి ప్రజల యనురాగమునకు, విద్యార్థుల ప్రేమమన్ననలకుఁ బాత్రులైరి. పరువమొందిన యనుభవముతో, యువకోత్సాహముతో శ్రీ నాయఁడుగారా సంస్థను నతి త్వరితముగ నన్నివిధముల, రేయుంబవళ్ళు కష్టపడి, వృద్ధిలోనికిఁ దెచ్చిరి.

ఉపాధ్యాయవృత్తి చేయ నారంభించినది మొదలు శ్రీ నాయఁడుగారు "నే నేమిపని జేయవలె ననియేగాని నా కెంత

జీతమిత్తు" రని యడిగి యెఱుఁగరు. సికిందరాబాదులో శ్రీ నాయఁడుగారు పనిజేయుచున్నప్పుడు విద్యాశాఖాధికారి యొకరు శ్రీ నాయఁడుగారెన్ని యేండ్లైనను నెదుగు బొదుగులేని గొడ్డుతోఁక వంటి జీతమునే తీసికొనుట గమనించి 'ఏమండీ! మీ పాఠశాలా కార్యనిర్వాహకవర్గ కార్యదర్శికి మీ కెక్కువ జీత మియ్యవలెనని సిఫారసు చేయుమందురా' యని నొక్కి నొక్కి యడుగుటయు శ్రీ నాయఁడుగారందుకు "నా నోటితో నే నెన్నఁడును నెక్కువజీత మిమ్మని యడుగను. పనిచేయించుకొనుట నెఱిఁగిన యధికారులకే జీతము కూడ హెచ్చింపవలెనను తలంపేల కలుగ" దని జవాబిచ్చుటయు జరిగినది.

అచ్చటి యుద్యోగమును విరమించి వారు వెడలునపుడు అనేక సంస్థలు, సంఘములు వారిని విశేష భక్తి గౌరవములతో సన్మానించి సభలు గావించి, వీడ్కోలు పత్రముల సమర్పించినవి. ఈ సంస్థలలో, దక్కను సంఘపారిశుద్ధ్య మద్యపాన నిషేధసంఘము, సంఘసంస్కరణ సంఘము; గుడ్ టెంప్లార్సు ఇండిపెండెంటు ఆర్డరుయొక్క 25 వ నంబరు హోప్ ఆఫ్ ఇండియా లాడ్జి, సోమసుందరము మొదలియారు పుస్తక భాండాగార పఠనాలయము; అంజుమన్-ఇ- మిఫిదుల్ ముస్లిమీన్ సంఘము, పేర్కొనఁదగినవి. మహబూబ్ కాలేజీయొక్క ప్రాత క్రొత్త విద్యార్థులు, ఆ కాలేజీయందలి పార్సీవిద్యార్థులు ఉపాధ్యాయులుకూడ చాల సన్మానించిరి. తరువాత మఱియొక సందర్భములో ఆ కాలేజీవర్గమునకు సంబంధించిన యొకరు శ్రీ నాయఁడుగారు గావించిన సేవను స్మరించి 1919 సంllలో

వారు పీఠికాపురాధీశ కళాశాలాధ్యక్షత్వమునుండి విరమించు నప్పుడు ముచ్చటించుచు శ్రీ నాయఁడుగారు తమ పాఠశాలకు ఇంగ్లండులోని రగ్బీపబ్లికు స్కూలుకు డాక్టరు ఆర్నాల్డు పండితునివంటి వారని ప్రశంసించిరి.

## 13. శ్రీ నాయఁడుగారు — ఉపాధ్యాయవృత్తి.
## (1905 — 1919)

శ్రీ నాయఁడుగారు నిజామురాజ్యములోని సికిందరాబాదు నగరమున మహబూబ్ హైస్కూలునకుఁ బ్రధానాధ్యాపకులై యున్న సమయమునఁ గాకినాడలో శ్రీ పిఠాపురము రాజావారి కళాశాలలోఁ బ్రథమాచార్య పదవి కాళీయయ్యెను. శ్రీ నాయఁడుగారి యుదారభావ సౌశీల్యములనుబట్టి దేశమున కమితోపకారము గలుగుచున్నదని కనిపెట్టి శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారు శ్రీ నాయఁడుగారిని రప్పించుటకు దృఢమైన కృషిఁజేసిరి. శ్రీనాయఁడుగారు నోబుల్ కాలేజీలోఁ జేరక మునుపే కాకినాడలోని పీఠికాపురాధీశ కళాశాలలో నుచితస్థానము నాక్రమించి పనిచేయవలెననుమాట 1894 సంవత్సరములోనే వచ్చెను. అప్పుడు శ్రీ నాయఁడుగారు కళాశాల బాగోగుల నరసి దాని యభివృద్ధికి పాటుపడవలెనని శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు, వారి మిత్రులు తలంచిరి. అందుకుతగు నేర్పాట్లు త్వరలోనే జరుగునని యనుకొనిరి. వీరి శక్తిసామర్థ్యములను బ్రశంసింపనివారు లేకున్నను, ఈరాష్ట్రములో విద్యావ్యాసంగములోను, బోధనా విధానములోను వీరిని మించిన వారుగాని, సమానులుగాని లేరని యందఱు నంగీకరించుచున్నను, కాకినాడ పురప్రముఖులు కొందఱు శ్రీ నాయఁడుగారు

బ్రాహ్మమతావలంబు లగుటచే వారు ప్రధానాధ్యాపకులుగా వచ్చిన యెడల బాలురు స్వమతమును వీడుదురని నమ్మి కళాశాలాధ్యక్షులుగా వారిని నియమించు విషయమును దీవ్రముగా ప్రతిఘటించిరి.

శ్రీ పంతులుగారియొక్కయు, శ్రీ నాయఁడుగారి మిత్రుల యొక్కయు కోర్కెలు ఫలించునప్పటి కొక దశాబ్ది పట్టెను. ఏదో సామ్యము చెప్పినరీతిని, "చేతికిని నోటికిని నడుమ నెన్నియో యవాంతరము లుండునుగదా !"

1904 సంవత్సరమున మరల కాకినాడ కళాశాలాధ్యక్ష పదవికి కాళీరాగాఁ దత్కళాశాలాధికారవర్గమునకు శ్రీ నాయఁడుగా రొక యభ్యర్థనా పత్రమునంపి దానిలోఁ దాము ఉపాధ్యాయవృత్తిని స్వీకరించుటలోని పరమార్థమును ఉద్దేశములను స్పష్టముగా నీక్రిందిరీతిని బ్రకటించిరి. 'కళాశాలావ్యవహారములలోఁ బ్రవేశించుటలోఁగల నాముఖ్యోద్దేశము విశ్వాస నచ్ఛీలముల వృద్ధిజేయుట. వివాదాత్మకములయిన సాంఘిక తారతమ్యముల కందుఁ దావుండరాదు. భగవదాస్తిక్యబుద్ధియు, మానవసేవాసక్తియు, నందు స్థిరముగా నెలకొనవలెను. నిశ్చలమైన యాత్మాభిమానమును ముఖ్యముగా నేను వాంఛింతును. నేనుపాధ్యాయపదవి స్వీకరించినదానికిఁ బ్రయోజనము వృత్తిమూలకమగు నధికలాభముల గడించుటకంటె, పవిత్ర బాధ్యతలను, ఉత్తమావకాశములను, సక్రమముగా నిర్వర్తించుకొనఁగోరుటయే నే నిహలోకమున జీవింపగోరు విషయములోఁగల యుద్దేశ్యము. నా జీవితమునుండి భరతభూమిలోని

యువకులుయే యొకటిరెండంశములనో గ్రహించునట్లు చేయఁ గల్గుటయే’దీనినిగాంచి కళాశాలానిర్వాహక సంఘసభ్యు లొకరా సంఘ సమావేశమునందు ‘ఇదియేమి ఇదియొక దరఖాస్తువలె లేదే. శ్రీ నాయుడుగారు తామీ పదవి నలంకరించి చేయను న్న పనులనుగూర్చిన యధికారపత్రి ప్రకటనమువలె నున్నది’ అని వాకుృచ్చిరి. 1904 వ సం॥ రాంతమున కళాశాలా నిర్వా హణసంఘమువారు మూడునెలలు తీవ్రముగ వాదోపవాద మును సలిపి తుదకు 1904 సం॥ నవంబరు నెలలో ఆపదవి నభ్యర్థించిన సచ్ఛీలయుతులగు నిరువు రభ్యర్థులలోను శ్రీ నా యఁడుగారి నా పదవికి నియమించిరి. పోటీచేసినవారిలో నొక రైన (రైట్ ఆనరబుల్) వి.యస్. శ్రీనివాసశాస్త్రిగారికంటె శ్రీ నాయఁడుగా రుండవలెనని యధికవ్యక్తులు కోరుటచే శ్రీ నాయఁడుగా రా పదవియందు నియమితులైరి. నాటినుండియు కాకినాడపురము, రాజగౌరవములతోఁ గూడిన పిఠాపుర సం స్థానముగూడ, శ్రీ నాయఁడుగారి నిర్యాణమువఱకు, వారి పవిత్రి సద్బోధనల నంది, వందనపురస్సరగౌరవములతో వారిని బూ జించినవి. తరువాత రైట్ ఆనరబుల్ శ్రీ వి. యస్. శ్రీనివాస శాస్త్రిగారుగూడఁ దమ నివాసముచే కాకినాడకు గౌరవ మొ సగకపోయినను భారతజాతీయ వైజ్ఞానికరంగములలో విశేష ప్రఖ్యాతిగడించి, వివిధప్రాంతములలోను, వివిధశాఖలలోను, వన్నెకెక్కి కీర్తివంతులైరి. శ్రీ నాయఁడుగారు ఈశ్వరేచ్ఛచే వారియొద్ద చదువుకొనఁదలఁచిన విద్యార్థులయొక్క, కాకి నాడ పట్టణముయొక్క యదృష్టమునుబట్టి కళాశాలాధ్య

జ్ఞులై వినూతనాశయములతో ఆ కళాశాలచరిత్రలో నొక నూతనాధ్యాయ ప్రారంభము గావించిరి.

శ్రీ నాయఁడుగారు తమ నూతనోద్యోగమును 1-2-1905 తేదీని స్వీకరించిరి. ప్రథమశ్రేణి నోబుల్ కళాశాలవంటి యొక కళాశాలలో నధ్యాపకులుగను, మహబూబు కళాశాలవంటి యొక మహాసంస్థ కధిపతిగను, వానిని నిర్వహించుటలో, శ్రీ నాయఁడుగారు గడించిన యీ పదేండ్ల యనుభవమును వారికీ నూత్న పదవిని గ్రహించుటలో శ్రేయోదాయకమే యైనది. కాని మఱియొక దృష్టితోఁ జూచిన పీఠికాపురాధీశ కళాశాల కదియొక నష్టమే యైనది. యౌవనోత్సాహములతో కూడిన పదేండ్లజీవితము శ్రీ నాయఁడుగారు వేరొకచోట గడ పుటచే నది పీఠికాపురాధీశ కళాశాలకు నష్టముగాదా! శ్రీ నాయఁడుగారు కాకినాఁడ వచ్చినప్పుడు వారచ్చటఁ బదేండ్లు మాత్రమే విద్యాసేవజేయఁ సంకల్పించుకొనిరి. ఉద్యోగస్వీకరణమునకయి వారు కాకినాడ వచ్చినపుడు కాకినాడ రైల్వేస్టేషను ప్లాటుఫారముపై బండిదిగి తమ తల్లిగారున్న రైలుపెట్టె కడ కామెను వెదకికొనుచుఁ దొందరగా నడచిపోవునపుడు వారు కాలుజారి క్రిందఁబడిరి, అప్పుడు వారు షేక్స్పియరు మహాకవి జూలియస్ సీజరు నాటకమునందలి సీజరు జారిపడిన ఘట్టమును జ్ఞప్తికిఁదెచ్చుకొని యాతఁడప్పు డపశకునమని భావింపక రోమను సామ్రాజ్యలక్ష్మిని గట్టిగఁ జేపట్టుట కదియొక సుశకునమని యెట్లు భావించెనో యట్లే తాముకూడ కాకినాడ పట్టణమును బట్టువీడక యంటిపెట్టుకొనియుందుమన్నటుల

జాఱిపడిన వృత్తాంతమును దలఁచు చిఱునగవుతోఁ జెప్పుచుం డెడివారు. ఆ పట్టు పదేండ్లు గడుచువఱకును వారు కాకి నాడ వీడలేదు. మొదటినుండియు వా రిచ్చటనే యుండుటకు దృఢసంకల్పము గలిగియుండిరి. తాము పదవినుండి విరమించు టో, లేక స్వర్గధామమును జేరుటో తక్క మరొక్క మా ర్పేదియు జరుగరాదని వారి వజ్రసంకల్పము. ఆకర్షణీయము లగు హెచ్చుజీతముల నిచ్చెదమని, సంతృప్తికరమగు లాభ ములు గలుగునని శ్రీ నాయఁడుగారికి మిత్రు లప్పుడప్పు డా యుద్యోగము స్వీకరింపవలసినది, యీ యుద్యోగము గ్రహిం పవలసినదని యాహ్వానముల నంపుచునే యుండెడివారు. వా రందరకు జవాబు 'నేను పీఠికాపురాధీశ కళాశాలను జెఱఁబట్టు టకు రాఁగా నన్నది చెఱఁబట్టినది. నే నందుండి దప్పించుకొన జాలను' అని శ్రీనాయఁడుగారు ప్రత్యుత్తర మిచ్చుచుండెడివారు. ఈ పీఠికాపురాధీశ కళాశాలోద్యోగము తమ కభేదమును అవినాభావసంబంధము గలదిగా వారు కృతనిశ్చయులయి నిర్వ హించి రేగాని యుబుసుబోకకయి చేసియుండలేదు. వారీ యుద్యోగమున సుస్థిరముగ నెలకొనుటతో నదియే తా మైహి కప్రపంచమున నింకఁ జేయఁగల లౌకికోద్యోగములలోఁ గట్ట కడపటి దను దృఢసంకల్పముకూడ వారిలో నాటుకొనెను. కాని యీపదవినుండి విశ్రాంతి గైకొన్న మూఁడేండ్లలోపు ననే శ్రీ నాయఁడుగారి దృఢసంకల్పము భిన్నమై వారు మదరాసు విశ్వకళాపరిషత్తున కుపాధ్యక్షులుగ నియుక్తులయి యీయుద్యోగము స్వీకరించుట తప్పనిసరి యయ్యెను. ఈ

యుద్యోగస్వీకరణమునఁ గూడ వారి కానందమును గల్పించిన విషయ మొకటి గలదు. ఇదివఱలో పీఠికాపురాధీశకళాశాలాధ్యక్షులుగ నున్న వారే యిప్పుడు మదరాసు విశ్వకళాపరిషత్తున కుపాధ్యక్షులయిరని యాపత్రికటనలో నుండి యానందమును గూర్చిన కారణమున వా రాపదవిని నిరాకరింపలేకపోయిరి. కళాశాలయే తమవృద్ధికిఁ గారణ మయినది గాని కళాశాల వృద్ధికిఁ దాము కారకులము గా మనుట కీ యుదంతమును శ్రీ నాయఁడుగారు తమ సహజవినయగరిమ యుట్టిపడునట్లు పలు మాఱులు పలుకుచుండెడివారు.

వారు నిత్యసత్యవ్రతులు. దయార్ద్రహృదయులు. దానశీలురు. లోకవ్యవహారములం దెల్ల వారు ఋజుమార్గవర్తనులై మెలఁగిరి. నవనీతముకన్నను కోమల మైన వారి హృదయము చిన్నతప్పునకుఁ గూడ మిక్కిలి పరితపించి పశ్చాత్తాప మొందెడిది. వారి కారుణ్య మతి నిర్మలము. కోపము, క్రోధము వారియం దదృశ్యత నొందినవి. వా రజాతశత్రులు. కాన వారికి శత్రు వెవరు లే రనియే చెప్పఁదగును. ఏ కొలఁది మందిమైన నున్నను వారియెడఁ గూడ మిక్కిలి సౌమ్యమునే ప్రకటించుచు శ్రీనాయఁడుగారు వారికిఁ గూడ శ్రేయమునే గోరుచుండెడివారు. ఉన్నతపదవిలో నున్న యొక గౌరవనీయుఁ డామధ్య వారి శిష్యులగు పీఠికాపురాధీశులతో సంభాషించు నప్పుడు కొన్ని విషయములలో శ్రీ నాయఁడుగారితో భిన్నాభిప్రాయములు గలవారుగూడ వారి ఋషిజీవితచరిత్రములమాత్రము ప్రశంసించుచుండి రని వాక్రుచ్చెను. ఏపురప్రముఖులు

శ్రీ నాయఁడుగారికి కాకినాడ కళాశాలాప్రవేశము లేకుండఁ జేయఁదలఁచిరో వారే సంవత్సరము గాకమున్నే శ్రీనాయఁడు గారివంటి సమర్థులు, సజ్జనులు, విశ్వసనీయులు లే రని యభిప్రాయ మొసంగి తొంటి దురభిప్రాయమును మార్చుకొని, వారిచ్చుటకుఁ బ్రిన్సిపాలుగ, వచ్చినప్పుడు మొదటి రెండేండ్లు పరీక్షాపూర్వకవ్యవధిగా ప్రొబేషనుపైఁ బ్రవేశించినసంగతి నెఱిఁగినవా రయ్యు, ప్రొబేషనుకాలము పూర్తి కాకముందే కళాశాలాధ్యక్షులుగ శ్రీనాయఁడుగారిని ఖాయపరచుటకు యత్నించి యాపదవిలోఁ బ్రవేశించిన యాఱునెలలకే వారి నందు స్థిరపఱచిరి. శ్రీ నాయఁడుగారు వచ్చినపిదప కాకినాడ కళాశాలలోని విద్యార్థులసంఖ్య మునుపటికంటె మూఁడు రెట్లధిక మయ్యెను. ఆయనయొద్దఁ బుస్తకముఁ బట్టి పాఠము చదువుటయన్న విద్యార్థులకుఁ బండుగయని జెప్పుట యతిశయోక్తి కాదు. సాంఘికముగను, నైతికముగను, మతవిషయకముగను ఆకళాశాల గడించిన నేఁటి యుత్తమోన్నతస్థితిగతుల కెల్ల వారే కారకులు. ఈకళాశాలవిద్యార్థులసంఖ్యాబాహుళ్యవిషయమున నేమి, ఉత్కృష్టతోపయోగములవలన నేమి, శ్రీనాయఁడుగారి ప్రతిభాసామర్థ్యములు కారణములుగా నెట్టి ఘనతరాభివృద్ధిని గాంచెనో యెల్లరకును దెలిసియే యున్నది.

శ్రీనాయఁడుగారు మొట్టమొదటిరోజులలోఁ దాము పాఠములఁ జెప్పునపుడుగాని, పనిచేయునపుడుగాని నిలుచుండుటేగాని కూర్చుండు టెఱుఁగరు. కాని వయస్సు హెచ్చిన

కొలఁది నది మాఱెను. కళాశాల పనిచేయుచున్నపుడు వారు తరగతులచుట్టును దిరుగుచు, నుపాధ్యాయులు సక్రమముగఁ బాఠములు చెప్పుచున్నది, లేనిది, బాలురు తరగతిగదులలో శ్రద్ధాళువులై కూర్చుండి పాఠములను వినుచున్నది, లేనిది, పరిశీలించుచుండెడివారు. అది వారి కొక శరీరవ్యాయామము. మానసికోత్సాహచిహ్నము. తా మారోగ్యనియమములను బుద్ధిపూర్వకముగాఁ బాటింపని పాపుల మనియు, నట్టి యకార్యమునకు ఫలము తాము వార్ధక్యమున ననుభవింపవలసివచ్చె ననియు, అయినను సర్వేశ్వరుని యనుగ్రహముచేఁ దమకుఁ బుట్టుకతోఁ బ్రసాదిత మయిన శరీరదార్ఢ్యమే తాము శరీర వ్యాయామము చేయకపోయినను, జివరవఱకుఁ దమ్ముఁ గాపాడఁ గలిగినదనియు శ్రీ నాయఁడుగారు పలుకుచుండెడివారు.

కళాశాలలో వారి పరిపాలనాసందర్భమునఁ గలిగిన యభివృద్ధిపరివర్తనముల వరుసగాఁ బేర్కొందము. కళాశాలా వ్యవహారములను శాశ్వతోపయోగకరములుగా నొనరించి దానికి శ్రీ పీఠికాపురరాజావారిని యభిమాన పోషకులుగా నేర్పఱచి వారి పర్వతోపమసహాయమును శ్రీనాయఁడుగారు కళాశాలకుఁ గల్పించిరి. 1909 సం॥లో శ్రీరాజావారీకళాశాలకు లక్షయేఁబదివేలరూప్యములు విరాళ మొసంగి యందుకు యాజమాన్యము వహింపఁగా నీ కళాశాలయొక్క యార్థికస్థితి సుస్థిర మయ్యెను. శ్రీ నాయఁడుగారీకళాశాల నొక జాతీయసంస్థగా నెంచి, తరతరములనుండి విద్యాగంధ మెఱుఁగక తత్ప్రకాశమునకు విదూరులై యున్న నిమ్నజా

తులవారి బాలబాలికల కన్నితరగతులలోను నిరభ్యంతరప్రవే
శమును, నుచితవిద్య గఱపు నవకాశములను గల్పించి యుదా
రచిత్తముతో నీకళాశాలాచరిత్రమును ప్రశంసనీయముగ
సంస్కరించి, నాఁడే సాంఘికవిప్లవమునకు దారితీసిరి. మత
విషయికమయిన నిష్పాక్షికత్వమే కళాశాలాపాలనమున ప్ర
ధానసూత్రమయ్యెను. దీనికి ముఖ్యకారణము యౌవన మం
కురించుకాలమున సకలమానవులకు జాతిమతవివక్షతలేక విజ్ఞా
నము నొసంగి వారి జీవితముల నుచితములు, నుదారములు
నగు మార్గములఁ జక్కదిద్దవలయు ననెడి యుత్తమాశయముల
యెడ శ్రీ నాయఁడుగారికిఁ గల దృఢవిశ్వాసమే యని వేఱే
చెప్పనక్కఱలేదు. స్త్రీవిద్యార్థినుల కీకళాశాలలో నన్నితరగ
తులలోను నుచితవిద్య నేర్పాటుచేసిరి. ప్రప్రథమమునఁ గళా
శాలలో బాలికలను జేర్చుకొనుట 1911 సం॥రములో శ్రీ
నాయఁడుగారు కళాశాలాధ్యక్షులుగ నున్నప్పుడే జరిగెను.
ఆప్రతిపాదనపైఁ గళాశాలనిర్వహణసంఘసభ్యులు "స్త్రీలను
బడిలోఁ జేర్చుకొనిన మనము వేగుట కష్టమని" ప్రతిఘటింపఁ
జూచిరి. కాని కార్యశూరు లగు శ్రీ నాయఁడుగారు పట్టుదల
తోఁ "బ్రయత్నించి చూత" మనిరి. తరువాత నైదేండ్లకు
శ్రీ నాయఁడుగారి కళాశాలాపరిపాలనపై 1916 సం॥ములో
జరగిన తీవ్రాందోళనమునం దొకన్యాయవాదిమిత్రుఁడు వారి
కడకు వచ్చి "అయ్యా! మీరు స్త్రీలను గళాశాలలోఁ జేర్చు
కొనుటచేతనే మీ కింతముప్పు వచ్చినది." అని పలికిరి. వెం
టనే శ్రీ నాయఁడుగా రూరకొనక, "బడిపంతుల గొడవలు

న్యాయవాదుల కేమి తెలియునండీ!" అని యూరకుండిరి.
క్రమక్రమముగా స్త్రీవిద్యావిషయమై కళాశాలయందలి వాతా
వరణము మాఱినది. శ్రీ మల్లాది వేంకటశాస్త్రిగారివంటి వృద్ధ
సనాతనులు సయితము కళాశాలావిద్యార్థినులను "సోదరీమణు
లారా!" యని సంబోధించుచుండుటయు, నాబాలికలు వారిని
సహోదరులారా! యని పిలుచుచుండుటయు జరిగెను. మాతృ
జాతికిఁ జెందిన స్త్రీలెల్లరు విద్యావతు లయిననేగాని విద్య
యంతయు నసంపూర్ణమే యని కాకినాడపౌరులు గ్రహింపఁ
గల్గిరి. శ్రీ నాయఁడుగా రాఁడుపిల్లలు చేరునట్టి యున్నతపాఠ
శాలాంతరగతుల కొక్కొక్కతరగతి కొక్కొక్కగది చొప్పున
ననిమిదిగదులు గల బ్లాకు ఉండునట్లు పాఠశాలాభవనమును
పునర్నిర్మాణమొనర్చి యాబ్లాకుప్రక్కనే యున్న తమ కచ్చేరి
గదియందు దాయూఁడుబిడ్డలను సంరక్షించుచుండిరి. విద్యార్థినులకు
మఱుఁగుగా నుండునట్లు తమ గదిప్రక్కనే బాలికానిరీక్షణ
గృహము నేర్పాటుచేసిరి. బాలికానిరీక్షణగృహమున కెదుట
నున్న వరండాలోఁ గాక దానికి రెండవవైపున నున్నవరండా
లో మాత్రమే పురుషులు తిరుగవలెనని శ్రీ నాయఁడుగారి
యాజ్ఞ. తా మెప్పుడును బాలికాపక్షపాతి ననియే వారు
పల్కుచుండెడివారు. శ్రీ నాయఁడుగారి హృదయానురాగము
జూఱఁగొనుట ప్రతిబాలకునకు హక్కుగలదు. కాని మాతృ
దేవతాప్రతిబింబస్వరూప మగు బాలిక వారి హృదయాను
రాగమునకే గాక గౌరవమునకుఁగూడఁ బాత్ర మని వారి
యభిప్రాయము.

విద్యార్థుల గౌరవాదరములనే తమ జీవితమున కొక బహూకృతిగను, దమ జీవితసర్వస్వముగను భావించుచు, నాయఁడుగారు ద్విగుణీకృతోత్సాహముతోఁ బనిచేయుచుం డెడివారు. విద్యార్థుల ప్రేమగౌరవములు తమ పట్టున నెంత గాఢములో వారికిఁ దెలియును. తమ కబ్బినతమ శిష్యుల ప్రేమగౌరవములు తమ యుపాధ్యాయుల మూలముననే తమకు వచ్చిన వని శ్రీనాయఁడుగారి యభిప్రాయము. అయస్కాంత ముత్తరధ్రువమునకువలె, శ్రీ నాయఁడుగారి హృదయము వారి ప్రధానాచార్యు లగు శ్రీ మిల్లరుపండితులు జనించిన పవిత్రభూమి ఉత్తరస్కాట్లండువైపునకే చూపుచుం డెడిది. అట్టి పూజ్యపాదుల చరణసన్నిధిని విద్యాభ్యాసము గావించుచుండుటచేతనే ఆమానవునియందలి యమృతశక్తులను వెలార్చుకొను భాగ్యము దమ కబ్బినదని, అట్టి మహాపురుషు లను విస్మరించుట క్షంతవ్యముగాని ఘోరకృత్య మని శ్రీ నాయఁడుగారు చెప్పుచుండెడివారు.

శ్రీ నాయఁడుగారు కళాశాలాధ్యక్షులై వేలకొలఁది విద్యార్థులకు విద్యనే గాక సత్ప్రవర్తనము, సౌజన్యము మొదలయిన సుగుణములఁ గూడ నేర్పి యాకళాశాలకు మున్నెన్నఁడు లేని పేరుపెంపులను గలిగించిరి. మచ్చున కొకటిరెం డుదాహరణములు.

తఱచుగా శనివారమునాఁడు తాము ప్రత్యేకముగాఁ బ్రతివారము పెట్టునట్టి తరగతులకు నొకవిద్యార్థి యెప్పుడును రాక మానివైచుచుండెనని యొకప్పుడు శ్రీనాయఁడుగారి కొక

యాకాశ రామన్నయుత్తరము వచ్చెను. అప్పు డావిద్యార్థిని బిలువ నంపి "అబ్బాయి! నీవు నిజము చెప్పుము. ప్రతిశనివారము నీ వేల నాతరగతికి హాజరగుటలేదు? నీ కేదో దురభ్యాసము గల దనియు, నందుచే నీవు శనివారపుఁ బాఠములను మానివైచుచున్నా వనియు నాకుఁ దెలిసినది" అని వారు గద్దించుటతో నా బాలుఁడు నిజము చెప్పెను. ఆబాలుఁడు వివాహితుఁడుగూడ. అప్పుడు శ్రీ నాయఁడుగారతని బుజ్జగించి నిజము చెప్పినందుకు సంతోషించి "నాయనా! నీకు భార్యగూడఁ గలదు. ఆమె నీ దుష్ప్రవర్తన కెంత చింతిల్లుచున్నదోగదా! నీ వట్లు చేయుట తగునా?" యని నాయమను దలంచుకొని కంట నీరు పెట్టుకొనియడుగగా నాబాలుఁడు "అయ్యా! పై శనివారమునుండి యిఁకనట్టిపని జరుగనీయ నని వెక్కివెక్కి యేడ్చుచు శ్రీ నాయఁడుగారి పదకమలముల నంటెను. కొన్నిదినములు పోనిచ్చినపిదప వానిని బిలిచి "ఏమి బాబూ! నీసంగతి యెట్లున్నదని శ్రీ నాయఁడుగారు మరలఁ బ్రశ్నించుటయు, నందుల కాతఁ "డయ్యా! మీరు నాభార్యను బిలువ నంపి నాప్రవర్తననుగూర్చి యామెనే యడుగవచ్చు" నని జవా బిచ్చుటయు జరిగెను. ఆబాలుఁడు మాట నిలుపుకొని యాఘోరవిషసర్పమును శాశ్వతముగ బయటకు గెంటివైచెను. ఆబాలుఁడు చెడుత్రోవను విడచి సంస్కారమునొంది మంచిదారికి వచ్చెను. యువకులకు సహజ మగు పొరపాటులతోపాటు వారిలో నొకపాటి సత్యసంధతగూడఁ గొంత యుండును. ఇట్టి యనుభవ

ములు జీవామృతములు. హృదయదౌర్బల్యమునకు బలవర్ధకౌషధములు.

మఱియొక సందర్భమున విద్యార్థి వసతిగృహములోని కొందఱు సభ్యులు వచ్చి శ్రీ నాయఁడుగారితో 'అయ్యా! మా సహవాసి సుబ్బరాజు చుట్టలు కాల్చునండీ' యని చెప్పిరి. శ్రీ నాయఁడుగారు వెంటనే సుబ్బరాజును బిలువనంపి నేకాంతముగా 'నాయనా! సుబ్బరాజూ! ఏమి టీసంగతి? నీవు చుట్టలు కాల్చుచున్నావఁట! నిజమేనా?' యని ప్రశ్నించిరి. వెంటనే సుబ్బరాజు 'నిజమేనండి. నేను మెట్రిక్యులేషనుతరగతి చదువుచున్నపుడు నాకీ దురభ్యాస మలవడినది. ఇప్పుడు దానిని వదల్చుకొనుట కష్టముగా నున్నదండీ.' యని పలికెను. 'సరే మంచిది. నీకొక నెల వ్యవధి నిచ్చుచున్నాను. ఈలోపున నీ దురలవాటునుమానుదువోలేదో చూతునుగాక.' యనివచించిరి. ఆ నెలవ్యవధి గడచుటయు, నా బాలుఁడు వచ్చి 'అయ్యా! నేనింక ను దోషినేమో మీ రెవరినయిన నడుగవచ్చు' నని గుహూ త్తములగు శ్రీ నాయఁడుగారితో ననుటయుఁ దటస్థించెను. ఉపాధ్యాయజీవితమున కివియే బహూకృతులు. వాగ్దానములతో నూరకొనక యాచరణరూపమునఁ దమ యుపాధ్యాయుల గౌరవప్రతిష్ఠలను నిలువఁబెట్టు విద్యార్థులు దొరకుట యొక సుకృతమేగదా! వజ్రసంకల్పముతో మనము సంఘకాలుష్యమును నిర్మూలింపఁ బూనుకొనవలెనని శ్రీ నాయఁడుగారి యాశయము.

శ్రీనాయఁడుగారు ముప్ప దేండ్లకుఁ బైఁబడిన దమయుపా ధ్యాయవృత్తియందలి జీవితానుభవములను జ్ఞప్తికిఁ దెచ్చు కొని, "యెంతో కష్టించి పనిచేయుచున్నా మని ప్రపంచము కన్నుగప్పుట కెందఱెందఱో యువకులు మసిబూసి మారేడు కాయఁ జేసి తమ జీవితములను వమ్ము జేసికొనుచున్నారో గదా!" యని యప్పుడప్పుడు వాపోవుచుండెడివారు. ఒకప్పుడు శ్రీ నాయఁడుగా రొకవిద్యార్థి నొకపదమున కర్థ మడిగిరి. అపు డాయువకుఁడు చాటుగాఁ బ్రక్కవానినడిగి దెలిసికొని గంభీరధ్వ నితో దానియర్థము 'ఫూల్' అనిచెప్పెను. అపుడు శ్రీనాయఁడు గారు మెల్లగా 'నాయనా! యిది స్వీయజీవితవృత్తాంతమా?' యని యడిగిరి.

ప్రతి చిత్రలేఖనముతరగతినుండియు నొక బాలుఁడు పాఱిపోవుచుండుటను శ్రీ నాయఁడుగారు గమనించి వానిని బిలిచి 'ఓయీ! నీవు బెంచిపై నెక్కి నిలువఁబడు'మని యాజ్ఞా పించిరి. 'నేను నిలువను' అని యాబాలుఁ డనెను. 'అయినచో నొక యరడజను దెబ్బలు పట్టు' మని వా రనిరి. ఆబాలుఁడు 'నేను బడి విడిచిపోదునుగాని, దెబ్బలుగూడఁ దినను' అనెను. అప్పుడాయన 'నీవు బడి విడిచిపోయినఁ బోవచ్చును. కాని పోవుటకుముం దీపీడ్కోలువిందులోఁ బాల్గొనవలసినదే' యని వానిని బెత్తపుదెబ్బలు వడ్డించి మఱి పంపిరి. ఆబాలునితండ్రి సబుమేజస్ట్రేటుపదవిలో నుండెను. ఆయ నామఱునాఁడు మద రాసు ప్రభుత్వమువారి విద్యాశాఖానియమావళిప్రతి నొకదా నిని తనకుఁ బంపవలసిన దని శ్రీ నాయఁడుగారికి వ్రాయఁగా

వారు పంపిరి. తరువాత నాయుద్యోగి శ్రీనాయఁడుగారి కడకు వచ్చి "ఏమండీ! ఇంత చిన్నబిడ్డ యగు మా పిల్లవానికి మీ రింత కఠినశిక్ష విధించినారు. ఇది మీకు తగునా!" యని తన బాలుని వెంటఁబెట్టుకొనివచ్చి యడిగెను. శ్రీ నాయఁడుగారు "మీరు మీబాలుని వెంటఁబెట్టుకొని వచ్చి వానియెదుట న న్నిట్లడుగుట తగునా! మీబాలుఁడు తా నిదివఱలోఁ జెప్పి నట్లే బడి విడిచి పోవచ్చును" యని పలికిరి. బాలు నెదుటఁ బెట్టుకొని, వానిని వెనుకవైచుకొని వచ్చి యుపాధ్యాయునిఁ బ్రశ్నించిన తండ్రి యా బాలునకుఁ జివర కపకారియే యైనాఁడు. స్వల్పకాలములోనే యాబాలుఁ డింటఁ గొన్ని వస్తువుల సంగ్రహించి పాఱిపోయినాఁడు.

మఱియొకప్పుడు శ్రీ నాయఁడుగారు తమతరగతికిఁ జెందిన విద్యార్థుల వ్యాసరచనపుస్తకములను స్వయముగనే మోసికొనిపోవుచుండ నొక కొంటెబాలుఁడు తోడివారితో 'చూడుఁడు. మనగురువు రొక గాడిదెబరువు మోసికొనిపోవుచున్నారు.' అని కేలిసేసెను. సమయస్ఫూర్తిగల శ్రీనాయఁడుగారది విని 'నాయనా! ఇది యొకగాడిదెబరువు కాదు. పలుబది గాడిదెలబరువు మోసికొని పోవుచున్నాను' అని చమత్కరింప నాబాలుఁడు నివ్వెఱచెందెను.

శ్రీ నాయఁడుగారు తా మేర్పఱచిన నియమములను దామే పాటింపకుండి రని కొందఱు చెప్పుకొనుట గలదు. అప్పు డప్పు డెప్పుడయినఁ దప్పుచేయుట మానవస్వభావము గాకపోదు. అయినను శ్రీనాయఁడుగారు తాము చేసిన నిర్ణయ

ములను దా మెఱిఁగినంతవఱకు నెన్నఁ డుల్లంఘింపలే దనియే నుడివియుండిరి. షేక్స్పియరు 'వెన్నిసువర్తకుఁడు' (మర్చెంట్ ఆఫ్ వెన్నిసు) యను పఠనీయగ్రంథ మొకప్పుడు ఎఫ్. ఏ. విద్యార్థులకు శ్రీ నాయఁడుగారు బోధించుచుండఁగా నొక చిన్న విషయము జరిగెను. 'ఆంటోనియో' యను వెన్నిసువర్తకునిపైఁ గల యభియోగమును విచారించు ఘట్టములో దయాలక్షణములను గూర్చిన షేక్స్పియరు అమృతవచనములను శ్రీనాయఁడుగారు బోధించుచుండిరి. విశ్వవిద్యాలయపరీక్షలకుఁ బంపెడి విద్యార్థులను నిర్ణయించు సమయ మది. శేషాచలరావను బాలుని శ్రీ నాయఁడుగారు పరీక్షకుఁ బంపకుండ దిగఁ ద్రొక్కఁ దలఁచిరి. ఇట్టితరుణమున శ్రీనాయఁడుగారు పాఠము ముగించి, తరగతిగది విడచి, యీవలకు వచ్చునపు డాబాలుఁడు శ్రీనాయఁడుగారి కట్టెదుట కేఁగి, చేతులు జోడించి, వినయవినమిత గాత్రముతో 'అయ్యా! దయాప్రభావమును గూర్చి మీ రిట్టి గంభీరోపన్యాసము చేయుట నావంటివారిని పరీక్షకుఁ బంపక దిగఁద్రొక్కుటకా? నాపైఁ గరుణచూపరా?' యని ముఖాముఖినిఁ బ్రశ్నించెను. సహజదయార్ద్రమగు శ్రీనాయఁడుగారి హృదయము చలించి, 'వెనుకకుఁ బోయిన గోయి, ముందునకు వచ్చిన నూయి' యను చంద మయ్యెను. తమ నిర్ణయములను దాము పాటింపనయినఁ బాటింపవలెను. లేదా యానిర్ణయములను జూచియు జూడనట్లు ల్లంఘించి షేక్స్పియరుప్రతిష్ఠ నిలుపనయిన నిలుపవలెను. "అబ్బాయీ! నిన్నుఁ బరీక్షకుఁ బంపెదను" అను జవాబుదక్క నిట్టియెడ

శ్రీ నాయఁడుగారి నెఱిఁగి యున్నంతవఱకు వారినుండి మనమిఁక నెట్టి ప్రత్యుత్తరమును బడయఁగల్గుదుము? వా రాబాలుని బరీక్షకుఁ గూర్చుండ ననుజ్ఞ నొసంగుటయుఁ దప్పనిసరిగ నా తఁడు పరీక్షలోఁ దప్పుటయుఁగూడ జరిగెను.

శ్రీనాయఁడుగారు 1-2-1905 తేదీని కళాశాలాధ్యక్ష పదవిని స్వీకరించి యొక దశాబ్దిపర్యంతమే యాకళాశాలకు సేవ యొనర్చి మరల నదే తేదీని 1915 సం॥లో పదవీ విరమణ ము చేయవలెనని సంకల్పించుకొనియుండిరను విషయము పాఠ కులకు విదితమే. కాని తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచు నన్నట్లు వారు 1915 సం॥లో జరుపవలె ననుకొనిన విషయము పరమేశ్వరుఁడు 1919 సం॥వఱకు వాయిదావైచెను.

1915 సం॥లో తాము పదవినుండి విరమింత మనుకొను నప్పటి కాసంవత్సరము తాము వీడిపోవుట కది యదనుకాదని వారు కొన్నికారణములచే భావించిరి. మరుసటిసంవత్సరము తప్పక పోవలెనని సంకల్పించుకొనుటయు నాసంవత్సర మొక యపూర్వసంఘటనము సంభవించుటయు దానితో వారు తమ నిర్ణయమును మార్చుకొనుటయుఁ దటస్థించినది. 1916 సంవత్సరములో శ్రీనాయఁడుగారిపైఁ దీవ్రమగు సంచలనమును, నాందోళనమును బయలుదేఱినవి. చదువులోను, బడికి హాజ రగుటలోనుగూడ మిక్కిలి యశ్రద్ధగల యొకవిద్యార్థిని వారు పరీక్షకుఁ బంపకుండుటయే యందులకుఁ గారణము. "ఇఁక నేమి యున్నది ? మిన్ను విరిగి నాయఁడుగారిపైఁ బడనున్నది. శ్రీ పీఠికాపురాధీశకళాశాలపునాదులవఱకును గంపించిపోవలసి

నదే. నాయఁడుగారిని వెంటనే యుద్యోగమునుండి తీసివైచినఁ గాని కాకినాడప్రజానీకమునకు, లోకమునకు క్షేమము లేదు." అని కొందఱుమిత్రు లాందోళనము సాఁగించిరి. ఇట్టి విషప్రచారము వినుటతో శ్రీ నాయఁడుగారిలోని సైనికరక్తము వెల్లివిరిసి "ఏమయిన నగును. ప్రస్తుతపరిస్థితులలో నే నీపదవిని విడిచిపోను" అని శ్రీ నాయఁడుగారు పట్టుదల చూపుటయు జరిగెను.

1917 వ సంవత్సరమువచ్చినది. అప్పుడు విశ్వ విద్యాలయ కమిషనువారు కళాశాల పరీక్షణమునకై వచ్చిరి. అందుచే శ్రీ నాయఁడుగారాసంవత్సరము గూడ పదవినుండి విరమించి, విశ్రాంతి గైకొనుటకు వలనుపడలేదు. "ఇంతవఱకు నేను బాధ్యుఁడనై చేసిన పనులన్నిటికి నాయనంతరమువచ్చు కళాశాలాధ్యక్షునేల యుత్తరవాదిగ జేయవలెను. కమిషను వారి ప్రశ్నలన్నిటికి జవాబు చెప్పిన పిమ్మటనే విరమింతును." అని శ్రీనాయఁడుగారు నిర్ణయించుకొనుటతో 1917సం॥ గడచెను. కమిషనువారి పరీక్షసందర్భమున నొక విషయ మిటనుదాహరింపవలసియున్నది.

మార్కు హంటరు దొరగారి యధ్యక్షతక్రింద వచ్చిన మదరాసు విశ్వవిద్యాలయ కమిషను, కళాశాలయందలి బోధనావిధానమును, కట్టడములను, ఉపయోగించుసామగ్రిని విద్యార్థులాడుకొను నాటస్థలములను బరిశీలించిరి. తరువాతఁగళాశాల యాదాయవ్యయములకు సంబంధించిన లెక్కలు బరిశీలించిరి. "ఫీస్" రిజష్టరు చూచి యా దొర "ఏమి ఇందిన్ని బకాయి

లున్న వేమి? క్రమపద్ధతిని మీరు లెక్కలు వ్రాయుటలేదా" యని యాశ్చర్యముతో నడిగిరి. అప్పుడు శ్రీ నాయఁడుగారు "మేము 'ఫీస్' రిజిష్టరు నొకదానినుంచి లెక్కలు చూపుచుంటిమా లేదా యను విషయమే మీకు గావలసినది! బకాయి లున్నచో నష్టమును భరించుభారము ప్రభుత్వము వారినొక పైసయైన నడుగకుండ మాకళాశాలయే భరించుటకుఁ బూను కొనినప్పుడు మీకాబాధ యేల!" యని ప్రశ్నవైచిరి. దాని తో నాదొర నిరుత్తరుఁడై బకాయీలు మాటయే తన నివేదిక యందుదాహరింపమానెను. ఇంతసొమ్ము బకాయి యున్నదని శ్రీ నాయఁడుగారు జెప్పుటే తడవుగ శ్రీ మహారాజావారు వదాన్యతతో నాసొమ్ము నంతను బంపుచుండెడివారు. అడిగిన వారికి లేదనక శ్రీ నాయఁడుగారు బడి జీతములఁ జెల్లించు చుండిరి. గొప్పయింటి బిడ్డలు సయితము శ్రీ నాయఁడుగారి యుదారబుద్ధిని గనిపెట్టి తాముబీదవారమని తమ తలిదండ్రులు సొమ్ము కట్టలేనివారని జెప్పి సహాయమును బొందుచుండిరి. విద్యార్థులు విశ్వవిద్యాలయ పరీక్షలకు గట్టవలసిన రుసుములను నాయఁడుగారే ముందుగాఁ గట్టి వసూలిచ్చిన బిడ్డల నుండి వచ్చు సొమ్ముమాత్రమే గైకొనుచుండిరి. ప్రభుత్వము వారి పరీక్షాపత్రములు వ్రాసిన శిష్యులమార్కులను దెలిసికొనుటకు శ్రీ నాయఁడుగారు ముందే సొమ్మును గట్టి తెప్పించుచుండెడి వారు. అట్టి దానశీలురగు శ్రీ నాయఁడుగారు ఫీస్ రిజిష్టరు లోనిన్ని బకాయిలుండునపుడు వారుస్వయముగా గాని శ్రీమహారాజావారికి వ్రాసిగాని సొమ్మును జమకట్టు చుండెడివారు.

ఇదియొక దృష్టితోఁ జూచినఁ గళాశాలకుఁ బ్రతిష్ఠాకరమే. ఫీస్ రిజిష్టరులోనిన్ని బకాయిలుండుట యుదార పురుషులగు శ్రీపీఠికాపురాధీశులు యాజమాన్యము వహించుటచేతనే గాని తాము సారథ్యము వహించుటచేఁగాదనియు, ఆ ఘనత మహారాజులకే చెందునుగాని తమకుఁగాదనియు, తమజీతములోని సొమ్మునేమైనను దామా బకాయిలపూర్తికి వినియోగించిన నది మాత్రమే తమకుఁ జెందుననియు శ్రీనాయడుగారు పలుకుచుండెడివారు. 1918 సం॥లోఁగూడ శ్రీ నాయఁడుగారు విరమింపవలెననియే యనుకొనిరి. కాని విధి యందుకుగూడ నడ్డు తగిలెను. అప్పుడు శ్రీనాయఁడుగారు తాముచేసిన తప్పును గుర్తించి దానిని సవరించుటకనగా నాపదవినుండి విరమించుకొనుటకు మొట్టమొదటి యవకాశము నుపయోగించుకొని 1919 సం॥ లో నా పదవినుండి విరమించిరి.

శ్రీ నాయఁడుగారు తా మీ కళాశాలాధ్యక్ష పదవి వహించినయైదు సంవత్సరములకే తమ యనంతర మెవరినా పదవికి నియమింపవలెనాయని వెదకసాగిరి. వెంటనే శ్రీనాయఁడుగారి దృష్టి డాక్టరు వేమూరి రామకృష్ణారావుగారిపైఁ బడుటయు, వారే తమయాత్మ సంబంధియని తమయాదర్శములకు వారసులని శ్రీనాయఁడుగారు నిర్ణయించుటయు జరిగెను. శ్రీ నాయఁడుగారిచే నిట్టియ్యైకైకగౌరవాదరములను బడయగలిగిన శ్రీ వేమూరి రామకృష్ణారావు పండితులు ధన్య జీవులు. వారే శ్రీ నాయఁడుగారి యనంతరము కళాశాలాధ్యక్షులైరి.

1919-వ సం॥లో ఈ కళాశాలాప్రధానాచార్యపదవిని విడిచి విశ్రాంతిఁ దీసికొన్నతరువాతఁగూడ నాయఁడుగారు కళాశాలవిషయమున నొకయాప్తమంత్రిగా నుండి యధికార వర్గమున కెంతయుఁ దోడ్పడుచుఁ గళాశాలయం దెక్కువ యభిమానము గొని దానియభివృద్ధికై కృషిసల్పిరి. 1926-వ సం॥లో శ్రీపీఠికాపురము మహారాజావారు ఈకళాశాల సర్వాధికారములను శ్రీ నాయఁడుగారి సలహాపై సంపూర్ణముగఁ దామే తీసికొని మఱియొక లక్షరూప్యముల విరాళ మొసఁగి కళాశాల యార్థికస్థితిని మఱింత బలపఱచిరి. 1937-వ సం॥న మఱల ముప్పదియైదు ఎకరముల తోఁటభూమిని, నందున్న దివ్యభవనములనుగూడఁ గళాశాలకే యిచ్చివేసి వసతి, ఖేలన స్థలనైశాల్యవిషయముల దానికిఁ గల లోపసంకోచముల నివారించిరి. ప్రశంసనీయపథములపయి నీకళాశాలచరిత్రమునకుఁ గట్టుదిట్టముల నేర్పఱచిన దిట్ట శ్రీనాయఁడుగారే యని గట్టిగాఁ జెప్పవచ్చును. ఇందు వారి శిక్షణముక్రింద నాఱితేఱిన శిష్యవరులుగూడఁ బలువురు వృద్ధిలోనికి వచ్చి, యుత్తమస్థానముల నలంకరించి యాత్మశిక్షణమునందును, దేశసేవయందును నెక్కువగఁ గీర్తిగాంచిరి. వేయేల! శ్రీనాయఁడుగారి కీకళాశాల యెడఁ గల సంబంధాభిమానము లెట్టివో వారే యొకసందర్భమున నుడివిన "నాహృదయముదిగువ నొక యరయంగుళము కోసి చూడుడు. అందు 'శ్రీ పీఠికాపురాధీశకళాశాల' యను నక్షరములను గాంచఁగలరు." అను నొక చిన్నవాక్యము వల్లనే తెల్లమగును.

## 14. స్థానిక సంస్థలందలి సేవ

రెండవతూరి శ్రీ నాయఁడుగారు మచిలీపట్టణము లో నుండుటతటస్థించి నప్పుడనగా వారు నోబుల్ కళాశాలాధ్యా పకులై యున్న సమయమున వారుపెక్కేండ్లు పురపాలకసంఘ సభ్యులుగనుండుటగూడ నొకయదృష్టమేయని చెప్పవచ్చును. ఆనాఁటి యాపట్టణపు పురపాలక సంఘసభ్యులు పరస్పరాద రముగలిగి గౌరవ ప్రపత్తులతోఁ ప్రేమాస్పదులై యుండిరి. ఈనాఁటిపురపాలక సంఘసభ్యులకున్నంతగా వారికానాఁడధికా రములుగాని, నిర్వహింపవలసిన బాధ్యతలు గాని లేకున్నను ననురాగశక్తి సంపన్నతలో వారేనాటివారికిని దీసిపోరని చెప్ప వచ్చును. ఆ పురపాలకసంఘసభ్యులలో గల సుహృద్భావాను రాగసంబంధములకు మూలకారణము సర్వసర్వత్రగౌరవనీయుఁ డైన మెయిడర్ దొర పురపాలకసంఘాధ్యక్షుడుగ నుండుటయే. ఆయన పురపాలకసంఘ విషయములలో హృదయపూర్వకము గ జోక్యము కలుగఁజేసికొని పట్టుదలతో పని చేసెడివారు. ఒక్కొక్కప్పుడాసంఘసభ్యులలో నభిప్రాయభేదములు లేకపో లేదు. వారిసుమంతైన నీసున కవకాశమిచ్చెడివారు కారు. వారవలంబించు విధానము ప్రశ్నార్హమే యైనను వారియుద్దే శములను మాత్రము శంకించుటకవకాశము లేదు. అందులకేపకా గ్రిచిత్తముతోఁ దమ విద్యుక్తధర్మముల నిర్వహించుచుఁ పెక్కేండ్లు ప్రజాదరణమునకుఁ బాత్రులై వారాయున్నతపదవి యందుండిరి.

మచిలీపట్టణ పురపాలక సంఘ సభ్యులుగా శ్రీ నా యఁడుగారు కొన్నివేళల నాపట్టణము నందలి గృహములకేఁగి

పరిశీలించి యింటిపన్ను నిర్ణయింపవలసి వచ్చెడిది. ఒకప్పుడు వారొక మహమ్మదీయ గృహమును బరిశీలింపవలసిన యగత్య ముకలిగెను. వారాగృహమున కేఁగినపుడందు మగవారులేకుండుట తటస్థించెను. "మగవారింటలేరు తమరిపుడు రావీలులే"దని యందలి యాఁడువారు లోనుండియే జవాబిచ్చిరి. అపుడు శ్రీ నాయఁడుగారు "అమ్మా! నేను లోనికి వచ్చి యిల్లు చూచిపోఁకూడదా"యని యుర్దూలోఁ బ్రశ్నించుటయు వెంటనే యా మహమ్మదీయ వనిత "బాబూ! తమరా! తప్పక వచ్చి చూడవచ్చును" అని ప్రత్యుత్తర మిచ్చుటయు జరిగెను. పరపురుషులను గన్నెత్తి చూడని యన్యమతస్థులగు మహమ్మదీయ వనితలుగూడ శ్రీ నాయడుగారిని బితృ సమానులుగఁ జూచుచుండిరని మనకీ యుదంతము తెల్పుచున్నది.

పురపాలక సంఘసభ్యులుగ వారు మచిలీపట్టణమున గడపిన యాదినములలోని యొకటి రెండు విషయములను వారు తలఁచు చెప్పుచుండెడివారు. ఒక దినమున శ్రీ నాయఁడుగారు పురపాలకసంఘాధ్యక్షులగు శ్రీ మొయిద్దీన్ దొరగారికి "మనము విచారణచేయవలసిన వృత్తిపన్ను దరఖాస్తులు, అప్పీళ్లు మేటులవలెఁ బడియున్నవిగదా! మనము నేడు విచారింపవలసిన యింటిపన్నునకు సంబంధించిన యప్పీళ్ళేమియులేవా? అని వ్రాసిరి. ఆదొరగారు, తమ సహజహాస్యధోరణిని ఇంటిపన్నులకు సంబంధించిన యప్పీళ్ళు లేకేమి? గుట్టలుపడియున్నవి. కాని యంగడినొకటి నామడ నొకటి యిండ్లుగల యిట్టిపట్టణమునందంతదూరము దిరిగి,

ఆయాయిండ్లకుఁగల యర్హతలను బరిశీలించి, పన్నునిర్ణయిం చుటకుఁ దీరికయు, నోర్పునుగల బురపాలకసంఘసభ్యు లెవ రున్నారా యని నేనాలోచించుచున్నాను. కుతూహలమున్నచో నీపని మీరు నిర్వహింపవచ్చును. నాకెట్టియభ్యంతరములేదు అని ప్రత్యుత్తరమిచ్చిరి. శ్రీ నాయఁడుగారాపనికిఁ బూను కొనుటకు వెనుదీయక దానుసంసిద్ధుఁడ నేయని కబురంపిరి. అదివ ఱకు దామెన్నఁడు నెఱిగియుండని మాఱుమూలలకు బండిపైఁ బోయి, యిండ్లన్నియుఁ దిరిగివచ్చుసరికి వారికి మూఁడు దినములుపట్టెను. వ్యక్తిగతముగ నొక్కొక్క యప్పీలునే స్వయముగఁ బరిశీలించి తమకుఁదోఁచిన యభిప్రాయమును జెప్పఁగలిగితినిగదా యను తృప్తి శ్రీ నాయఁడుగారి కేర్పడెను. పురపాలకసంఘమువారును శ్రీనాయఁడుగారు సమర్పించిన నివేదిక సౌదార్యముతో నామోదించిరి. పురవాసులును, శ్రీ నాయఁడుగారు వెళ్లినచోటులనెల్ల "తమరు దయజేసి నారా? మాబోఁటివారికిఁ దప్పక న్యాయముకలుగును" అని వారికెంతో భక్తియుక్తులతో స్వాగత మిచ్చుచుండెడివారు. పురపాలక సంఘమునందలి సోదరసభ్యులుమాత్రము "నాయఁడు గారూ! మిమ్ములనీసందర్భమునఁ గొందఱుపౌరులు బుట్ట లోఁబెట్టి తమ కనుకూలముగనుండునట్లు ఇంటిపన్ను నిర్ణయిం పఁజేసికొనిరండీ"యని వారితో ఛలోక్తిగఁ బలుకుచుండిరి.

ఇంతకన్నను శ్రీనాయఁడుగారి మనమును గలఁచిన మఱి యొక పురపాలకసంఘ విషయముగలదు. అది పాకీపనివారల సమ్మె. ఆపురపాలకసంఘమునకుఁ జెందిన వీధులు తుడుచువారు

ను, పాకీపనివాండ్రు నొకానొక సందర్భమునఁ దమ కెక్కువ జీతము గావలెనని, పనికొంతతగ్గింపవలెనని తమకు నిడుపులయిన చీపుళ్ళను సరఫరాచేయవలెనని యిట్లేవేవోకొన్ని కనీసపుఁ గోర్కెలను బురపాలకసంఘమువారికిఁ దెలుపుచు సమ్మె గావించిరి. ఆతరుణమున శ్రీ నాయఁడుగారు చెన్నపట్టణముననుండిరి. సమ్మెదార్ల కోరికలను లెక్కచేయక, వెంటనే సమ్మెవిరమించి యెవరిపనులను వారెప్పటియట్లు జేయకున్నచో వెంటనే వారినిఁ బనులనుండి తొలఁగించి బయటినుండి క్రొత్తవారిని బిలిపించి నియమింతుమని పురపాలకసంఘము బెదిరించి పట్టుదల చూపెను. ఇట్టి విషమపరిస్థితిలో శ్రీ నాయఁడుగారు చెన్నగరమునుండి వచ్చిరి. వెంటనే వీథులు తుడుచువారును, పాకీవారును వారిల్లుచుట్టు ముట్టిరి. శ్రీ నాయఁడుగారు పురపాలకసంఘ ప్రత్యేక సమావేశము జరుపవలసినదిగా శ్రీ మెయిడెన్ దొరగారికి వ్రాసిరి. అందుకాయన నిర్ణీతసంఖ్యగల సభ్యులు సమావేశము జరుపవలెనని నోటీసునిచ్చినచో నట్లే సమావేశమేర్పాటు చేయుదుమని జవాబిచ్చిరి. అపుడు శ్రీ నాయఁడుగారు ప్రతి సభ్యునికడకునుబోయి సంతకములుపెట్టించి, సమావేశమునకేర్పాటుజేసి, యుండాసంఘమువారి నిర్ణయమునకుఁ దగుసవరణలు ప్రతిపాదించి, యుభయతారకముగానుండునట్లు తీర్మానమును, సంతృప్తికరముగా నొనరించిరి. శ్రీనాయఁడుగారి కృషి రెండువిధముల ఫలించినది. నాఁటినుండియు నెల్లరు శ్రీనాయఁడుగారే తమపక్షమున వకాలతుతీసికొనవలెనని కోరసాగిరి. న్యాయబద్ధములుగాని వకాలతులను శ్రీనాయఁడుగారు

మాత్రము దీసికొందురా? మచిలీపట్టణములో మామిడిపండ్ల రోజులలో నాంధ్ర దేశమునందలి మఱికొన్ని యితర నగరములలోవలెనే పాకీవాండ్రే మామిడిపండ్లమ్ముదురు. పాకీవాండ్రు కృతజ్ఞతాసూచకముగా శ్రీ నాయఁడుగారికిఁ గొన్ని మామిడిపండ్లను నేమానుఁ బంపిరి. కాని శ్రీ నాయఁడుగా రందొక్క పండుమాత్రమే గ్రహించి తక్కినవానికి వెలనిచ్చివేసిరి.

శ్రీ నాయఁడుగా రొకపర్యాయము పురపాలకసంఘములనుండి మదరాసు శాసనసభకు సభ్యునినెన్నుకొనుటకై జరిగెడి యెన్నికలలోఁ బాల్గొనుటకు మచిలీపట్టణ పురపాలక సంఘప్రతినిధిగా బెజవాడ కేఁగి తమపనిపూర్తిగావించుకొనివచ్చిరి. అప్పుడు వారి ప్రయాణపు బత్తెముబిల్లు ప్రసక్తి రాగా టి. ఏ. బిల్లు అనఁగా నేమియని యడిగిరి. తరువాతఁ దరువాత వారు టి. ఏ. బిల్లులవిషయములోఁ బ్రవీణులేయైనను, నప్పటికివారి కాబిల్లులయెడగల వైముఖ్యమీ క్రిందివిషయమువలన మనకుఁ దెలియఁగలదు. బెజవాడ ప్రయాణమునకు శ్రీ నాయఁడుగారు రెండు విధములుగా బిల్లు దయారుచేయవచ్చునట. ఒక్కఫక్కిని 34 రూపాయలును, వేఱొకఫక్కిని 57 రూపాయలును వారికి వచ్చుట కవకాశమున్నదఁట. కాని వారా రెంటినిగూడ నంగీకరింపరైరి. "నేను ఖర్చుపెట్టినది 10 రూపాయలే. ఈయన్యాయపుసొమ్ము నాకేల. నాకాపదిరూపాయలిచ్చినఁ జాలునని" శ్రీ నాయఁడుగారనిరి. తోడిసభ్యులు "మీకుబుణ్యముండును. మీరట్టిపనిమాత్రము చేయకుఁడు. ఇపుడు మీరు త్రోవ జూపినయెడల మేముగూడ మాకువచ్చుసొమ్మును బోఁగొట్టు

కొనవలసియుండున''ని బ్రతిమాలిరి. కాని శ్రీ నాయఁడుగారా పదిరూపాయలనుగూడ వదలుకొనుటకిష్టపడిరేగాని యన్యాయ ముగా నెక్కువసొమ్ము తీసికొనుట కంగీకరింపలేదు. అప్పు డప్పుడే ప్రాపంచికజ్ఞానమును గడించుచున్న శ్రీ నాయఁడుగారి లేతహృదయమునకీ టి. ఏ. బిల్లులోని యంతరార్థము బోధ పడలేదు.

అపుడపుడు శ్రీ నాయఁడుగారు, తమ పురపాలకసం ఘాధ్యక్షులగు శ్రీ మెయిడెన్ దొరగారి యాంధ్రభాషాజ్ఞాన మునుగూర్చి ఛలోక్తిగాఁ గొన్నివిషయముల చెప్పుచుండెడి వారు. వృత్తిపన్ను తగ్గింపవలసినదని దరఖాస్తుపెట్టుకొన్న వా రిని సర్వసామాన్యముగా దొరగారిట్లు ప్రశించుచుండిరి.

'నీకు భార్యయున్నదా ?' చిత్తం 'లేదండి' ఎందుకు పెట్టుకోలేదు. మఱియొకరినిట్లు ప్రశ్నించుచుండిరి.

"నీకు పిల్లలేదా?'' "చిత్తం లేదండి'' "ఎందుకుచెయ్య లేదు.'' నవ్వుగొలిపెడి దొరగారి యీ దేశభాషా సంభాషణము లకు సంఘసభ్యులు ముచ్చట చెందుటచే వారికా పురపాలక సంఘవ్యవహారములంత భారముగఁ గన్పించెడికావు.

ఆర్థికముగ బందరు పురపాలక సంఘవ్యవహారములను గూర్చి చెప్పవలెనన్న దాని కా నాడంత లబ్ధిలేదు. ఇప్పటివలె మంచినీటి వసతియులేదు. మచిలీపట్నమునకు మంచినీటివసతి కల్పింపవలెనని సలహానిచ్చినప్పుడు సంఘసభ్యులు "కుళాయి లు లేనిచో మచిలీపట్నములోని వారందరు మాడిపోవుదురా? మన తాత తండ్రులందఱకుళాయిలనీరు త్రావి యెనుబదియై

దేండ్లు దార్ఢ్యముగా జీవింపగలిగిరి'' అని ముసలియవ్వల ధోరణిలో మాట్లాడెడివారట.

మచిలీపట్టణ పురపాలక సభలలోను, తాలూకాబోర్డులలోను సభ్యులై యుండుటయే గాక కాకినాడ పీఠికాపురాధీశ కళాశాలాధ్యక్షులుగానున్నప్పుడు శ్రీ నాయఁడుగారు కాకినాడ పురపాలక సంఘమునకుపాధ్యక్షులుగాను, గోదావరి జిల్లాబోర్డు సభ్యులుగను, కాకినాడ తాలూకాబోర్డు ఉపాధ్యక్షులుగను చాలఁగాలము పనిచేసిరి. స్వార్థపరత్వమును వీడి ప్రజోపయోగ సౌఖ్యములనే ముఖ్య ప్రయోజనములుగాఁ బాటించి సేవగావింపవలెననెడి యుత్తమాశయమునందలి సుముఖత్వము నిట్టి సంస్థలు తమ పరిపాలనము నెఱపవలెనని చెప్పుచు శ్రీ నాయఁడుగారావిషయమున గొప్ప కృషి గావించిరి. 1919 సంవత్సరములో శాసనసభాసంస్కరణ సంఘమునందుఁగూడ వారు సభ్యులుగ నియుక్తులయి పిమ్మట నాసంఘమునకు ఉపాధ్యక్షులుగ నెన్నుకొనఁబడు గౌరవమునందిరి. శాసన సభా వేదిక నుండి వారు గావించిన గంభీరోపన్యాసములు వారి దీర్ఘ దర్శిత్వము, విశ్వాసము, విశాలావలోకనము, సార్వజనీనానురాగము వెదఁజల్లుచు వన్నెకెక్కినవి.

## 15. శ్రీ నాయఁడుగారికి గలిగిన గౌరవములు.

శ్రీ వేంకటరత్నము నాయఁడుగారు తమ జీవితమును సర్వతోముఖ కార్యరంగముల కర్పించిన ప్రతిభాశాలియగుటచే వారు బహుముఖములుగాఁ గావించిన ఘనకృత్యముల విలువను గ్రహించి ప్రభుత్వమువారు విశ్వవిద్యాలయాధికారులు,

పౌరులు, సంస్కరణవాదులు, బ్రాహ్మసామాజికులు ననేకవిధ ముల వారిని నిండార గౌరవాదరములతో సన్మానించిరి.

ఈ విద్యాపతి 1914 వ సం॥ లోఁ బ్రభుత్వసేవా విష యమున నేర్పడిన విచారణసంఘము (Public Royal Service Commission) నెదుట సాక్ష్యమొసంగెను. 1914_18 వఱకు స్కూలు ఫయినలు బోర్డులో సభ్యులుగాఁ బనిచేసిరి. 1918 సం॥ న పాఠశాలలలోఁ బ్రవేశపెట్టఁబడిన నైతిక బోధనప్రణాళి కకు (Moral Instruction scheme) వారేకారకులు. మద రాసు విశ్వవిద్యాలయ పరిషత్సభ్యులుగా (Fellow) వారు చాలఁ గాలముండిరి. ప్రభుత్వము వారేర్పఱచిన విద్యావిధానసం స్కరణాదిక విచారణ సంఘమునకు వారధ్యక్షులుగా నుండిరి. తరువాత 1923 సం॥లో మదరాసు విశ్వవిద్యాలయ పునర్ని ర్మాణవిషయమున శాసనసభలో నేర్పడిన ప్రత్యేక విచారణ సంఘమున సభ్యులుగా నియుక్తులయిరి. ఆంధ్ర విశ్వవిదాలయ స్థాపనకయి బయల్వెడలిన విచారణలో సాయమొనర్చుటకయి 1926 సం॥ లో వారాహ్వానింపఁబడిరి. ఆంధ్ర దేశమునకు వారు విద్యావేత్తగఁ జేసిన సేవను, ఆంధ్రవిశ్వవిద్యాలయపు బిల్లు ముసాయిదాను దయారుజేసి యది శాసనరూపముదాల్చు వఱకు జయప్రదముగా శాసనసభయందు వారాబిల్లును నడుపు కొని వచ్చుటలోఁ గావించిన కృషిని నాంధ్ర దేశము తరతర ముల దనుక కృతజ్ఞతఁ జూపవలసియున్నది. అప్పటి మదరాసు ప్రభుత్వమాబిల్లును శాసనరూపమొందించుటకు సమర్థులగు శ్రీనాయఁడుగారి సాహాయ్యసహకారముల నర్థించి వారిని

శాసనసభాసభ్యులుగ నియమించిరి. బాధ్యతావిశ్వాస సంయుతములయిన యీపదవులన్నిటి యందును వారుఁ బ్రకటించిన చాకచక్యమునకు, సమగ్రశక్తికి, మనస్ఫూర్తికి శ్రీనాయఁడుగారెన్నియో మన్ననల నందిరి. ఇవిగాక విద్యాసంబంధికములగు సభ లెన్నిటికో వా రగ్రాసనాధిపతులుగా నుండి నిర్వహించిరి.

శ్రీనాయఁడు గారి సర్వతోముఖ సేవకయి వారికి లెక్కలేని బిరుదములు ప్రసాదింపఁబడినవి. వారికి వచ్చినబిరుదము లన్నియు సముచితముగను, దలవని తలంపుగను వచ్చి వారి నాశ్చర్యనిమగ్నులను గావించెడివి. 1911-వ సంవత్సరమున జరగిన ఢిల్లీదర్బారుసందర్భమున శ్రీ నాయఁడుగారికి దొరతనమువారు రావుబహదరు బిరుద మొసఁగిరి. అందుఁ గూర్చి టెలిగ్రాము రాఁగా వారు దానిని విప్పి చూచికొనిరే గాని యందలి విషయమును వా రెవరికి నెఱిఁగింపరయిరి. ఆ టెలిగ్రాము పొరపాటునఁ దమ కందఁజేయఁబడె ననియు, నా విలాసముగల వేంకటరత్నము మఱియొకరై యుండుననియు వా రభిప్రాయపడిరి. కాని పురప్రముఖులలో నాబిరుదప్రసక్తి యతి త్వరలో వ్యాపించుటయు వార లమితానందముతో శ్రీనాయఁడు గారిని నుతించి సత్కరించుటయు, నాఁటి మహాసభయందు జిల్లాకలెక్టరు వారి నాబిరుదముతో సన్మానించుటయు జరగెను. 1918-వ సం॥లో 'దివాన్‌బహదూరు' బిరుదముతోఁ బ్రభుత్వమువా రీఘనుని సత్కరించిరి. 1919-వ సం॥న ఋషితుల్యులై, యాార్ష విద్యాస్వరూపులయిన విద్యాపతి శ్రీనాయఁడుగారిని దక్షిణభారతోపాధ్యాయసంఘమువారు కులపతి

యను బిరుద మొసంగి గౌరవించిరి. పతితదీనజనోద్ధరణమునందు వారుచూపిన సేవాపరాయణత్వమునకు సంతసించి 1923-వ సం॥ లో శ్రీ నాయఁడుగారికి శ్రేష్ఠమయిన "కైజరీ హింద్" బంగారు పతకము దొరతనమువారు బహూకరించిరి. 1924-వ సం॥లో శ్రీనాయఁడుగారికి రాజయోధత్వసూచక మగు "సర్" (నైటుహుడ్) బిరుదమునుగూడఁ బ్రభుత్వమువా రొసంగి గౌరవించిరి. సర్కారుకొలువులో లేని విద్యాసేవకులలో నీ బిరుదము నందినవారిలో శ్రీ నాయఁడుగారే మొదటివారు. దానినిబట్టియే వారి విద్యాసేవ యెంత మహోన్నత మైనదో గుర్తింపఁదగును. ఈ మహాబిరుదము వారి కందఁజేయఁబడినప్పుడొక స్నేహితుఁడు వారిచెంత నుండుట తటస్థించెను. ఆయ నీవార్త విని "అయ్యా! (సర్) నాయఁడుగారూ! పెక్కేండ్ల నుండి యెందఱెందఱు విద్యార్థులు మిమ్ముల "నయ్యా" (సర్) యని సంబోధించలేదు? అంతకంటె నీబిరుద మెట్లు ఘన మైనది?" అని చమత్కరించెను.

పునర్నిర్మితమయిన మదరాసు విశ్వవిద్యాలయమునకు 1925-వ సం॥లో వారు మొదటి యుపాధ్యక్షులుగా (Vice-Chancellor) నెన్నుకొనఁబడిరి. ఆపదవియందున్న కాలములో వా రావిశ్వవిద్యాలయమునందు ప్రాచ్యభాషాపరిశోధన, వైజ్ఞానిక పరిశోధన, సాంస్కృతిక భాషలు, చరిత్రశాఖ, విజ్ఞానశాఖ, తత్త్వజ్ఞాన గణిత శాఖలు, దేహపరిశ్రమ, ద్వితీయభాషాపఠనము మున్నగు శాఖల నేర్పాటుజేసిరి.

ఆంధ్ర విశ్వవిద్యాలయము 1927-వ సం॥న ప్రథమపట్ట ప్రదాన సభలో నీ మహామహునకు "వాఙ్మయాచార్య" (Doctor of Literature) యను గౌరవపట్ట మొసఁగి తన్నుఁ దా గౌరవించుకొనెను. 1927-28 సం॥లో నాంధ్రవిశ్వవిద్యాలయములో వారు "ఇంటరు బోర్డు" (Inter Board) కు అగ్రాసనాధిపతిగా నియుక్తు లయిరి. ఆంధ్రసంస్కృతికిని, నాంధ్రుల విద్యకును దమ జీవితము నంకిత మొనర్చి యపార మగు సేవ గావించిన శ్రీనాయఁడుగా రాంధ్రవిశ్వకళాపరిషత్తునకు 'గ్రేటర్ ఇండియా' (Greater India) 'వేమన' యను విషయములపై నుపన్యాసావళి నిప్పించుట కొరకు భూరివిరాళము నొసంగుటయ గాక తమ షష్టిపూర్త్యుత్సవసందర్భమునఁ దమకు శిష్యులు కానుకగా నర్పించిన ద్రవ్యమునుగూడ నాంధ్రవిశ్వకళాపరిషత్తునకే గుప్తదానము గావించిరి.

మదరాసు విశ్వవిద్యాలయమువారు 1930-వ సం॥లో తమ సెనేటుసభకు శ్రీ నాయఁడుగారిని యావజ్జీవసభ్యునిగా నేర్పఱచుకొనిరి. శ్రీనాయఁడుగారు తమగురువర్యులగు డాక్టరు మిల్లరుపండితులపేర మదరాసు విశ్వకళాపరిషత్తునందు "ది ఎవర్ ఇంక్రీజింగ్ పర్పస్ ఆఫ్ గాడ్" (The ever increasing purpose of God) అను విషయముపై నుపన్యాసముల నిప్పించుటకుఁ బదివేలరూపాయల విరాళము నొసంగిరి. 1932-వ సం॥న మదరాసువిశ్వకళాపరిషత్తువారు తమ ప్రథమోపాధ్యక్షులగు శ్రీ నాయఁడుగారిని "న్యాయాచార్య" (Doctor of Laws) యను

గౌరవ బిరుదముతో సత్కరించిరి. వారి తైలవర్ణ చిత్రమును గౌరవపూర్వకముగ సెనేటు సభామందిరములోఁ బ్రతిష్ఠించిరి.

శ్రీ నాయఁడుగారి ఋషితుల్యమైన నైతికనిర్మలాధ్యాత్మికజీవనము, నగాధమగు మతవిషయకశక్తిని గుర్తించి వారి 70-వ జన్మదినోత్సవసందర్భమున భారతదేశములోని యేకేశ్వరోపాసకు లందఱుఁ గలిసి వారికి "బ్రహ్మర్షి" బిరుదప్రదానము గావించిరి. శ్రీ నాయఁడుగారు బిరుదముల కాసపడి యధికారుల యనుగ్రహమునకై వారి వెంటవెంటఁ దిరిగెడు వారు కారు. ఆయన విద్యాప్రవీణతను, గుణగణములను సామర్థ్యమును, కార్యాచరణదీక్షను గనిపెట్టి దొరతనమువారు, విద్యాసంస్థలు తమంతటఁ దామే యయాచితముగా వారికి బిరుదు లొసంగియుండిరి. పైఁ జేర్కొనిన బిరుదప్రదానము లన్నియు నందుఁగూర్చి మున్నుగా నొక్కింతయైన శ్రీ నాయఁడుగారికిఁ దెలియకుండ నాకస్మికముగనే ప్రాప్తించినవి. కాని యవి యితరులు బలువురకుం బలె వారి సంతోషమునకుఁగాని, గర్వమునకుఁగాని కారణములు కాలేదు. ఎట్టియెడలను వారు పరమేశ్వరునియెడ దాసానుదాసభావమునే గలిగియుండిరి. తమకుఁ బ్రాప్తించిన యాగౌరవములు, బిరుదములు తమ గుణములమూలమున లబ్ధమయినవి కావనియు, వానిని గయికొనుటకు దమ కేపాటియర్హతగూడ లేదనియు, నవి దమవంటి పాపాత్మునియెడఁగూడ కరుణాసముద్రుఁ డగు పర

మేశ్వరుఁడు ప్రకటించెడి యవ్యాజానురాగమునకుమాత్రమే యాదర్శము లగు ననియు వారు తెలుచుఁ జెప్పుచుండిరి.

వాస్తవమున కాంధ్రదేశముననేకాక యావద్భారతదేశమునను శ్రీ నాయఁడుగారిని వరించినన్ని బిరుదములు మఱెవ్వరిని వరించలేదని చెప్పవచ్చును. ఆయనను జేపట్టి యాబిరుదములే గౌరవమొందెను. కాని వానివలన శ్రీ నాయఁడుగారికిఁ గ్రొత్తగౌరవము వచ్చిన దని చెప్పఁజాలము. శ్రీ నాయఁడుగారికి బిరుదు లనిన నాదరమే గాని న్యూనత యెన్నఁడు లేదు. వాని ఘనతయు, వాని విలువయు వానికున్న వని బిరుదములఁగూర్చి వారియభిప్రాయము. శ్రీనాయఁడుగారికి వచ్చిన బిరుదులపరంపరలు వారికిఁ గాకపోయినను వారి సన్నిహితవర్గమువారికి వినమ్రతాపూర్వక మగు గర్వకారణము లయ్యెను.

---

## 16 శ్రీ నాయఁడుగారి సాంఘిక రాజకీయ ప్రజాహితజీవనము

బహువిధాత్మకమయిన శ్రీ నాయఁడుగారి ప్రజాహితోద్యమముల నొక పట్టికగాఁ జెప్పినంతమాత్రమున నది వారి యాత్మోన్నతి నర్థ మొనర్చుటకై మన కంతగా నుపకరింపనేరదు. వా రేసంస్థకు నాయకత్వము వహించినను, ఏప్రజాహితసంఘమున కధ్యక్షత నిర్వహించినను నిశ్చలమైన నైతిక

ప్రవర్తనవలనను, బవిత్రకార్యదీక్షామూలముననే విజయముల నందఁగలిగిరి.

1880-90 సంవత్సరములమధ్య శ్రీనాయఁడుగారు కాంగ్రెసుసంస్థలో మహోత్సాహముతోఁ బాల్గొనిరి. "సౌందర్యమునకు శరీరావయవ సౌష్ఠవ మెట్టిదో, మనుజుని నడవడికకు నిర్మలత యట్టి దనియు, నది యాదృచ్ఛికముగఁ, దాత్కాలికముగఁ గూర్చు నలంకరణమువంటిది గాక కేవల నిర్మాణమునకే యావశ్యకమయిన ముఖ్యావసర మనియు" శ్రీ నాయఁడుగారు బాహాటముగాఁ జాటిచెప్పిరి. ఇట్టి దృఢనిశ్చయాదర్శములవలని బలముచేతనే 1894 వ సం॥లో నాకాలములో జరగిన యొకసంఘటనను జ్ఞప్తి కెలయించినచోఁ బ్రజాహితజీవనములో వారికిఁ గల పవిత్రాత్మవిశ్వాసములు వ్యక్తము కాఁగలవు. అదియే "నార్టను ఉదంత" మని యానాఁటి యభిజ్ఞులచేఁ బ్రశంసింపఁబడినది. ఒకప్పు డఖిలభారతజాతీయమహాసభ మదరాసునగరమున శ్రీయుత ఆనంద మోహనబోసుగారి యధ్యక్షతను నిర్వహింపఁబడెను. ఆకాలమునఁబ్రముఖవక్తయు, బ్రసిద్ధన్యాయవాదియునని పేరొందిన "ఎర్డ్లీనార్టను"దొరగారికి రాజకీయవర్గములందు విశేషగౌరవ ముండెను. భారతదేశమున నివసించు కొలఁదిపాశ్చాత్యులలో నప్పుడు భారతీయాదర్శములకు, వాంఛలకు సానుభూతి ప్రకటించువారిలో శ్రీనార్టనుదొరగారు కూడ నొకరుగా నుండిరి. అందుచే నప్పటిజాతీయమహాసభలో శ్రీనార్టనుదొరగారుకూడఁ గొంతపాల్గొని యుపన్యసింప నేర్పా

టులు జరగియుండెను. కాని శ్రీదొరగారిశక్తిసామర్థ్యముల కున్న పేరు వారి నైతికజీవనమునకుమాత్రము లేదు. అందుచే శ్రీ నాయఁడుగారు సభలో లేచి నైతికజీవనములోఁ గుంటువడి యున్న నార్టనువంటివాని కెన్నికఁగన్న నాయకులతో పాటు గణ్యస్థానము నిచ్చుట తగదని, యట్టిది గౌరవనీయ మగునట్టి సంస్థకుఁ బ్రత్యక్షముగ లజ్జావమానములను దెచ్చిపెట్టుటయని యు వాదించి ప్రతిఘటించిరి. మొదట శ్రీనాయఁడుగారి ప్రతి ఘటనము తీవ్రసంచలనము గల్గించినను దుదకు వారిమాటలే చెల్లుటయు, శ్రీనార్టనుదొర మదరాసును,మదరాసురాజకీయము లను వదలి కలకత్తాకుఁ బోవుటయుఁ దటస్థించెను. పాపిని మనము ప్రేమించి క్షమింపవలెను. పాపి పశ్చాత్తప్తుఁడై హృ దయపరిణామము నొందినతరువాత మనముగూడ వానియెడల మన వైఖరిని మార్చుకొనవలెను. అంతియేకాని వాని నందల మెక్కించుట పాపమును బ్రోత్సహించి యాస్తికతాసచ్ఛీలము లను రూపుమాపుటయే యగును. ఏతావులఁ గల్లకపటములు ప్రవర్తిల్లెడివో యని శ్రీ నాయఁడుగారి సమక్షమున భయ ముతోఁ దలలు వంచెడివి. అవి కేవలము భయపడుటమాత్రమే గాక నాయఁడుగారి దివ్యసమక్షమున పవిత్రతనుగూడఁ బొందు చుండెడివి. రాజకీయములలో శ్రీ నాయఁడుగారు సము చితములైన యుదారాశయములు గలిగియుండెడివారు. విదేశ వస్తువులకన్న స్వదేశవస్తువులనే వా రాదరించెడివారు. కాని

యెన్నఁడు వారు విదేశీయులను గలలోనయిన ద్వేషించి యెఱుఁగరు.

శ్రీ నాయఁడుగారి నాఁటి లేతహృదయమునం దమిత ముగ నుత్సాహాగ్ని ప్రజ్వలిత మగుచునే యుండెడిది. వా రెప్పుడు మాట్లాడినను సంస్కరణమునుగూర్చియే పట్టుదల చూపెడివారు. సంస్కరణముకొఱకు విప్లవమయినను వారు కావలెననియే పలుకుచుండెడివారు. ఇట్టి వీరి సంస్కరణాభి లాష యానాఁటి యువకులలో ధైర్యోత్సాహములను రేకె త్తించి పులితోఁ జెలులాటము సాగింపఁగల దండిమగఁడు మనలో నొకఁ డున్నాఁ డను ధైర్యమును వారికిఁ జేకూర్చినది.

1898 సం॥న గుంటూరులో జరగిన కృష్ణామండలరాజ కీయసభకు, సంఘసంస్కరణసభకు శ్రీ నాయఁడుగా రగ్రాస నాధిపత్యము వహించి వాని నెంతో జయప్రదముగా నడిపిరి. 1904 సం॥న ఉత్తరార్కాటుజిల్లాలోని రాణీపేట రాష్ట్రీయ సాంఘికమహాసభకు వా రధ్యక్షత వహింపవలసి వచ్చెను. అప్పుడు శ్రీ పండిత శివనాథశాస్త్రిగారు మదరాసులో నుండిరి. వారియొద్ద శ్రీ నాయఁడుగారు సెలవు గైకొని మహాసభ కేఁగి యధ్యక్షత వహించి తిరిగి వచ్చినపిదప "వేంకటరత్నమా! నీ యుపన్యాసమున వారి కేమని చెప్పితివి?" అని శివనాథ శాస్త్రిగారు ప్రశ్నింప, శ్రీ నాయఁడుగారు తడవుకొనక "మీ రెల్లరు నిత్యానందముతో నుండవలెనని మీ వాక్కుగా నుడి వితి" నని వెంటనే జవాబు చెప్పిరి. అప్పుడు శ్రీ శాస్త్రిగారు

"అటులనా? నే నెపుడు నిత్యానందముతో నుందునా'' యని తిరిగి ప్రశ్నించిరి. కోలిరిడ్జిమహాకవి చార్లసు లాంబును "నే నెప్పుడు నీకు నీతిబోధ చేయుచున్నట్లుగనే కన్పింతునా?'' యని ప్రశ్నించినపుడు నత్తినత్తిగా లాంబు "మీరు వేఱొక పని చేయుచుండఁగా నేను చూడలేదు'' అని పలికెనఁట. అట్లే తమ యాధ్యాత్మికగురువర్యు లగు పండిత శివనాథశాస్త్రి వర్యుల ప్రశ్నకు "అయ్యా! మిమ్ములను నిత్యానందముతోఁ దప్ప వేఱొకవిధమున నుండుట నేను చూడలేదు.'' అని మాఱువలికిరి.

ఆదినములలో శ్రీ పండిత శివనాథశాస్త్రి మహాశయులు మదరాసులో నుత్తేజ మగు నుపన్యాసముఁ గావించిరి. శ్రీ నాయఁడుగారును, శ్రీశాస్త్రివరులును సంభాషించుకొనుచున్న సమయమున నొకవ్యక్తి యచటికి వచ్చి యేవేవో సందర్భములేని మాటలు గొణుగుకొని వెడలిపోయెను. అప్పుడు శ్రీ శాస్త్రీ పండితులు "నిన్నటి రేయి నేనిచ్చినయుపన్యాస మీతనికిఁబిచ్చియెత్తించినదికాఁబోలు. నే నొక్కొక్కప్పుడు మనుష్యులను బిచ్చివారినిగాఁ జేయుచుందునని''ని పలికిరి. అందుకు శ్రీ నాయఁడుగారనన్య సామాన్య మగు సహజసమయస్ఫూర్తితో "ఔనండీ. మీరు చాలమంది పిచ్చివారికిఁ బిచ్చిపోఁగొట్టిరి కూడ! ఇదియే ఈశ్వర సత్యసందేశ హారులందలి యపూర్వ విషయము'' అని వచించిరి.

1905 సం॥లో రాజమహేంద్రవరము, ఆరణిపట్టణముల లో జరిగిన మాండలికాస్తికమహాసభలకధ్యక్షులై శ్రీనాయఁడు గారు దక్షతతో వానిని నడిపిరి. ఆసంవత్సరముననే నర్సారావు పేటలో జరిగిన యుభయకృష్ణాగుంటూరుసాంఘికమహాసభకుఁ గూడ నధ్యక్షులుగా నుండిరి.

1906 సం॥లో శ్రీనాయఁడుగారు కలకత్తానగరమున జరిగిన అఖిలభారతాస్తికమహాసభ కగ్రాసనాధిపతియయ్యెను. ఆనాటి వారి యధ్యక్షోపన్యాసమాధ్యాత్మికశక్తి సంపదలతోఁ దొణికి సలాడుచు డాక్టరు మార్టినోశైలినిబోలి, జీవితపరమార్థ సంశ యములనెఱిఁగింపఁ జేయు భావోన్నత శిఖరములకు శ్రోతలను దీసికొని పోయినది. దానిని జదివిన మనకుఁ గూడ నట్టి భావమే కలుగును.

1914 లో ఆఫ్రికాలో గాంధీమహాత్ముని సత్యాగ్రహ మహోద్యమమును బలపరచుటకు కాకినాడలో నేర్పాటుచేయ బడిన మహాసభలో గవర్నమెంటు చర్యలను సునిశితముగ విమర్శించుచు గంభీరముగ నుపన్యసించిరి. నాటిసభలోని వారి ప్రసంగమును విమర్శను నేటికిని వారి శిష్యులు ఘనముగా చెప్పుకొందురు.

1916 సం॥లో మదరాసు క్రిష్టియను కాలేజి వార్షికో త్సవసమావేశమునకు వారధ్యక్షత వహించిరి. 1921 సం॥లో అమలాపురమున జరిగిన ఆది ద్రావిడ మహాసభ కగ్రాసనాధిప త్యమువహించిరి. ఆసంవత్సరముననే కాకినాడలో జరిగిన "ఆంటి నాన్‌కోఆపరేషను" సభకధ్యక్షతవహించిరి. 1927-వ సంవత్స రమున కాకినాడలోని బ్రహ్మోపాసనామందిర ప్రతిష్ఠాపనా

దినోత్సవమునకధ్యక్షులు నాచార్యులై దిగ్విజయముగా జరిపిరి. 1928 సం॥లో కాకినాడలో జరిగిన బ్రాహ్మసమాజశతవార్షికో త్సవమున కధ్యక్షులుగ నుండిరి. 1929 సం॥వఱకు మదరాసు బ్రాహ్మసమాజమునకును 1939 సం॥ వఱకు కాకినాడ బ్రాహ్మ సమాజమునకును నధ్యక్షులుగా నుండిరి.

1933 సం॥ కాకినాడలో జరిగిన రాజర్షి రాజా రామ మోహనరాయలవారి శతవార్షికోత్సవమునకధ్యక్షులై యావ దాంధ్ర దేశమున రామమోహనుని దివ్యప్రబోధమునఁ బ్రచా రము గావించిరి. 1936 సం॥ న పిఠాపురము దివాను శ్రీ కోకా వేంకట సుబ్బారావు నాయఁడుగారి షష్టిపూర్తిమహోత్సవము నకును సభాధ్యక్షులుగనుండిరి. 1937 సంవత్సరమున జరిగిన కాకినాడ బ్రాహ్మసమాజస్వర్ణోత్సవమునకును, అపుడు జరిగిన యాంధ్రాస్తికమహాసభకును వా రధ్యక్షులుగా నుండి జయ ప్రదముగా వానిని నడిపించిరి.

## 17. రాజర్షి-బ్రహ్మర్షి

ఉత్తర సర్కారులలోని జమీందారీలలో నతిముఖ్య మైనది పీఠికాపురసంస్థానము. దీనినిఁ బూర్వము పిష్ఠపుర మని వ్యవహరించెడివారు. ఇచ్చట బౌద్ధ స్థూపములు, ఆరా మములు అక్కడక్కడ నిపుడిపుడే కాన్పించుచుండుటచేత బౌద్ధ మహా యుగములో నిది యతిప్రసిద్ధి నొందిన స్థలమని చెప్పవచ్చును. దక్షిణకాశి యన బరఁగు పాదగయాక్షేత్రమి చట నున్నది. అతి ప్రాచీనమైన కుక్కుటేశ్వరాలయమున్నది.

అనేకశతాబ్దములనుండి రావుమణికులదీపకులగు వెలమవారిపాల సమున వర్ధిల్లినది. వీరు శౌర్యధనులు, విద్యావేత్తలు, దానకర్ణులు, సమస్తమతములవారినిఁ జేరఁదీసిపోషించుచుండిరి. కవులనుగాయకులను రప్పించి వారి నాదరించుచుండిరి. ఇప్పటి మహారాజు గారి తండ్రి శ్రీ శ్రీ రావు వేంకట మహీపతి గంగాధర రామారావు జమీందారుగా రెనుబది యేడులకుఁ బూర్వమే కాకినాడ పట్టణముననున్న మధ్యపాఠశాల, దివ్యజ్ఞాన సమాజము, కాస్మపాలిటను క్లబ్బు, సూర్యారావుపేట, రామారావుపేట లనుస్థలములనుఁ బ్రజాసంస్థలకు ప్రజలకు దానము జేసిరి.

వారి తనయులు మహారాజా డాక్టరు శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమారమహీపతిసూర్యరావుబహాదూరు, డి.లిట్. వారు. వీరు సాధుపుంగవులు. ప్రజ్ఞానిధులు. విద్యాసాగరులు. దయాదాక్షిణ్యములు మూర్తీభవించిన మాననీయులు. వీరి పేరు తెనుఁగునాటను హిందూదేశముననే గాక యావత్ప్రపంచమునను దాతృత్వమునఁ బ్రసిద్ధికెక్కినది. తెనుఁగుదేశమందు వారి పేరు వినని వారు సాధారణముగానుండరు. వీరు సుమారఱువది లక్షలకు పైఁబడిన మొత్తమును దానము చేసిరి. కవులను, బండితులను, గాయకులను, యాచకుల నెంతెంతో యాదరించిరి. అనేకులకువివాహములు జేయించిరి. అన్నవస్త్రగృహదానము లనేకములుఁ జేసిరి. తెనుఁగు దేశము నిదివఱ కనేకమహారాజులేలినారు. వారనేక సత్రములు గట్టించినారు. దానములు గూడఁ జేసినారు. అగ్రహారము లిచ్చినారు. కాని, వారెవ్వరికిని వీరికి వచ్చినకీర్తి మాత్రము రాలేదు.

వారి దాతృత్వమునఁ జాటునది కాకినాడ అనాథశరణాలయము; వారి విద్యాపోషణముఁజూపునది కాకినాడ పీఠికాపురాధీశ కళాశాల, వారి యాధ్యాత్మికశక్తిని వెల్లడించునది కాకినాడ బ్రహ్మోపాసనామందిరము. దీనులను, అనాథలను, బిచ్చగాండ్రను బరి రక్షించునది వారి కాకినాడ యన్నదాన సమాజము. వారి విద్యాపోషణమున కాదర్శము లయిన యాంధ్రసాహిత్యపరిషత్సూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణములు. కాకినాడ పురమధ్యమున నిలుచుండి యొకపరి దిశలఁ బరికించిన శ్రీ మహారాజులుంగారి కీర్తి ప్రతిదిక్కునఁ ద్యోతకమగుచుండును.

వారికిట్టిదాతృత్వమునకు దారిఁజూపి వారినిట్లు ప్రోత్సహించి సంస్థలనిలుపునట్లు చేసి వారి నాధ్యాత్మిక సంపన్నులనుగా, దీనబాంధవులుగా, "రాజర్షి గాఁ" దిద్దినది బ్రహ్మర్షి తపస్సు. బ్రహ్మర్షి హితబోధ. బ్రహ్మర్షి సంతతప్రేమవాహిని. బ్రహ్మర్షి యాధ్యాత్మికశక్తి. ప్రాచీనభారతవర్షమున సూర్యవంశభూపాలురకుఁ బౌరోహిత్యము నెఱపిఁ దమ యసమానప్రభావధీశక్తులనా భూపాలుర దిగ్విజయపురోభివృద్ధులకై ధారవోసిన వశిష్ఠవిశ్వామిత్రులవలె బ్రహ్మర్షి వేంకటరత్నమునాయఁడుగారు పీఠికాపుర పరిపాలకులు, దీనబంధు రాజర్షి శ్రీ సూర్యారాయ భూపాలురకై హికాముష్మికాభ్యుదయము చేకూర్చుటలో నిరంతరకృషి సల్పియుండిరి. అంతియేగాక వారి రాజ్యపాలనావిషయములలో

దక్షులగు శ్రీ మొక్కపాటి సుబ్బరాయఁడు, శ్రీ కోకా వేంకట సుబ్బారావుగారల వంటి తమశిష్యవర్యుల నియమించి, వారికిబాసటగా దమ మేధాశక్తిని వినియోగించుచుండిరి. ఉదార హృదయులైన శ్రీ రాజర్షిగారు లక్షలకొలది ద్రవ్యములను బ్రహ్మోద్యమములకుఁ బవిత్రార్పణ మొనర్చుట శ్రీ బ్రహ్మర్షిగారి పవిత్రబోధ మహిమవలన గలిగిన యావేశమూల మునసే యనుటలో కొంతసత్యములేకపోలేదు. వారు కాకినాడ పట్టణమునను చుట్టుప్రక్కలను ఆంధ్రదేశమంతటను మదరాసు నందు వంగదేశపర్యంతము ఇంగ్లండు, అమెరికా మున్నగు విదేశములలో గూడఁ గావించిన గుప్తదానములకు శ్రీ నాయఁడుగారి యాదర్శమే మూలకారణమని నొక్కి చెప్పవచ్చును.

శ్రీపీఠికాపురాధీశులకును శ్రీనాయఁడుగారికినిగల పరస్పర సంబంధము కేవలమాంతరంగికమైనది. వారిహృదయములొం డొంటితో హత్తుకొనిపోయి వారిరువురకుమధ్య నొకవిధమగు నవినాభావసంబంధమేర్పడినది. శ్రీ మహారాజావారిని శ్రీనాయఁడుగారు తమ యనుంగుబిడ్డగా భావించి ప్రేమించెడివారు. వారిరువురకునుగలప్రేమ యగాధమై యనంతమైనది. శ్రీమహారాజావారు బ్రహ్మర్షి నెల్లపుడు మిక్కిలి గౌరవముతో భక్తితో నాదరించిరి. పరమపూజ్యుఁడయిన యాగురుదేవుని పవిత్ర స్మరణము యావజ్జీవము విడువఁజాలనని మహారాజు లెల్ల పుడు వచింతురు. ప్రాపంచికములు, నాధ్యాత్మికములునగు విషయములలో బ్రహ్మర్షి రాజర్షికి నిక్కమయిన మిత్రరత్న

ముగానుండెను. పాశ్చాత్యదేశములకు—ఐరోపా, అమెరికా ఖండములకుఁ బ్రయాణమై వెడలుసమయమున రాజర్షి బ్రహ్మర్షి విషయమయి తమ విల్లులో నేమియేర్పాటులుఁ జేయఁదగుననిఁ బ్రశ్నించిరి. అప్పుడు బ్రహ్మర్షి రాజర్షి మాటలు పూర్తిగవినకుండగనే "మీాయనంతరము నేనింకను జీవించుట సవియేతలంతురా? మీాకోరికలు, అభిమతములు సరిగానెఱవేఱునంతవఱకును, సందులకుఁ దోడ్పడునిమిత్తమును నేను జీవింపఁదలంచితిని. అవి సఫలములయినంతనే నేనీప్రపంచమునుండి వెడలిపోదు"నని తటాలున బదులువలికిరి. మఱొకసమయమున బ్రహ్మర్షి రాజర్షితోడి ప్రసంగములోఁ దనకుఁ బ్రధానాభిమానాస్పదులు; రాజర్షి రాజావారు, తమకొమరిత బాబాయమ్మ, దివాను కోకా వేంకటసుబ్బారావుగారు, కంభంపాటి రామశాస్త్రి (తారకం) గారు—మాత్రమేయని నలువురపేర్లు వరుసగా వచించియుండిరి.

1938 సం॥రం వేసవిలో శ్రీ రాజర్షి చెన్నపురిలో నుండగా, బ్రహ్మర్షి పిఠాపురమునుండి తా మింక నెంతో కాలము బ్రతుకఁజాలమని సూచించుచు విచారకరమగు నొక లేఖను వ్రాసిరి. అది రాజర్షి మనస్సునుఁ గరఁగించివేసెను. తక్షణమే రాజర్షి పిఠాపురము వచ్చి బ్రహ్మర్షిని సందర్శించిరి. అందుకు వా రెంతయు సంతసించి రాజర్షిని జూచి "నే నిప్పుడు చెప్పఁబోవుసంగతులు మీాకు మిక్కిలి వేదన గలిగించునని యెఱుంగుదును. అయినను ముఖ్యములయిన నా కోరికలు

మూఁడింటిని గూర్చి మీతో ముచ్చటింపక తప్పనందుకు చింతించుచున్నాను.'' అని వచించిరి. అవి యివి.

1. బహుసంవత్సరములక్రిందట బ్రహ్మైక్య మొందిన వారి సహధర్మచారిణి యొక్క ఛాయా పటమును రాజర్షికిఁ జూపుచుఁ దాము చనిపోయినప్పుడు దానిని దమ వక్షస్థలముపై నుంచి, తమ శరీరముతో పాటు దహనముచేయవలసిన దని కోరిరి. (ఈ కోర్కె ననుసరించి బ్రహ్మర్షిగారి బ్రహ్మైక్య సమయమున వారి శిష్యాగ్రణి శ్రీ కోకా వేంకటసుబ్బారావుగారా మెచిత్రపటమును బ్రహ్మర్షి వక్షస్థలమున నుంపగా, బ్రహ్మర్షి శిష్యవరేణ్యుఁడు డాక్టరు రామకృష్ణారావుపండితులు మంచి గంధపుఁ జెక్కఁ గర్పూరముతో జతపఱచి వెలిఁగించి దహన సంస్కారము గావించిరి.)

2. వారు చనిపోయినపుడు రాజర్షి యచ్చటనున్నచో నొక మంచిగంధపుఁజెక్కను వారి బాష్పములతోఁ దడిపివారిచితిపై జేర్పుమనిరి. కాకినాడలో రాజర్షి గృహమున బ్రహ్మర్షి బ్రహ్మైక్య మొందిన సమయమున వారు సుదూరమున కూనూరులో నుం డుటచే వారి యీ కోరిక నెఱవేఱలేదు.)

3. వారి యస్థికలు కాకినాడ బ్రహ్మమందిరావరణము లో సమాధి చేయింపవలెనని కోరిరి. (వారి కోరిక ననుసరించి, (6-12-1942 తేదీని బ్రహ్మర్షి యస్థికలశిరోధారణగావించి, ప్రార్థ నముజేసి కన్నీటికాలువలతో నభిషేకించి రాజర్షి బ్రహ్మో

పాసనామందిరములో నిక్షిప్తము గావించిరి.) ప్రేమస్వరూపుఁడయిన యీ గురుదేవునకు రాజర్షియెడఁగల కరుణ యింతింత యని చెప్పనలవి కానిది.

బ్రహ్మర్షి రాజర్షుల సంబంధము గురు శిష్య ధర్మావలంబనమునే గాక యావదాంధ్ర ప్రజా సేవాగగనమున సూర్య చంద్ర ప్రభానిభమై వెలుఁగొందినది. బ్రహ్మర్షి రత్నము రాజర్షి స్వర్ణాభరణమందుఁ బొదుగఁబడి యాంధ్రమాతృకంఠమున నవభూషణమైనది. బ్రహ్మర్షి పవిత్రార్థము రాజర్షి శబ్దము నందు శక్తి పూరితమైన స్థానము నొంది యాంధ్రభాషాకన్యకు విజ్ఞానవికాస దాయకమయ్యెను. బ్రహ్మర్షి యప్రమేయ తాళశక్తి రాజర్షి మనోహర రాగమునకు నందముగ మేళవించి యాంధ్రాంగనాగీతముల కసాధారణ మాధుర్యమునాపాదించెను. ఈప్రకారము వారన్యోన్యమునద వకాశముల గల్పించుకొని సమస్తపండిత దీనమానవ పోషణో త్సాహములలో నసమానమైన యాధ్యాత్మిక చింతఁబడసి కీర్తి మంతులై విలసిల్లిరి.

## 17. ప్రజాహిత సంస్థలు.

శ్రీ నాయఁడుగారితో సంబంధించిన సంస్థలలోఁ బ్రథమమునఁ బేర్కొనఁదగినది మదరాసు బ్రాహ్మసమాజము. ఆమరణాంతము వారు దానికి గౌరవనీయాధ్యక్షులుగా నుండిరి.

మొదటినుండియు వారు దాని కండయై నిలిచి దాని యభి వృద్ధికిఁ గారకులైరి. అప్పటికి శైశవావస్థలో నున్న వారి యాధ్యాత్మికబుద్ధిని నుగ్గుఁబాలతోఁ బెంచినదీ సంస్థయే. మదరాసు బ్రాహ్మసమాజమందిరమును వారు పెంచికట్టించిరి. మదరాసు అన్నదానసమాజసభ్యులై బీదసాదల నాదరించెడివారు.

తమ నాయకమణి, కీర్తిశేషులగు రావుబహదూరు కందుకూరి వీరేశలింగముపంతులుగారిచే స్థాపింపఁబడిన సంస్థలలో ముఖ్యమయిన రాజమహేంద్రవర హితకారిణీసమాజమునకు వారు యావజ్జీవ మధ్యక్షులై యుండిరి. ఆ సంస్థ యాజమాన్యముక్రింద వితంతుశరణాలయము, ఉన్నతపాఠశాల, ప్రార్థనా మందిరము, గ్రంథాలయము, ఆనందోద్యానవనము మున్నగున వెన్నియో గలవు. శ్రీ పంతులుగారి యెడల శ్రీ నాయఁడుగారి కపారమైన భక్తియుండుటచే నీ సంస్థలన్నిటిని వారెన్నియో విధములఁ బోషించుచు వచ్చిరి. శ్రీ వీరేశలింగాస్తికోన్నత పాఠశాల యొకటియే యాంధ్రదేశమునఁగల యాస్తిక పాఠశాల. స్వయం పోషకముగా నుండక యార్థికములగు చిక్కులకు మిక్కిలి లోనై యుండెడిది. శ్రీ నాయఁడుగారు శ్రీ పీఠికాపురాధీశులఁ బ్రోత్సాహపఱచి సుమారు లక్షరూపాయల ధనమును సంపాదించి యా పాఠశాలయొక్క యార్థికసౌష్ఠవమునకు బాటుపడిరి. ఈ సందర్భమున నాంధ్రుల కొక మనవి చేయఁదగియున్నది. శ్రీ పంతులుగారి యమృతాత్మకాంధ్ర మహాజనులు పద్యమాలారూపమున గాక మనఃపూర్వకముగా

భక్తివిశ్వాసములతో భూరివిరాళముల నొసంగి విద్యాశాలల
లో నుత్తమశ్రేణికిఁ జెందిన యీ యాస్తికపాఠశాలనుఁ గళా
శాలగా నుద్ధరింపఁగలిగినచో నది శ్రీ పంతులుగారికి వారొన
ర్చిన యర్ఘ్యసత్కారము కాఁగలదు. శ్రీ నాయఁడుగారు తమ
సహజ ఔదార్యముతో వితంతు శరణాలయమందలి యనాథల
కుఁ బెక్కువిధముల సాయపడుచుండెడివారు. గ్రీష్మాతపమున
బీటలువారిన సుక్షేత్రమునకుఁ దొలికారుమబ్బువలె వారి
దర్శనమాత్రముచేతనే నా యనదల సంతాపాగ్ని శాంతించె
డిది. శుద్ధచారిత్రులగు శ్రీ నాయఁడుగారు వితంతువివాహము
లనామోదించిరి. బాలవితంతువుల పునర్వివాహవిషయమున
వారికి సంకోచమేలేదు. కాని కొంతకాలము కాఁపురముచేసిన
తరువాత విధవలయినవారి విషయములో మాత్రము శ్రీ నా
యఁడుగారు సాధ్యమైనంతవఱకు స్త్రీలు, పురుషులుగూడ
గతించిన తమభర్తలయొక్కయు, భార్యలయొక్కయు నాత్మల
కానందముగలుగుపొంటెఁ దిరిగి వివాహముజేసికొనక బ్రహ్మ
చర్యవ్రతమునుఁ బవిత్రముగ నిర్వహించుటయే యుత్తమమని
జెప్పుచుండిరి. అట్లుచేయఁజాలనివారియెడమాత్రమితరవిధముగ
నీచవర్తనులై చరించుటకన్నఁ దిరిగి వివాహముచేసికొనుటయే
శ్రేయస్కరమని బోధించుచుండిరి. దంపతుల వివాహము
యొక్క పవిత్రతవిషయమున వారికిఁగల యుదారాశయమే
వారిట్టిబోధలొనర్చుటకుఁగల ముఖ్యకారణము.

దిక్కుమాలినవితంతువులనుజూచి శ్రీనాయఁడుగారి మన
స్సెంత కరఁగెడిదో యనాథబాలబాలికలను జూచినపుడుగూడ

వారంతగనే సంతాపముఁ జెందెడివారు. కాకినాడయందలి య నాథశరణాలయస్థాపనకు శ్రీ నాయఁడుగారే కారకులు. శ్రీపీఠికా పురమహారాజులయొద్ద కౌదార్యముల నీసంస్థ దీనులకు ననాథ శిశువులకు గృహవాతావరణము గల్పించి వారి దిక్కుమాలిన స్థితిని నివారింపఁగల్గినది. పిఠాపురబ్రాహ్మసమాజాధ్యక్షులుగా నుండి శ్రీ నాయఁడుగారు సమాజయాజమాన్యమున నుండెడి యాదియాంధ్రుల యాశ్రమ నిర్వహణమునందుఁ దమసలహా లనిచ్చుచుండిరి. మున్నిడివరకు బ్రాహ్మసమాజనిర్మాణము నకై భూరివిరాళముల నిచ్చుటయేగాక దాని ధర్మకర్తలై వెలసిరి.

యువజనాస్తిక సోదరమండలిని స్థాపించి యువకులలో స్వార్థత్యాగబుద్ధిని బెంపొందించిరి. యువజనప్రార్థనా సమాజ ము నేర్పఱచి యాధ్యాత్మికచింతనమును యువకులకుఁ గలిగిం చిరి. దానికి ముఖ్యాంగముగా సంఘపారిశుద్ధ్య సమాజమును నెలకొల్పి సంఘదోషములఁ బాపుటకు యత్నించిరి. నిరక్షు రాస్యతను నిర్మూలించుటకుఁ గాకినాడ బ్రాహ్మ సమాజ యాజమాన్యమున రాత్రిపాఠశాల, సంతపేటలోని యాస్తిక పాఠశాల పుస్తకభాండాగారము, ఉచితపాఠశాలమున్నగు వివిధసంస్థల నెలకొల్పి శిష్యులచే నడిపించెడివారు, బ్రాహ్మ ధర్మప్రచారకుల శిక్షణకై సాధనాశ్రమమును స్థాపించి ప్రతి దినము సాధకులకు శిక్షణ నొసఁగెడివారు. నక్కా వేంకటరెడ్డి మున్నగు నుపాధ్యాయులకు సాధనాశ్రమములో శిక్షణ మొసంగి

పల్లెటూళ్ళలో బ్రహ్మధర్మప్రచారమును విరివిగా సాగించుటకు దోడ్పడిరి. విశాలమైన బ్రహ్మమందిరము నిర్మించుటయు, నాంధ్రబ్రహ్మసమాజమునకు శ్రీమహారాజావారు లక్షరూపాయలు "ఆంధ్రబ్రహ్మధర్మప్రచారకనిధి" యనుపేర విరాళమిచ్చుటయు శ్రీ నాయఁడుగారి ప్రోత్సాహమే యని చెప్పవచ్చును.

---

## 19. శ్రీ నాయఁడుగారి యాత్మీయ సంస్థలు.

మాతృమందిరము (Nursery); సుమవాటి (Rosary); ప్రార్థనావేది (Sanctuary).

శ్రీ నాయఁడుగారు కాకినాడకు రాకపూర్వ మాంధ్ర బ్రాహ్మచరిత్రలో కాకినాడకుఁ బ్రముఖస్థానము లేదు. పండిత శివనాథశాస్త్రిగారు బ్రాహ్మసమాజ చరిత్రలో నాంధ్రదేశములోని యుద్యమమును గూర్చి వ్రాసినపుడీ శతాబ్ద్యారంభమున రాజమహేంద్రవరము బ్రాహ్మకర్మక్షేత్రముగను, బాపట్ల బ్రహ్మ భక్తమండలముగను, బందరు బ్రాహ్మవిజ్ఞానాశ్రమాలయముగను వర్ణించియున్నారు. అప్పుడు బందరులో శ్రీ నాయఁడుగారు, బాపట్లలో శ్రీ బాపయ్యగారివంటి యువకులు, రాజమహేంద్రవరములో శ్రీ పంతులుగారు నుండిరి.

1905 లో శ్రీ నాయఁడుగారు కాకినాడకు వేంచేసిన యనంతరము క్రమక్రమముగా కాకినాడ పిఠాపురరాజమహేంద్ర

వరముల నడుమనున్న గోదావరీమండలములో నీ మూడు శక్తులు సమ్మేళనమొంద బ్రాహ్మోంధ్రమునకు కాకినాడ కేంద్రస్థానమైనది. బ్రాహ్మోద్యమము వంగదేశము తరువాతఁ దెలుగునాటిలో జలవద్రూపము తాల్చినచో, కలకత్తాకుఁ దరువాతఁ గాకినాడయే బ్రాహ్మరాజధానిగా నుండదగినదను నభిప్రాయమేర్పడెను.

నలుబదియైదేండ్లక్రిందట శ్రీ నాయఁడుగారి పట్టణమున తమ పాదముంచినప్పుడే వారి మనస్సులో వివిధపథము లేర్పఱచుకొని యవి కార్యరూపమున గమ్యస్థానముల నొందుటకయి యొక స్థిరప్రణాళిక నాపాదించినట్లుగా నేఁడు వెనుకకుఁ దిరిగి చూచువారి కవగతమగును. ఉదార విజ్ఞానాశయకిరణములను బ్రసరించుటకుఁ గళాశాల, అట్టి విజ్ఞానాశయములను బవిత్రముగా నిర్వహించుటకు సాధనముగా బ్రహ్మాలయము, భక్తిజ్ఞానములు బాసటలుగాఁ గార్యరంగమున నడచువారికి వసతిగృహములు, శరణాలయములు వారి యాశయానుసారముగ నేర్పడినవి. ఈ మహాసంస్థల ప్రాభవ మొకదానినుండి మఱొకదానిలోనికిఁ దొణికి ప్రవహించుచున్నట్లుండెను. కళాశాలనుండి యువకులు బ్రహ్మాలయములోని సాంఘికారాధన సమయమున నిండి కూర్చున్నప్పుడు ఎదుట రామమోహనుని సమగ్రాశయము మనోహరమూర్తి నొంది నట్లుత్తోఁచు బ్రహ్మమందిరము సహస్ర జాగ్రన్నేత్రములతో విద్యాలయమును గనిపెట్టుచున్నట్లుండెను. వీనిలో శరణాలయము చిన్న బిడ్డలను

బెంచు మాతృమందిరము; కళాశాల చిన్నబిడ్డల మనోమందా రములు వికసించు సుమవాటి; బ్రహ్మోపాసనామందిరము సామాజికులందఱు పవిత్రహృదయముతోఁ దమసర్వస్వము సర్వేశ్వరుని కంకితమొనర్చెడి ప్రార్థనావేది. పైని జెప్పిన మహాశక్తులే యటు పిఠాపురమునకు గూడఁ బ్రవహించి సహజ కరుణాన్వితమగు మహారాజుగారి హృదయమును మానవ సేవాంకితముగా భగవదర్పితముగా నొనర్చి యాదిమాంధ్ర వసతిగృహములను, ఉచితవిద్యాలయములను వెలయింపజేసినవి. శ్రీ వీరేశలింగాస్తమయానంతర మవి రాజమహేంద్రవరమునఁ గూడఁ గొంతశక్తి మంతముగఁ బనిచేసినవి.

శరణాలయము: మాతృ మందిరము: Nursery

ఒక సందర్భమున శ్రీనాయఁడు గారు శ్రీపీఠికాపుర మహారాజులతో స్నేహపూర్వకముగ సంభాషించుచుఁ దోడి మానవులయెడ మానవుని సానుభూతి యౌషధశాలలు, వైద్యాలయములు, సంరక్షణశాలలు, అనాథశరణాలయములు మున్నగు వివిధ రూపముల నెట్లు వ్యక్తముచేయవచ్చునో తెల్పుచుండ సహజదయార్ద్ర హృదయులు శ్రీమహారాజులు "అయ్యా! అనాథశరణాలయమా! నేను దానిని నిర్మించుట కెంతయైన ధనసహాయ మొనరింతును. అనాథబాలుఁడుగ నుండుట యెట్టిదో నేననుభవ పూర్వకముగా నెఱుఁగుదును" అని పలికిరి. అదియే కాకినాడ పట్టణములో ననాథశరణాల యము నిర్మించుట కీశ్వర నిర్ణీతమగు సుముహూర్తముగానెంచి

శ్రీనాయఁడు గారు "అదియే తమ యభిమతమైనచో మీలోక శరణాలయము మీ యిచ్చవచ్చిన విధమున స్థాపింపవచ్చును" అని వచించిరి.

మహాదాతయగు శ్రీ పీఠికాపురాధీశులు సుమారు లక్ష రూప్యముల వెచ్చించి కీర్తిశేషులగు తమతండ్రి శ్రీరాజా రావు వేంకట మహీపతి గంగాధరరామారావుగారి పేరను ఆంధ్ర దేశములోఁ గరుణకుఁ, బ్రేమకు నేకైకచిహ్నము, అనాథశరణాలయమని ప్రజల వలనను; "ప్రేమమందిర"మని శ్రీనాయఁడుగారి చేతను బిలువఁబడు దివ్యభవనమును గట్టించి, ది 13-11-1909 తేదీని అప్పటి మదరాసు గవర్నరు సర్ ఆర్థరులాలీ దొర గారిచే ప్రతిష్ఠింపఁ జేసిరి. శ్రీనాయఁడుగారి జీవితములో వారి హృదయాకాశమున నేది తొలుదొలుత, నాషాఢ మేఘము వలె నెచ్చట సంకురించెనో గాని యది క్రమముగా వారి కరుణామృతము వర్షించి కాకినాడ పురవరమున భాద్రపద మేఘమై కుంభవృష్టిఁ గురిసినది. దీనికి బాసటగా పిఠాపురమున నున్న యువమహారాజు వారియాశయము కరుణార్ద్రమై భక్తిపూరితమై, మలయసమీరమువలె వీఁచినది. బ్రహ్మర్షి మాతృప్రేమ, మహారాజు కరుణ గలిసి పరమజనయిత్రి భూతధాత్రి వక్షమున విశ్రమింపని బిడ్డ యుండనేరదు. కాన నీలోకములో ననాథ యనునదియే యుండుటకు వీలులేదని ప్రకటించినవి. నాఁటికిని నేఁటికి దయార్ద్రహృదయు లగు శ్రీ నాయఁడుగారి శిష్యులు పలువురు జగజ్జననీ సందర్శనము

నైకె శరణాలయము వైపునకుఁ బోయి యా యమరగేహ ప్రాంగణమున నిలిచి వచ్చుచుందురు. జీవితము నిస్సారమై మరు భూమివలె శుష్కించి నపుడు, మాధుర్యవిహీనమై శిశిర వనమువలె మ్రోడైపోయినపుడు, ధూళిధూసరితమై దుఃఖ సంకులమై దుర్దినాకాశమువలెఁ దోఁచినప్పుడు, కరుణావర్షము నైకె మధువాహినియైకె, శారదకౌముదియైకె యా కన్నతల్లి గృహమునకు యాత్రికులుగాఁ బోవుచుందురు. ఈశరణాలయము నిస్పృహుల నాశావాదులుగను; అవిశ్వాసపరులఁ బ్రసన్నులుగను, అంధుల దృష్టిమంతులుగ నొనర్పఁగలదు. నగర బహిస్సీమల మనోహరోద్యానవనములో లక్షోపలక్షలు వర్షించి రాజసౌధమును నిర్మింపఁజేసి, బ్రహ్మర్షి యాధ్యాత్మిక ప్రతిభ యాలంబముగా నెచ్చటెచ్చట నుండియో యెగిరివచ్చిన చిన్న బిడ్డలను గన్న బిడ్డలకన్న గారాబముగా మహారాజు సాకుకొనుచున్నారు. పెద్దనాయన, మహారాజనాయన, మహారాణీయమ్మ,నాయన,అన్నలు, తమ్ములు, అక్కలుచెల్లెండ్రు— ఆవృద్ధర్షి తపోవిభూతి, మహారాజు సంసారవైభవము, నాంధ్రుల జీవితములను బులకరింపఁజేయుచున్నవి. ఇఁక నా బిడ్డలు పెరిగి విద్యాబుద్ధుల నొందిన పిమ్మట వారికిఁ బ్రాపుగా నిలిచి వారిని జీవితపథమున వదలుట, క్రమక్రమముగా వికసించు సంసారములతో వారు దేశమున మూలమూలల నల్లుకొనుట, తొలుదొలుతనే బ్రాహ్మ ధర్మజ్యోతిని వారిలో రగులుకొల్పుటం జేసి యీ పరిశుద్ధాస్తికసంతతియు విశాలమై దినదినాభ్యు

దయ మొందుట—ఇవియన్నియు జూఁడ నీవిధానమవలంబించు టలో ఆ బ్రహ్మర్షి దూరదృష్టి, తపస్సు, కరుణ, ప్రేమ యెట్టిట్టివో స్ఫురింపఁగలవు. ఈశరణాలయమునకు మదరాసునుండి యుత్తమ సంస్కారులును, సేవారతులును, తపోధనులును, విద్యావేత్తలును ప్రేమసాగరులును నగు శ్రీ వి. పెదంబరాజు బి. ఏ. గారిని బ్రహ్మర్షిగారధిపతిగా నెన్నుకొనిరి. ఈయాలయమును శ్రీనాయఁడు గారెల్లప్పుడు "గృహము" (Home) అనియే పిలుచుచుండిరి. మఱియు దీనిని గూర్చి "భూమిపై స్వర్గమున్నచో నది యిదియే, యిదియే, యిదియే" యని వారొక సందర్భమున వాక్రుచ్చిరి.

శ్రీ పీఠికాపురాధీశకళాశాల: సుమవాటి: Rosary

ఆంధ్ర దేశమందలి యుదారోదాత్త విజ్ఞాన వికాసములకు శ్రీ సీఠికాపురాధీశుని విజ్ఞాన సంస్కృతియే ప్రధానకారణమని చెప్పఁదగును. ఈ విద్యాపోషకుని వితరణశీలము, భాషాభిమానము శ్రీభోజరాజ, రాజరాజనరేంద్ర కృష్ణదేవరాయ ప్రభువరేణ్యుల మార్గముల ననుసరించి వానిని స్మరణకుఁ దెచ్చుచుండును. బ్రహ్మర్షి వర్యుల యుపదేశబలమే శ్రీమహారాజావారి సహజదానశీలాదులకు దోహద మొనర్చినది. వారి యీావి కాకినాడ కళాశాలకుఁ బర్వతోపమసహాయక మైనది. పీఠికాపురాధీశకళాశాల చరిత్ర నిట పేర్కొనుటెంతయు సముచితమగుట దానిని సంగ్రహముగ నిట నుదాహరించుచున్నాను.

కాకినాడలో ఆదిమాంధ్రులకు స్త్రీలకు దప్ప తక్కిన అన్ని తరగతులవిద్యార్థులకును నాంధ్రాంగ్ల భాషలు గఱపు కొఱకు క్రీ. శ. 1852 వ సం॥లో మార్చి నాల్గవ తేదీని నాటి జిల్లా కలెక్టరు 'ప్రెండర్ గాస్టు' యొక్కయు, వారి శిరస్తాదారు 'తులసింగ చెట్టియారు గారి' యొక్కయు కృషిఫలితముగ నీ పాఠశాల ప్రారంభింపబడినది. శ్రీ పీఠికాపురరాజావారగు శ్రీ రాజా రావు వేంకట మహీపతి గంగాధర రామారావు బహద్దరు వారీ పాఠశాలయందలి తొట్టతొలి విద్యార్థులలో నొకరగుట ఈ పాఠశాలయొక్క భాగ్యవిశేషము. తరువాత పదిసంవత్సరములలో గొంత క్షీణ దశనొందుచుండగా క్రీ. శ. 1862 లో నప్పటి జిల్లాకలెక్టరు "ఆర్థరు పర్విసు" ను, వారి డిప్యూటికలెక్టరు కాదంబరి జగన్నాథము పంతులుగారును నూతనోత్తేజ మొసగి యీ సంస్థను బునరుద్ధరించిరి. క్రీ. శ. 1863 లో అక్టోబరు 28 వ తేదీని ఆ నాటి కలెక్టరు "హెన్రీమారిసు" ప్రారంభోత్సవము నెఱపిరి. జగన్నాథము పంతులుగారు మేనేజరుగా నుండిరి. అప్పటి నుండి పాఠశాల దినదినాభివృద్ధినొందినది. ప్రభుత్వమువారు నెలకు డెబ్బదిరూపాయల "గ్రాంటు" నీయనారంభించిరి. దీనికి సహాయ్యముగ శ్రీ రాజా రావు వేంకట మహీపతి గంగాధర రామారావు బహద్దరువారు నెలకొక నూరురూపాయలొసంగి యీ సంస్థ కార్థిక సౌష్టవ మొనగూర్చిరి. ఆదినములలో నీపాఠశాలయందు "మిడిల్‌స్కూలుకోర్సు" మాత్రము బోధింపబడుచుండెను.

క్రీ. శ. 1866 లో నీ పాఠశాలాచరిత్రలో నొకనూతనాధ్యాయమారంభించెను. ప్రజోపయోగకరముగ, సుస్థిరముగనుండు నేర్పాటులొనర్పబడెను. ఉదారహృదయముతో శ్రీ పీఠికాపురాధీశ్వరులు ఇరువది ఎనిమిదివేల రూపాయల భూరి విరాళమిచ్చిరి. ఇదిగాక పాఠశాలాభవననిర్మాణమునకు విశాలమగు నివేశనస్థలమిచ్చి, భవననిర్మాణమునకు ఇరువదియేడువందలును, మఱియొక వేయి రూపాయలు కుర్చీలు, బల్లలు మున్నగు పరికరములనిమిత్త మొసంగిరి. శ్రీ కాదంబరి జగన్నాథముపంతులుగారు విశేషశ్రమపడి, తమ పలుకుబడి వినియోగించి, యాసంవత్సరమే "హిందూ హైస్కూలు" అను పేరుతో నీపాఠశాలనుండి మదరాసు యూనివర్సిటీ "మెట్రిక్యులేషను" పరీక్షకు విద్యార్థుల నంపిరి. అది మొదలు చదువుకొను విద్యార్థుల తరగతి గదులు చాలక క్రొత్త భవనముల నిర్మాణ మారంభమాయెను. కాకినాడ పురమున విద్యావిషయమున నత్యంతాదరము జూపుచున్న నాటి అసిస్టెంటు కలెక్టరు "లింటను" గారిపేర "లింటన్ మెమోరియల్ హాలు" కట్టుటకు ధనముఁ బ్రోవుచేసిరి. అదియే నేటి "కెమిస్ట్రీలేబరేటరీబ్లాకు" గానున్నది. 1883 లో పాఠశాలాపూర్వ విద్యార్థి శ్రీ పైండా రామకృష్ణయ్యగారు పాఠశాలయందభిమానముంచి ప్రభుత్వమువారిచ్చిన "బిల్డింగుగ్రాంటు" ఆరువేలకు దోడు తామొక యారువేలొసంగిరి. 1883 లో ఆ నాటి మదరాసు గవర్నరు "గ్రాంట్‌డఫ్" ఈభవన భాగమునకు ప్రారంభోత్సవ మొన

చ్చిరి. అదియే నేటి "ఫిజిక్సు లేబరేటరీబ్లాకు"గా పరిగణింప బడుచున్నది.

1884 లో నీపాఠశాల "సెకండు గ్రేడుకాలేజీ" గా నభివృద్ధియై "పీఠికాపుర రాజావారి కాలేజీ" యని పిలువబడు చుండెను. 1884 సంllనుండి నాలుగేండ్లు కళాశాలాతరగతులతో ఎట్లట్లో గడచినవి. కాని ధనాభావముచే రెండు సంవత్సరముల పాటు కళాశాలా తరగతులు ఎత్తివేయవలసి వచ్చెను. 1890 సంll నుండి తిరిగి అదృష్టదినములు ప్రారంభమై నాటి నుండి నేటివరకు కళాశాల దినదినప్రవర్ధమానముగా భాసిల్లు చున్నది. ఆదినములలో కళాశాలాయాజమాన్యమున 21 మంది సభ్యులుగల ఒకకార్యనిర్వాహక వర్గమువారిచే నిర్వహింప బడుచు 1892 సంll ఆగష్టు 28 తేదీని హిందూదేశపు కంపెనీల చట్టముక్రింద "పీఠికాపురాధీశకళాశాలాలిమిటెడ్" అను పేర రిజష్టరుచేయబడెను. కాని యీసంఘము బహుళ సంఖ్యాకమగుటచేత తనవిధులను చురుకుగాను, సమర్థముగాను నిర్వహింపలేకపోవుటచే దానియధికారములన్నియు ఏడుగురు సభ్యులుగల ఒకచిన్న సంఘమునకు దత్తముచేయబడినవి. ఈచిన్న సంఘమునందు అధికారపు హోదాలో జిల్లాకలెక్టరు, విద్యామండలశాఖాధికారి, కళాశాలాధ్యక్షులు సభ్యులుగా నుండిరి.

కళాశాలా చరిత్రలో 3 వ ఆగస్టు 1909 వ సంll న నూతనాధ్యాయ మారంభ మాయెను. ఆ తేదీని కళాశాలాయాజమాన్యము ప్రస్తుతపీఠికాపురాధీశులగు శ్రీ శ్రీ శ్రీ

రాజా రావు వేంకట కుమారమహీపతి సూర్యారావు బహ దూరు వారికి అప్పగింత చేయబడుటయు, కళాశాలకు ఆర్థిక దైన్యముతొలగి సౌష్టవము చేకూరినది. నాటినుండియు శ్రీపీఠి కాపురాధీశుల ధర్మకర్తృత్వ యాజమాన్యములక్రింద నేటి యున్నతస్థితికి రాగలిగినది. ఇదివరలో పేర్కొనబడిన సప్త సభ్య సలహాసంఘమే, కళాశాలాధ్యక్షులు యేతత్సంఘ కార్య దర్శికాగా, శ్రీ శ్రీ మహారాజావారికి కళాశాలానిర్వహణ విష యమునందు సలహాల నిచ్చుచుండెను.

1926 వ సంవత్సరము ఈకళాశాలా చరిత్రలో సువర్ణా క్షరములతో లిఖింపదగిన సంవత్సరము. శ్రీ నాయఁడుగారు మదరాసు విశ్వవిద్యాలయోపాధ్యక్షులుగా నున్నప్పుడు 1926 సం॥ర ప్రారంభములో వారిప్రాంతమునకు వచ్చిన సందర్భ మున కాకినాడలో నొకబహిరంగసభ గావింపబడెను. వారి నా సభకు రావించి వారు విశ్వవిద్యాలయోపాధ్యక్షులైనందుకు సంతసమును వెలిబుచ్చుచు, వారు పిన్సిపాలుగాపనిచేసిన పిఠా పురంరాజావారి కాలేజీని ప్రథమతరగతి కాలేజీగా జేయవలెనని కోరుచువినతిపత్త్రిమును సమర్పించిరి. దానిపైనను, కాకినాడపౌ రుల మహజరులపైనను శ్రీనాయఁడుగారు మదరాసు వెడలిన పిదప ప్రథమతరగతి కళాశాలగా జేయుటకు సమ్మతి నంపిరి. ఆయేటనే ఇది ప్రథమతరగతి కలాశాలగా వృద్ధి నొంది గణిత శాస్త్ర ఆర్థికశాస్త్రములతో బి. ఏ తరగతులు జూలై నెలలో నారంభింపబడినవి. నాటినుండి శ్రీమహారాజావారు ఈకళా

శాలకు సర్వాధికారులై యాజమాన్యము వహించియున్నారు. వారికి సలహాల నిచ్చుటకు ముగ్గురుసభ్యులుగల ఒకసలహాసంఘ మేర్పడినది. ముగ్గురుసభ్యులుగల సలహాసంఘమునందు శ్రీమహా రాజావారి దివానుగా రొకసభ్యులు. యావజ్జీవము విఖ్యాత విద్యావేత్తలగు శ్రీనాయఁడుగా రొకసభ్యులు. కళాశాలాధ్యక్షులు అధికారపు హోదాలో నొకసభ్యులు. వారే కార్యదర్శిగా వ్యవహరించుచుండిరి. శ్రీ నాయఁడుగారు మరణించిన తరువాత ఆ సలహాసంఘమునందు శ్రీ నాయఁడుగారి స్థానమున శ్రీపురాణం భద్రయ్యనాయఁడుగారు కొంతకాలము సభ్యులుగా నుండిరి.

19-1-1939 తేదీని కళాశాలలోని బి. ఏ తరగతులతో గూడ 'కళాశాఖ'లన్నియు 'కలెక్టరుబంగాళా'యని పిలువబడు ముప్పదియైదు ఎకరముల విస్తీర్ణముగల మామిడి తోట నడుమనున్న బ్రహ్మాండమగు భవనమునకు శ్రీ నాయఁడుగారి ప్రేరణమున మార్పబడినవి. ఈభవనప్రారంభోత్సవము అప్పటి ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షులగు డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారిచే జరుపబడినది. ఈసందర్భమున శ్రీ నాయఁడుగారి కత్యంతప్రేమపాత్రుడును, అనాధశరణాలయమున పెరిగిన పూర్వవిద్యార్థియు ప్రస్తుతము కళాశాలోన్నత పాఠశాలలో నేతవిద్యాబోధకులును నగు శ్రీకోటిపల్లి సూర్యనారాయణగారిచే గౌరవపురస్సరముగ బహూకరింపబడిన శ్రీ నాయఁడుగారి

తైలత్రివర్ణచిత్రమును శ్రీరెడ్డిగారా సంవత్సరముననే యావిష్కరించిరి.

1909 సంవత్సరములో శ్రీ మహారాజావారుకళాశాలా నిర్వహణబాధ్యత తమపైవైచికొనినప్పటినుండియు నేటివరకు భవనములకో, సామగ్రికో, మరమ్మత్తులకో మొత్తముమీాద రు. 4,25,000 రొక్కమును, దీనికితోడు మహారాజోచిత వదాన్యతతో కనీసము 5 లక్షలరూపాయల విలువకు తగ్గని ముప్పదిమైదెకరముల విస్తీర్ణముగల మామిడితోట నడుమనున్న కలెక్టరు బంగాళాను కళాశాలకుయిచ్చి దానికార్థికపుష్టి నొసగిరి. శ్రీ నాయఁడుగారి నధ్యక్షత నాదిమాంధ్రులకు, స్త్రీలకు నుచితవిద్యాసౌకర్యములఁ గలుగఁజేసి కళాశాల దినదినాభివృద్ధి నందినది. వారి తరువాత వారి శిష్యవరులగు డాక్టరు వేమూరి రామకృష్ణరావు, పెద్దాడ రామస్వామి మున్నగువారి యాజమాన్యమున కళాశాల దినదినాభివృద్ధి నందుచువచ్చినది. నేటికళాశాలాధ్యక్షులు శ్రీ నాయఁడుగారిశిష్యులు శ్రీ పురాణం భద్రయ్య నాయఁడుగారు.

శ్రీనాయఁడుగారి కాలములో కళాశాలకుఁ జేరువనే కాస్మపాలిటను క్లబ్బుగలదు. కాని శ్రీనాయఁడు గారెన్నఁడు నందుసభ్యులుగఁ జేరుటకిచ్ఛగింపరైరి. ఏలయనఁ గళాశాల యందలి తమయభిరుచి నది పెడత్రోవను బట్టించునని వారి యభిప్రాయము. కాస్మపాలిటను క్లబ్బులోని సభ్యుల దూషణ భూషణ తిరస్కారాదులు దాము విని గరిల్పచుటయో,

విచారించుటయో తటస్థించునని కూడ వారు వెఱచుచుండిరి. శరణాలయస్థాపనానంతరము వారు తమవిరామసమయములందు శరణాలయమునకే పోయి యనాథలు ప్రేమికులునగు నచ్చటి బిడ్డలమధ్యఁ దమ కాలము గడుపుచుండెడివారు. "నాయఁడుగారున్నచోఁ గళాశాలలో నుందురు. లేనిచో శరణాలయములో నుందురంతియే కాని యింటికడనెన్నఁడు నుండ"రని వారి మిత్రు లనుచుండుటగలదు. నిజమున కదియే వారిజీవిత పథము.

బ్రహ్మోపాసనా మందిరము: ప్రార్థనావేది: Sanctuary

"మొదటి నుండియుఁ గాకినాడ యెడ గాఢాభిమానమున్న కారణమునఁ బరమేశ్వరుని యేకత్వము, సత్యము, ప్రేమము, పవిత్రత యాధ్యాత్మిక దృష్టితో నల్లడల వెల్లడించు సందేశములనుఁ బంపుచు నేకేశ్వరోపాసనమున కిరవయిన కేంద్ర మందిరమొకటి యీపట్టణముననే నెలకొనవలెనని నేనుహృదయ పూర్వకముగ నభిలషించుచుందును. మతము నకు ముఖ్యములయిన యీధర్మములను బెంపొందించుటకుఁ గాను, నట్టి సంస్థ నిందు నిర్మించుట కయి మంచిప్రయత్నములు గావింపఁదగును" అని శ్రీ నాయఁడు గారు కోరుచుండిరి. 1927 లో లక్షరూప్యములు వెచ్చించి మహారాజా వారు బ్రహ్మోపాసనా మందిరమును నిర్మించి శ్రీనాయఁడు గారి యభిలాషను సఫలమొనర్చిరి. సత్యవంతులకు శరణమయి, పశ్చాత్తప్తులగు పాపుల కారోగ్యనిలయమయి, భగవత్సాన్ని

ధ్యముఁగల భక్తులకు విశ్రాంతి స్థానమయి యీదివ్య మంది రము సార్థకత వహించుచున్నది. ఆంధ్ర దేశమున ఉదారాస్తిక మతధర్మములను, ఆశయములను వ్యాప్తమొనర్చు నున్నతోద్దేశముతో శ్రీ మహారాజా వారు 1928 లో మఱియొక లక్షరూప్యముల విరాళమొసంగి "ఆంధ్ర బ్రాహ్మధర్మ ప్రచారక నిధి"ని నెలకొలిపిరి. మఱునటి సంవత్సరములో శ్రీనాయఁడు గారు తమయొద్దనున్న గ్రంథజాలమునంతయు మందిరమున కొసంగిరి. వారు వలదని వారించినను వారిశిష్యులు దానికి "శ్రీవేంకటరత్నము ఆస్తికపుస్తక భాండాగారము" అని పేరిడిరి.

బ్రహ్మోపాసనామందిర ప్రతిష్ఠాపనము.

1927 సంవత్సరము జనవరి 25 వ తేది కాకినాడ బ్రాహ్మసమాజచరిత్రలో నొక ప్రధానసంఘటనము జరిగిన పర్వదినము. నూతేండ్లకుఁ బూర్వము లోకోత్తరుఁడగు శ్రీ రాజా రామమోహనరాయ మహాద్రష్ట మనఃఫలకమున స్పష్టాతిస్పష్టముగా మొలిచి భవిష్యన్మానవలోకమున కాదర్శమైన బ్రాహ్మమతమునకు మూలాధారమై, మానవులకందఱి కహరహము నవశ్యభోక్తవ్యమైన సాంఘికమానసికోపాసనము నాచరణావధిలోనికిఁ దీసికొనివచ్చుటకని బ్రహర్షి నాఁడే కాకినాడలో బ్రహ్మోపాసనామందిరము ప్రతిష్ఠించినాఁరు. కుడ్యములున్నను లేనిదై, ద్వారబంధములున్నను లేనిదై, దశదిశామధ్యమునను జాతులను స్వచ్ఛాకాశము క్రిందనున్న

ప్రాణులందఱను, పాశ్చాత్యుఁడు ప్రాచ్యుఁడు; బ్రాహ్మణుఁడు పంచముఁడు; సామ్రాట్టు సామాన్యుడు;పరమర్షి పాపి; ధనికుఁడు పేద; స్త్రీ పురుషుఁడు- అను భేదములు లేక యందఱను, నమోఘమైన శంఖధ్వానమువలె నాహ్వానించు నీమందిర ప్రాభవమును సహస్రవత్సరముల మానవగాథల బఠించి ప్రస్తుతభారతమును బ్రపంచపరిస్థితులను దిలకించిన బుద్ధిశాలులెల్లరును మనఃపూర్వకముగఁ గీర్తింపక పోరు. అంతరాంతరములో నార్యర్షులును ననేకాలయములలో నఖిలకాలముల సకలసీమలఁ దపస్వులును నేకేశ్వరు నారాధించునప్పు డీమందిరముననే యారాధించిరని మనము నిశ్చలముగా నిలిచి చెప్పిడిచో సత్యమునే పలికినవార మగుదుము. అంతియేగాదు. జరిగిపోయిన యుగములలో, వర్తమానమున, రాఁగల కాలమున నెవ్వాఁడైనను, నెచ్చోటనైనను దనభగ్నహృదయము నొరసివచ్చు నొకయావేదనారవము నాయేకైకాశ్రయముకొఱకు మ్రోగించునదీమందిరముననేయని మనము మనసార విశ్వసించి యాప్యాయముగాఁ జెప్పుకొనఁదగును. ఇంతప్రభావమును లోలోపల నిముడ్చుకొనిన యిట్టియుపాసనాలయమును తన కాలమున నేఫత్తేపూరు సిక్రీలోనో సమగ్రముగ నిర్మింపనేరక యక్బరుపాదుషా యెంతయలజడిపడెనోగదా ! ఈశ్వర పితృత్వము, మానవ సౌభ్రాతృత్వము ననుభవింపఁజేయు సాంఘికోపాసనమున కత్యవసరము, పరమప్రయోజనకారియు నగు సంపూర్ణాదర్శమున కేయితరమనోహర నిర్మాణమైనను

నీమందిరమున కెనకాఁగలదా ! 35 సంవత్సరముల క్రిందటఁ బ్రథమ శిలాప్రతిష్ఠాపనమయినపిదప దిద్దితీర్చబడి, పెరిగిపెరిగి యీనాఁటికీ సుందరమూర్తితో వెలసిన యీయుపాసనా మందిరము తమ స్వప్నమునకింకను జాలదూరముగనే యున్న దనియు, ఇచ్చటికొన్నార్పు నచ్చటూమార్పు చేయింపవలెననియు శ్రీనాయఁడుగా రనుచునే యుండెడివారు. సుందర మగు నే కావ్యమైనను దాని రచించినకవి హృదయాంతరాళములోని పారలౌకికానుభవమును బూర్తిగాఁ బ్రదర్శింపక దూరదూర ముగ నింకను గొంతకొంత స్ఫురింపఁజేయుచునేయుండునని కవిశిరోమణి షెల్లీవ్రాసినాఁడు. తనలోని యలౌకికానుభవ మునకు దగ్గఱగావచ్చుటకై కవి వన్నెవన్నెల సజీవశిలాఖండ ములగు శబ్దములతోఁ దన కావ్యభవనమునే విధముగఁజెక్కి మార్చి నిర్మించుకొనునో యా విధముగనే బ్రహ్మర్షిగారి భావన కృషిచేసిచేసి యీమందిరము వారి ధర్మాశయముల నింకనుఁ జక్కఁగా స్ఫురించునట్లు చేయుటకయి బ్రయత్నించు చునే యుండెడిది. శతతంత్రీమహతిపై నాలపింపఁబడు నొక సుందరమధురకావ్యమే యీమందిరము.

1927 వ సంవత్సరము జనవరి 25 వ తేదిని ఈభవన నిర్మాణమునకై తమ సహజధోరణిని దాదాపొకలక్షవఱకుఁ వెచ్చించిన శ్రీపీఠికాపురాధీశుల యాహ్వానమంగీకరించి గ్రామ గ్రామములనుండి సోదరులెందఱెందఱో విచ్చేసిరి. ఆంధ్రబ్రాహ్మో భ్యుదయమునకై యనవరతసేవఁ జేసిన హేమచంద్ర సర్కారు

బాబు కలకత్తానుండి వచ్చిరి. ఉదయమున బ్రాహ్మసోదరు లుత్సాహముతో నగరసంకీర్తనము గావించి మందిర బహిర్ద్వారమును సమీపించిరి. అచ్చట శ్రీ మహారాజావారు మందిరనిర్మాణమునఁ దమయుద్దేశములఁ గూర్చి ముచ్చటించుచు సకల జాతులలోని సకల మతములలోని యెల్లరును దానినుపయోగింప నాహ్వానించిరి. హేమచంద్రులు మందిరద్వారమునుఁ దెఱచిరి. శ్రీనాయఁడుగా రుపాసనముగావించుచు "మతము-ఆరాధన" మనువిషయమును గూర్చి యొనర్చిన ప్రసంగములోని తుదివాక్యము లివి "ఈశ్వర మాతృత్వము నంగీకరింపుము. ఆరాధనయను శిశుభావము నలవఱచుకొనుము. ఈ యుద్దేశముతోనే యీ పవిత్రమందిరము నిర్మింపఁబడినది. పరమేశ్వరార్పితమైనది. ఆజగన్మాతను సమీపించి యాలింగము చేసికొన నాకాంక్షించు వారెల్లరకొఱకు నహోరాత్రములు దీనిప్రాంగణ ద్వారము తెఱచియే యుండును. ఎప్పుడైనను సరే రమ్ము. ఆతల్లికడఁ జేరి యుపాసనామాధుర్యము నాస్వాదింపుము. నాతల్లియే నాకుఁగావలెను. నాసర్వస్వమామెయే. అనునదియే యీ మందిరమున సముచితము నావశ్యకము నగు ప్రార్థనము. రండు. నిరభ్యంతరముగ రండు. అందఱు నీమందిరము నుపయోగించుకొనుఁడు. అందఱకుఁ బదేపదే స్వాగతమిచ్చుచున్నాను. ఈచోటఁ గుటిలమైన దేదియును లేదు. అపాయకరమైన దంతకంటె లేదు. ఒక్కనిబంధనము మాత్రమున్నది. చిన్నకూటములుగా గాని, పెద్దసంఘ

ములుగా గాని యీ యాలయమున కారాధనకై వచ్చిన పుడు మన తల్లిని నర్చించుము. అనఁగా నామె బిడ్డలనందఱను, ఆ త్రితిశిశువును హృదయపూర్వ ప్రేమించుటయే యని జ్ఞాపక ముంచుకొనుఁడు. "ఆదాముబిడ్డ లందఱును ననఁగా మానవు లందఱును, ఒకరిలోనొకరు భాగములై యున్నారనియు; అం దఱు నొకేవస్తువులోనివారుగనుక ననఁగా నొకపరమాత్మ నుండియే వెలువడినారు గాన నొకే జననిసంతానమనియు," పారసీక కవి చెప్పినాఁడు.

నీసోదరుఁడైన మానవునిఁ దప్పితివా, జనకుఁడైన యీశ్వరునే తప్పినవాఁడవగుదువు. డాక్టరు జాన్సనును గూర్చి యొక యితిహాసముగలదు. జీర్ణవసనములతో, నిఱుపేదరా లొకతె తన చంటిబిడ్డను గుండెలకు హత్తుకొని కుంభవర్ష ములోఁ గాళ్ళీడ్చుకొని పోవుచుండెను. వారినిజూడ నాతనికి జాలికలిగినది. తల్లిని బిడ్డను దనబండిలోని కెక్కించుకొనినాఁడు. కాని ముద్దులు, మురిపెములు, జోలలు, జోకొట్టుటలు మా త్రము పనికిగావని కఠినముగా శాసించినాఁడు. ఇంచుకంతలో నామె యా శాసనమును మఱచిపోయినది. కన్నబిడ్డను మా మూలు జోలపాటతో లాలింప మొదలిడెను. మఱలఁగఠిన శాసనము. మఱికొంతసేపటికి మఱల నానేరమే. బండితలుపు దీసి యామెను నామెయసంబద్ధ ప్రలాపముల నాపండితుఁడు బైటకుఁ బాఱఁదోలినాఁడు. అబలయెడ జాలిపడినాఁడు. కన్న తల్లిని సైరింపలేకపోయినాఁడు. కాని మాతృత్వమును నిరసించి

నపుడే మానవత్వమును గూడ బహిష్కరించు కొనినాఁడు. ఆవిధముననే సృష్టికర్త కావలెనందుము. కాని యతఁడు సృష్టించుకొన్న దానిని వదలివేయుదుము. ప్రాణిని తిరస్కరించి నపుడే ప్రాణదాతను బహిష్కరించుచున్నాము. నన్నుఁ బ్రేమింతునందువా నాబిడ్డనుగూడ బ్రేమింపుమని కన్నతల్లి కోరుచున్నది. నన్ను బ్రేమింతువేని నాకన్నబిడ్డలఁ బ్రేమింపుమని జగజ్జనని నిర్ణయించుచున్నది. కేవలము భగవన్నిర్మాణమైన యీసోదరభావ మున్నతోన్నతముగా సంపూర్ణముగా నచ్ఛాత్యచ్ఛముగా శిరసావహించుట యనఁగా మనము కలిసి మెలసి యారాధనమొనర్చుటయే. కావుననే క్రైస్తవునితో యథార్థసోదరభావము తిరస్కరించు షైలాకు "నీతోఁ బ్రార్థనముఁ జేయనని తీవ్రముగఁ బ్రకటించినాఁడు. కలిసి పరమేశ్వరు నారాధించునపు డతనిలో నందఱు సోదరులనిఁ బ్రతుకార నంగీకరించుట యగును. ఎన్నియో యేండ్లు కారాగారవాసియగుటచే నెంతకాలము నుండియో పేరు మఱువఁబడి యేదియో సంఖ్యయే పేరుగాఁ బిలువఁబడు జీన్వాల్జీను పరమభాగవతుఁడైన యాచారస్వామికిఁ దననామధేయ మెఱిఁగించి దాని నెఱుఁగుదురాయని ప్రశ్నింప యాస్వామి యిట్లు మాఱుపలికెను "మానవుడు నీ కిచ్చిన పేరన్న మాటయది. పరమేశ్వర ప్రసాదమైన నీనామధేయము నేనిదివఱకే యెఱుఁగుదును. నీవు నాసోదరుఁడవు." ఎంత గొప్పప్రత్యుత్తరమిది. ప్రకటింపఁబడిన యేనామముతో నైనను మనకుఁ బరిచయ

ములేకున్నను, లోకైకజనయిత్రిని బట్టి ప్రతిస్త్రీయు నాసోదరి, ప్రతిపురుషుఁడు నా సోదరుఁ డని భావింపవలెను. ఇట్టి యారాధనలలో నున్న పరమానందమును, దీనిలో నిమిడి యున్న సౌందర్యమును, ధర్మమును స్వీకరింపుము. రమ్ము! రమ్ము! నీలో నాశిశుభావము పులకరించునపుడెల్ల నీమందిరములో నారాధింపుము. ఆజగన్మాత యమూల్యాశీర్వచన మామె బిడ్డలకందఱకు నాశ్రయమగునుగాక! ప్రియతమము, పూజ్యతమమునగు నాస్వప్నమునకు ననుగ్రహసాఫల్యమొనర్చినదో యనునట్లీనగరమున కీయుపాసనా మందిరమును గటాక్షించిన తల్లికి నాహృదయాంతరాళములోనిండిన కృతజ్ఞతయే యీనాఁటి నానివేదనము.” ఎట్టి యపూర్వ ప్రబోధము !!!

దైవానుగ్రహమే వారినిఁ గాకినాడకుఁగొనివచ్చినదనియు, ఏకైకలక్ష్యముతోఁ గృషిసలుపఁ బ్రేరణమొసంగి తమ కృషిని ఫలింపఁజేసినదనియు దామునోచిననోములు పండినవనియు శ్రీనాయఁడుగారు భావించుచుండెడివారు. ఆనోములపంటలే శ్రీ మహారాజావారును డాక్టరు వేమూరి రామకృష్ణరావు గారునని శ్రీ నాయఁడుగారు పల్కుచుండెడివారు. విద్యావిషయకముగ, సాంఘికముగ, మతవిషయకముగ శ్రీ నాయఁడు గారొనర్చిన ఘనకార్యములన్నిటిలోను వారి ప్రియశిష్యులు భక్తులునయిన పీఠికాపుర సంస్థానము దివానులు శ్రీ మొక్కపాటి సుబ్బారాయఁడు పంతులుగారు, శ్రీ కోకా వేంకట సుబ్బారావునాయఁడుగారు బాసటగానుండిరి. శ్రీ నాయఁడు

గారితో నేకీభావముగల యనాథశరణాలయము, కళాశాల, బ్రహ్మోపాసనామందిరము- మూడునుగూడ వారిదృష్టిలో సమానప్రయోజనములుగలవిగానే సంభావితములయ్యెను. అవి మానవునియాత్మకు వరుసగ—పోషణగృహము—పుష్పోద్యానము—పూజాస్థానము—అని వారు తలంచిరి. తమ యనంతరము తమ కృషిసన్నిహితులగు నిట్టి వారసులచేతులలో విఫలము కానేరదను ధైర్యము శ్రీ నాయఁడుగారికి భగవంతుడు ప్రసాదించుటచేఁ దాము ధన్యులమనివారు తలంచెడివారు.

శ్రీనాయఁడుగారు తమ తపస్సును ధారవోసి శరణాలయమును, బ్రహ్మమందిరమును నిర్మించిరి. ఆమందిరముల నిర్మాణము, వైఖరి, భావసౌందర్యముతో స్వతంత్రభావ విలసితమై వినూత్నకళా ప్రవేశము నాంధ్రభూమియందుద్భవింపఁజేసినవి. ఆదివ్యసంస్థలు శ్రీనాయఁడుగారి భావముయొక్కయాదర్శమును, ఆత్మస్వరూపమును వెల్లడిచేయుచున్నవి. సనాతనసంప్రదాయములతో నధునాతనపద్ధతుల ననుసరించి కళాప్రతిభతో, భావగభీరతతో, నాధ్యాత్మిక పరివర్తనకలిగించునట్లు నిర్మింపఁబడిన యీదివ్యభవనములు చూపఱకు గళాభిరుచిని, సమగ్రవికాసమును, బ్రకటించి వారిని బవిత్రపరమేశ్వరధ్యానమునకుఁ బురిగొల్పును.

---

## 20. షష్టిపూర్తి

1919 వ సంవత్సరమున శ్రీ నాయఁడుగారు కళాశాలాధ్యక్షపదవి విరమించుకొనిరి. తరువాత పిఠాపురములో వారు

నివసించుచున్నను దమకు ప్రియతమములగు కళాశాలను, శర ణాలయమును సమాజమును నడిపించుచు మందిరనిర్మాణమునుఁ గొనసాగించుచునేయుండిరి. అంతలో 1922 సంవత్సరమే తెం చినది. వారి జన్మదినోత్సవము సెప్టెంబరు మాసమున జరుగ వలసియుండెను. పిఠాపురములో మహారాజావారి భవనము లో వారి షష్ఠిపూర్త్యుత్సవము మహావైభవోపేతముగ జరిగి నది. శ్రీ ఓ.కందస్వామిశెట్టి బి.ఏ. గారధ్యక్షతవహించిరి. దూర దూరముననున్న వారిశిష్యులు పెక్కండ్రు ప్రేమోపహారము లతో వచ్చి వారిపదకమల సన్నిధానమున నర్పించి నమ స్కరించిరి. వారి మిత్రులు బ్రాహ్మలు పెక్కండ్రు మహో త్సవములో నపరిమితానందమునఁ శాగ్లోనిరి. ప్రత్యాం ధ్రుని హృదయ కుహరమునఁ బ్రతిధ్వనించి జీవితము పవిత్రభక్తిప్రేమపులకితముగఁ జేసి, శ్రీనాయకుగారి సుగుణ గణముల స్మరింపఁజేయుచు సకలగుణమణిఖనియగు భక్తవ త్సలుని యపారకృపామహత్త్వమును జాటుచుఁ బ్రత్యక్షతా మూల్యమగు దివ్యోపహారము "రత్నహారము"ను శ్రీనాయఁడు గారికొసంగి పరమేశ్వర కంఠసీమ నలంకరించి శ్రీ వేంకటపార్వ తీశ్వరమహాకవులు ధన్యులైనారు. శ్రీమహారాణీఅమ్మగారు, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, శ్రీవోలేటి వేంకట శాస్త్రిగారు, శ్రీదాసరి లక్ష్మణస్వామిగారు, శ్రీవడ్డాది సుబ్బా రాయఁడుగారు, శ్రీఆదిపూడి సోమనాథరావుగారు, శ్రీదోణమ రాజ రామమూర్తిగారు- వీరువారననేల కవులు గాయకులు

పలువు రభినందన పద్యావళులనర్పించి కృతార్థతనొందిరి. ఆంధ్ర దేశములోని బ్రాహ్మప్రార్థన సమాజములవారు స్వాగత పత్రములర్పించియుఁ బ్రత్యేకోపాసనలఁజేసియు హర్షించినారు.

మదరాసు గవర్నరు, మదరాసు శాసనసభాధ్యక్షులు, మంత్రులు, నాఁటిప్రముఖులు, విద్యావేత్తలు పలువురు శ్రీ నాయఁడుగారి నభినందించుచు తంతివార్తలనంపి వారి కాయు రారోగ్యభాగ్యముల నాకాంక్షించిరి.

---

## 21. శ్రీ నాయఁడుగారు సంస్కృతి సంపన్నులు

కళాశాలావిద్య యొక్క యుత్తమాదర్శము విషయమై "కార్డినలు న్యూమన్" దొర చెప్పినసంగతులు వాస్తవమన్నచో శ్రీ నాయఁడుగారి నట్టియుత్తమ విద్యావిధాన ఫలితముగ నుద యించిన యుత్కృష్టపురుషులలో నొక్కరిగా గణింపఁదగును. ఆగంతుకముగ దర్శించి, వారితో నొకింత సేపు సంభాషించిన వారికిఁగూడ వారిసంభాషణములలో వివిధరూపకమయిన వారి విశాల విజ్ఞానము హృదయౌదార్యము దయాగుణాధిక్యము ద్యోతకమయ్యెడివి. ఆంగ్లవాఙ్మయమునందలి యుత్తమ గ్రంథ ములెల్ల శ్రీ నాయఁడుగారికిఁ గరతలామలకములన్న సంగతి వారియొద్దఁజదువుకొన్న విద్యార్థులకెల్ల బాగుగఁ దెలిసియే యున్నది. కాని యట్టి ప్రవేశము వైదుష్యము వారి కాంధ్రభా

షయందలి యుత్కృష్టభక్తి, ప్రబోధక వాఙ్మయమునందుఁ గూడఁగలదు. వారి బహిరంగోపన్యాసములను, నాంతరంగికసంభాషణములను విన్నవారికి పారసీకభాషయందలి వేదాంత వాఙ్మయ రత్నాకరమునుండి హేరాళముగ వారెన్నెన్ని రత్నములా యుపన్యాసములందు వెదఁజల్లెడివారో జ్ఞాపక ముండియే యుండును. ఆ భాషనెఱుంగనివారు గూడ శ్రీ నాయఁడుగారి యుద్బోధప్రభావమువలన జలాలుద్దీనురూమి, సాది, హాఫీజ్, అను పారసీక కవివర్యుల కవితామహత్త్వమును గుర్తించి వారిని గౌరవింపగల్గిరి. పట్టపరీక్ష కొఱకు ఉర్దూ భాషను శ్రీ నాయఁడుగా రభ్యసించినను, నటు తరువాతఁగూడ నాభాషయందలి యభినివేశమును వారు విడువలేదు. "సర్ మహమ్మద్ ఇగ్బలు" గారి కడపటి రచనములను గొన్నిటిని వారు 1938 వేసవి సెలవులలో కాలేజీ మున్షిసాహేబుగారితోఁ గలిసి చదువుచుండిరి. ఉర్దుభాషయందలి యుత్తమ వాఙ్మయమునెడ శ్రీ నాయఁడుగారు చూపుచుండిన యభిమానమునుబట్టియే కాఁబోలును వారు ముస్లిములు గాకపోయినను శ్రీ నాయఁడుగారి యంత్యక్రియలు జరుగునప్పుడు పలువురు మహమ్మదీయ సోదరులు అరబ్బిభాషనుండి సమయోచితములగు ప్రార్థనా శ్లోకములనుఁ బఠించి తమ గౌరవమును బ్రదర్శించిరి. ఇది యనన్యసామాన్యమయిన విషయము.

ఆంధ్ర దేశమున నివసించువారికి శ్రీ నాయఁడుగారికి ఆంగ్లము, ఆంధ్రము, ఉర్దుభాషలయందుఁగల గాఢాభినివేశము

బాగుగానే దెలిసియుండును. కాని దక్షిణదేశ భాషలయెడ గూడ వారికిఁగల గౌరవాభిమానముల గురించి బహుశః తెలిసియుండదనుకొందును. ద్రవిడభాషలో వారికిఁ బ్రవేశము లేకున్నను, ఆభాషయందలి యక్షరసమామ్నాయమును బాగుగాఁ దెలిసికొనిరి. తమిళభాషలోని పద్యకవితయెడ నూతనముగ జరిగిన పరిశోధనలవిషయమునఁ దమకుఁ గలిగిన మెప్పుకను గూర్చి సమయమువచ్చినప్పుడొక్కపరి ముచ్చటించుచు, అరవము మాతృభాషగాఁగల యీదేశీయులకుఁగూడ నాశ్చర్యమును, లజ్జను గలిగించుచుండిరి. ఆంధ్రులయిన శ్రీ నాయఁడుగారు మదరాసు విశ్వవిద్యాలయమున కుపాధ్యక్షులుగా నున్నప్పుడే యీ విశ్వవిద్యాలయపక్షమున, తమిళవాఙ్మయముఁ గూర్చి కొన్ని యుపన్యాసము లొసంగుటకయి సుప్రసిద్ధ తమిళ విద్వాంసులగు "మహామహోపాధ్యాయ" యు. వి. స్వామినాథయ్యరుగారి నాహ్వానించియుండిరి. తమిళపండితునిచే నిట్టి యుపన్యాసము నిప్పించుట యీ విశ్వవిద్యాలయ చరిత్రములో బహుశః అదియే మొదటిపర్యాయము. ఆభాషయెడ నీరూపమున గౌరవాదరములు చూపుటతోఁ దనివిసెందక శ్రీ నాయఁడుగారు ఉపన్యాసము లన్నియు నయినపిమ్మట, మిక్కిలి యానందించి, యాపండితో త్తము నభినందించుచు విశ్వవిద్యాలయ పక్షముననామహామహోపాధ్యాయబిరుదాంకితునకు, "డాక్టరు" బిరుదము గూడ నొసంగవలెనని సూచించిరి. అది, తరువాత గొంతకాలమునకుఁ గార్యరూపమునందెను. శ్రీ నాయఁడుగారా

పదవినుండి విరమించుకొని విశ్రాంతిగొన్నతరువాతఁ గొంత కాలమునకు మదరాసు విశ్వవిద్యాలయాధికారులు ప్రత్యేకసభ నేర్పాటుచేసి శ్రీ నాయఁడుగారికి "న్యాయాచార్య" (Doctor of Laws) బిరుదమునిచ్చిన సమయముననే యా తమిళ పండితునకు "కళాచార్య" (Doctor of Literature) బిరుద మొసంగి గౌరవించిరి.

ఈసందర్భమున నొక్కసంగతి చెప్పఁదగియున్నది. ఏభాషయైననుసరే దానిలో వారికిఁ బ్రవేశము లేదన్నకారణ మా భాషావాఙ్మయములందున్న యున్నత నీతిరత్నములను, నాధ్యాత్మిక రహస్యాదికములను, గ్రహించుటకయి శ్రీ నాయఁడు గారికిఁ బ్రతిబంధకముగాఁ బరిణమింపలేదు. తమ కభినివేశము గల వైజ్ఞానిక విషయముల నాకళించుటకుఁగాను వారట్టి విషయములగూర్చిన యితరభాషలలో నేదేని యుత్తమగ్రంథము నకుఁగల భాషాంతరీకరణములలోఁ బ్రశస్తములయిన వానిని దెలిసికొనియెట్టిశ్రమకయిననోర్చియెంతవెలయైననునిచ్చి దానిని గ్రహించి చదువుచుండెడివారు. ఇట్లే వారు "తాయుమనవర్ తిరుక్కువళ్"అను ద్రావిడభాషాకావ్యములందలి యుదారనీతి ధర్మములను జక్కగ నాకళించిరి. భాషాంతరీకరణముల మూలమునఁ జదివినను నీగ్రంథము లందలి విషయములనెల్ల వారతి శ్రద్ధతో గౌరవముతో బరిశీలించి గ్రహించినట్లు కాననగును. అందలి పద్యములయొక్క సారమును, బ్రత్యేకభావములను వారు తఱచుగ సంగ్రహరూపకముగ, ధారాళముగ జేర్కొనెడివారు.

ఇంక నితరవిధముల వారు ప్రకటించిన భావవైశాల్యౌదార్యములలో వ్యక్తమగు సంస్కృతినిగూర్చి చెప్పుట గ్రంథవిస్తరభయమున మానుట మన్నను నా మనఃప్రేరణమునరికట్టఁజాలకున్నాను. అయినను జాలవఱకు విరమింతును. కాని యీసందర్భములో ముఖ్యముగ గమనింపఁదగినదొక్కటియున్నది. బహురూపకములయిన వారి సంస్కృతిలో పరస్పరవైరుధ్యమనునదిగాని, పరిత్యక్తాభిమానపరిగృహీతముయినదిగాని యేమియుఁగాన్పింపదు. ప్రాచ్యపాశ్చాత్యవాఙ్మయములందలి యుత్తమధర్మములెల్ల సామరస్యముతో వారిస్వభావమునందు, తత్త్వమునందు సమ్మేళనమొందినవి. వివిధవాఙ్మయ పరిచయఫలితముగా వారి యాంతరంగిక భావములలో గల్లోలముగలిగిన సూచనయేమియు, వారుపక్షపాతరహితముగ సార్వజనీనౌదార్యమును బ్రకటించుచు నిర్వహించినబాహ్యవర్తనములో నొక్కింతయు గోచరముకాలేదు. ఇదియెంతయు సన్నుతింపఁదగిన యపూర్వవిశేషము. ఇట్టిది పాశ్చాత్య విద్యాసంస్కృతులకు వశ్యులయిన విద్వాంసులు పలువుర విషయములో నసాధ్యమయినది. అందుచేతనే వివిధదేశవాఙ్మయ విజ్ఞాన సంస్కృతిగలవారు శ్రీనాయఁడుగారివలె మనోభావశబలతా విరహితులుగావలెనన్నచో నట్టివారి హృదయములు వేదాంతవాసనచే నాకర్షితములయి యాయాభాషలందలి వేదాంత వాఙ్మయమునెడ వ్యామోహము కలిగియుండుట యత్యంతావశ్యకము. శ్రీనాయఁడుగారి వేదాంతవిజ్ఞాన సంప

దను బాగుగా గ్రహించి యందుఁగూర్చి యభిప్రాయమొసంగ సర్హతగల వారాంధ్రులలో బహుశః చాలమంది లేరనియే నాయభిప్రాయము. ఈవిషయమున శ్రీనాయఁడుగారు సేకరించిన గ్రంథజాలము వారి విజ్ఞానముయొక్క గంభీరతా వైశాల్యముల కేగాక, యగోచరుఁడయిన పరమేశ్వరుని జగజ్జనకతను గ్రహించి జాతిమతవిభేదముల నిరాకరించి వారు నిర్వహించిన సర్వసౌభ్రాత్రమునకు సాక్షీభూతముగ నిలిచియున్నది. ఇట్టి హృదయౌదార్యము లేనికారణమున నేగదా పలువురు విద్వాంసు లీదేశమున భగవంతునిగుఱించిన మతవిషయములలో నిరంతరము పలువివాదములతో బహుకాలము పెనఁగులాడినది.

వేదాంతులనుగుఱించియు, వేదాంతగ్రంథముల నాదరించువారిఁగూర్చియు వారు సోమరులనియు, సంఘవికాసమును జెఱుచు చీడపురుగులువంటివారనియు దేశమునఁగొంత నిరసనభావముగూడనున్నది. అదికొంతవఱకు న్యాయమయినదే యని చెప్పఁదగును. కాని యట్టిది యాచరణశూన్యులయి కేవలము వాగాడంబరముఁజూపు శుష్కవేదాంతులకే వర్తింపదగును. కాని త్రికరణశుద్ధిగా వేదాంతధర్మముల నాచరించిన శ్రీనాయఁడుగారివంటి యాధ్యాత్మిక సంపన్నులందుకు విలక్షణమయినవారు. వారి సంస్కృతి, వేదాంతము, సోఫాకుర్చీలపయి హాయిగాఁబరుండి కేవలోపదేశములనుఁ బల్కుటతో నాగినదికాదు. వారిదీర్ఘజీవితము సర్వజీవరాసుల హృదయపీఠముల నధిష్ఠించిన జగత్కర్త నారాధించి, సేవించుటయందే

వినియుక్తమయినది. ఒక విద్యాసంస్థలో, సహోపాధ్యాయుఁడుగానో, ప్రధానోపాధ్యాయుఁడుగానో, అధ్యక్షుఁడుగానో, సర్వాధికారిగానో పనిచేయుచుండినను బూర్వోక్తమయిన సార్వజనీన సేవాధర్మమునుండి వారెప్పుడు నొక్కింతయుఁ జలింపలేదు. ఇట్టి యుత్తమాదర్శమే లోకులకెల్ల నాశ్చర్యమును గొల్పి వారి యపారకారుణ్యసంపద నుత్తేజిత మొనర్చినది. బహురూపములుగా బాధలొందు పలువుర దుఃఖనివృత్తికై వారు తమకరుణఁబఱపి క్రియారూపముగఁదోడ్పడి సేవగావించిన విధానములు వారిజీవితములోనే దేశము నల్గడలఁ గథలుగా జనులలో వ్యాప్తమొందినవి. కావున సర్వత్ర జనులందఱు బాగుగా నెఱింగిన వారి యీగుణవిశేషమునుగూర్చి విస్తరించి చెప్పుట యనవసరము. అట్లొనర్చుటయూహాగానదోషమునకు లోనగుటయేయగును.

---

## 22. ఉత్తమ సంస్కారి

దేవాంశసంభూతుఁడగు నీవిశాల కరుణార్ద్రహృదయుఁడు ప్రపంచమందలి యన్ని తెఱంగుల దుఃఖములు, కష్టములు గూర్చి యెంతయు, బరితపించెను. సూక్ష్మాతిసూక్ష్మమగు వారి హృదయగ్రంథిని గూడ గదలింప నట్టికష్ట కథయేలేదు. తమ యర్థమునకు దాము యజమానిగాక రక్షకుఁడను మాత్రమనియే యాయన దృఢవిశ్వాసము. అందుచేతనే యాయన తన ధనము నాదాయమునంతయు దీనులకొఱకే వెచ్చించెను. అట్లు

చేయుట కేవలము వారి యుపయోగమునకుఁగాక స్వోపయోగమునకే యని యాయన విశ్వసించెను. దిక్కులేని యనాథ కానిండు, చదువుకొనసాగుటకయి పరితపించు బీద విద్యార్థి కానిండు, భోజనపువెచ్చమునకయి యంగలార్చు యాదినూంధ్రియువకుడుఁ గానిండు, పరీక్షరుసుము కట్టజాలని విద్యార్థిని కానిండు, దరిద్రస్థితిలోనుండి మందుఖర్చులకు డాక్టరు పంపిన బిల్లును జెల్లింపఁజాలని బీద బ్రాహ్మకుటుంబము కానిండు-వీరందఱు శ్రీ నాయఁడుగారి వితరణమునకు సమభాగులే. అందఱు కన్ని విధముల వారు సాయపడిరి. రైలురోడ్డుపయి దిక్కులేక పడియున్న యనదలనెందఱినో వారు కన్నబిడ్డలవలె సాకిపోషించిరి. ఈవిలో వీరిహృదయమునకు వీరి చేయియేసాటి. నిజమునకు వీరిదానములు చాలవఱకు గుప్తములు. వీరి కుడి చేయి చేసినపని ఎడమచేతికైననుఁ దెలియదు. మానవుఁడు తన కవసరమగు దానికన్న నెక్కువ యుంచుకొనరాదను తత్త్వముగల మహనీయులు వీరు. వీరితోఁ బరిచయములేని వారు కూడ వీరి యుదారస్వభావ మద్వితీయమని ప్రశంసించుచుండిరి. ప్రతిమాసము మొదటిదినముననే మనియార్డరులను, యిన్సూరుచేయబడిన కరెన్సీనోట్లను దేశమందలి వేర్వేరు ప్రాంతములందలి యార్తులకు ననాథులకు, కులమతభేదములేక వారు పంపుచుండిరి. ఉత్తరము లంటించుట, కట్టుట, సీలు వేయుట మున్నగు సామాన్యకార్యములందుఁ గూడ నితరుల ప్రమేయము, సాహాయ్యములేక సమస్తము వారు స్వహస్తములతోఁ జేసికొనెడివారు.

వీరి సహాయసంపద నొందినవారు వేనకువేలు గలరు. ఒకప్పుడు వారియొద్ద కొకమతప్రచారకుని భార్య దీనవదనయై వచ్చి నిలిచెను. నిశ్శబ్దముగా వారు కొన్ని వందరూపాయల నోట్ల నామెచేతఁ బెట్టి యామెను దీవించి, తామిచ్చిన తక్కువ మొత్తమునకు విచారింపవలదని ప్రతినెల కొంత సొమ్ము నంపె దనని యభయమిచ్చి పంపిరి. తరువాత రాఁబోవు నెలకు జీతము కట్టుకొను దారిలేని యొక విద్యార్థి రాఁగా నాతనిని గూడఁదగు విధమున సంతోషపఱచిరి. ఒక క్రైస్తవమిషనరీవిద్యార్థి దీనుఁడై వచ్చి నిలువ నతఁ డాశించినదానికంటె నెక్కువ ముట్టజెప్పిరి. పీఠికాపురాధీశ కళాశాలాధ్యక్షులుగా నున్నప్పుడు వారు విశ్వ విద్యాలయమునకు ముందుగా సొమ్ము చెల్లించి తమ విద్యార్థుల పరీక్షాఫలితములు స్వయముగాఁ దెప్పించుకొనెడివారని వినికిడి. బ్రహ్మసమాజములకు, సీతానాథతత్త్వభూషణుల వారి ప్రచుర ణములకును వీ రెక్కువగ విరాళమిచ్చిరి. నలువదియైదేండ్ల యుద్యోగ జీవితములో నలుబదివేల రూకలకు పైఁబడిన మొత్త మును హిందూదేశమందలి బ్రాహ్మసమాజములకు వారు చందాల నిచ్చిరి. బాధితకుటుంబములకు మానవులకు వారు చూపిన దయ యపారమైనది. వారి సాయము లనంతములు. వారి దయా దాక్షిణ్యముల కనేకోదాహరణముల నీయ వచ్చును. ఒక్కమాటలో మానవుని బాధ్యతనుఁ బరీక్షిం చుటకే భగవానుఁ డనాథలను, నార్తులను, దీనుల నగతికు లనుఁ బ్రపంచమునకుఁ బంపెనేమో యని వారు చెప్పుచుండిరి.

"ఇచ్చునదే నీకులాభము, దాచునదే నష్టము" అనెడియుత్తమ ధర్మమును సంపూర్ణముగా విశ్వసించి యక్షరాల యాచరించిన మహాపురుషులు శ్రీ నాయఁడుగారు.

శ్రీ నాయఁడుగారి హృదయము సహజదయార్ద్రమైనది. భగవంతుడు మానవకోటికెల్ల నంతరాత్మను హృదయమునుఁ బ్రసాదించినాఁడు. అంతరాత్మ పురుషలక్షణమై మానవుని సౌశీల్యముఁగాపాడుచు మంచిచెడ్డల వివరించి త్రోవ చూపును. హృదయము మాతృహృదయమై ప్రాణికోటి మనుగడకే యాధారభూత మగును. హృదయ మందలి దయారసమును స్తన్యరూపమునఁదన సంతతికిని ప్రేమానురాగముల మూలమున లోకమునకును వ్యాప్త మొనర్చును. స్త్రీ పురుషులిరువురిలో నెవరు లేకున్నను లోకకల్యాణమునకు మాఱు వినాశమేగలుగును. అందుకే పురాణములలో శివస్వరూపుఁడగు భగవంతుడర్ధనారీశ్వరుడుగాఁ బేర్కొనఁబడినాడు. అందలి స్త్రీ మూర్తియాదిశక్తియై సృష్టిసంతను నడుపఁగలుగుచున్నది. ఆ యాదిశక్తిస్వరూపమగు స్త్రీయే సృష్టికిమూలము. ఇట్టి స్త్రీ పురుష సమ్మేళనము మంగళకరుడగు నీశ్వరుని యందువలెనే యీశ్వరపాదసేవకులగు శ్రీ నాయఁడుగారి యందుఁ గూడసార్థకమై విలసిల్లినది. అంతరాత్మయను దివ్యజ్యోతి యాధ్యాత్మికపథమును జూపుచుండ వారి దయార్ద్రహృదయము క్రూరకర్ములనుకూడ విడనాడక సన్మార్గవర్తనులుగానొనర్చినది.

మహాత్మగాంధీ తన యాశ్రమములోని యొకవనిత నైతిక పతనమునంది నీచముగా ప్రవర్తించెననిఁ దెలిసి యామె నాశ్రమ

మునుండి వెడలనడచుటయేగాకఁ దానుఁ బ్రచురించుచుండినపత్రికలో నామె ప్రవర్తనమును దీవ్రముగ విమర్శించిన వ్యాసమును సహజ నవనీతకోమలహృదయులగు శ్రీ నాయఁడుగారు జూచి కంట దడివెట్టుకొని రెండు దినము లాహారమును ముట్టరైరి. మాతృప్రేమ వెల్లువలై పారగా నాబిడ్డ యభ్యుదయము నకై ప్రార్థనగావించుచు గూర్చుండిరి. "నాబిడ్డయే యిట్లు పెడత్రోవను నడచిన నేనట్లామెను బహిష్కరింపగలనా! నాబిడ్డను గూర్చి యట్లు వ్రాయగలనా? బిడ్డ చేసినతప్పులను తండ్రిగాని, సంరక్షకుడుగాని కడుపులోబెట్టుకొని దాచవలదా? అందునను నాడుబిడ్డాయె" నని వాపోయిరి. తప్పుచేయుట మానవసహజము. దానిని క్షమించుటే ఈశ్వరలక్షణమని వారు భావించిరి.

వారుప్రేమమయులు. అందఱినాకర్షించి క్షమించునది వారియాధ్యాత్మికపవిత్రప్రేమము. పేదఱికము,కష్టము, పాపకార్యదృశ్యములఁగని నంతనే వారిహృదయము ద్రవీభూతమయ్యెడిది. మండుటెండలో దూరమునుండి నీటిని మోసికొనిపోవు స్త్రీ జనమునుజూచి వారు కన్నీరుకార్చెడివారు. బాధితవితంతువు, నీచముగఁజూడఁబడునస్పృశ్యుఁడు, అసహ్యింపబడుపాపి, నిస్సహాయుడగు ననాథుడు, దారిద్ర్యపీడితుడగుసంఘసేవకుడు, కష్టపడు విద్యార్థి, 'అన్నమో'యని యల్లాడు బిచ్చగాఁడు, దైవస్వరూపుడగు బాలుడు మొదలగు నందఱను వారొక్కరీతిని సాకిరి. కాకినాడ యనాథశరణాలయమందలి ప్రతిబిడ్డయు వారిపితృప్రేమను జవిచూచెను. వారు తల్లియుఁ దండ్రియునై

యనాథులయవసరములను సౌఖ్యములనుఁ జేకూర్చెడివారు. వారు పెంచిపెద్దచేసినబిడ్డలను నడిరాత్రులందు నెమ్మదిగ దగ్గఱ కేఁగి లేపి గిన్నెడుపాలనిచ్చియో, స్వహస్తములతో దుప్పటిని కప్పియో చీకటిలో వారికిఁదోడువచ్చియో మిక్కిలిప్రేమతో నాదరించెడివారు. వారేదేని తప్పునుజేసిన తప్పుల సైరించి సంస్కరించెడివారు. దైవికప్రేమను వాస్తవికముగాగుర్తించుకొలది మందియుదారచరితులలో శ్రీనాయఁడుగారొకరు. ప్రపంచమునఁ దక్కువవారిని నీచముగా జూచుట, గొప్పవారిని మర్యాదగాఁ జూచుటయు గలదు. శ్రీనాయఁడుగారిదృష్టిలో నెక్కువతక్కువలుగాని, జ్ఞానియజ్ఞానియనిగాని, పాపిపావనుడు యనుభేదముగాని లేదు. అందఱచే తిరస్కరింపఁబడినపాపి వారి చరణ కమలములచెంత జేరి శాంతినొందెడివాఁడు. భగవంతుఁడు వీరి ద్వారా తన పతితపావనత్వమును వెల్లడించెను. ప్రతిపాపియును పాపవిముక్తికయి శిక్షింపబడును. భగవంతుడు పాపిని ప్రేమించి తనయొద్దకు వచ్చునట్లు జేయును. సామాన్యులను ప్రేమించుట, బాధితులను, దక్కువవారిని మఱియు నెక్కువగా ప్రేమించుట శ్రీ నాయఁడుగారి యుత్కృష్ట గుణము. ఇతరులపట్ల నెట్లో తమ శిష్యులయెడగూడ శ్రీ నాయఁడుగారు దమ ప్రేమను వర్షించెడివారు. శ్రీ నాయఁడుగారి గంభీరోన్నత విగ్రహము, బుద్ధినైశిత్యము, సౌమ్యస్వభావము, మనోజ్ఞవర్తనము, వక్తృత్వము, వీని నన్నింటినిమించి వెల్లివిరిసిన వారి సర్వమానవ సౌభ్రాత్రప్రేమములు వారియెడ శిష్యులకు, తోడి యుపాధ్యాయులకు,

లోకులెల్లరకు నపారమయిన భక్తిగౌరవములను గలిగించుటకు గారణములయ్యెను. విద్యార్థులయెడ వారికిగల యధికారాకర్షణశక్తులు నిరుపమానములు. శ్రద్ధాళువులయిన శిష్యులనేకులెల్లప్పుడువారి సన్నిధిని మూగి యుండెడివారు. ఆసన్నివేశము "నేనెప్పుడు ఛార్లసు లాంబ్ నుకాను. కాని యెల్లప్పుడు ఛార్లసు లాంబ్ అందు కంపెనీ యగుదును" అను సూక్తిని జ్ఞప్తికిదెచ్చుచుండెడివారు. షేక్స్పియరు, మిల్టను, వర్డ్సువర్తు, టెన్నిసన్, కార్లయిలు, రస్కిన్ మున్నగు కవివర్యుల యుత్తమకృతులలోని యున్నతభావములను, బరమార్థములను, సత్యములను గూర్చి విద్యార్థులకు వారుపన్యసించి పాఠములుచెప్పునప్పుడు పాఠశాలలోని యాగది పరమపవిత్రమయిన ఋష్యాశ్రమమువలెం గాన్పించెడిది. ఆ తరుణములు శిష్యుల మనోబుద్ధులకు విందులు చేయుచు నాధ్యాత్మికశాంతినిగూర్చుచుండెడివి. సత్యము, అహింస, కరుణప్రేమముల గూర్చిన వారిమహోపన్యాసములు విద్యార్థుల మనఃఫలకములపై వానినిజిత్రించి మనోహరమైన రాచబాటలదీర్చినవి. నేడాంధ్రదేశమున పేరెన్నికగన్న పురుషులు పలువురు శ్రీ నాయఁడుగారి శిష్యులే. తమకు విద్యార్థిదశలో శ్రీ నాయఁడుగారెట్టి వారుగా నుండెడివారో, ఎట్టి యున్నతభావములు వారియెడ దమకిప్పటికిని వర్ధిల్లు చున్నవో వారెల్లరునెంతయు గృతజ్ఞతాపూర్వకముగఁ బ్రశంసించి ప్రకటించుచుందురు. "నా జీవితములో నే నొనర్చిన సేవకు ఘనపారితోషికము నాశిష్యులు నాయెడజూపిన భక్తి ప్రేమ

గౌరవములే. అదియే నేను సంపాదించిన యమూల్యధనము. అదియే యెల్లప్పుడు నాజీవితమున కుత్తేజకమయి వరలెను.'' అని శ్రీ నాయఁడుగారే స్వయముగ వచించెడివారు. అసంఖ్యాకులగు పూర్వ విద్యార్థులయెడ వారిప్రేమవాత్సల్యములలో నొక ప్రత్యేకతగలదు. శ్రీ నాయడుగారు వారినిప్రేమతో "నాహృదయప్రియు''లని పిలిచెడివారు. ప్రతి విద్యార్థి సంపూర్ణచరిత్ర పూర్తిగా మరణాంతమునఁకు వారిజ్ఞప్తియందుండెను. గర్భశత్రువులకుఁగూడఁ ప్రేమపూరితమగు వారి హృదయమందు స్థానముగలదు. భగవన్నిర్ణీతమయిన పాఠశాలలో ఉపాధ్యాయ వృత్తియందలి నలువదేండ్లసేవలో వీరు ప్రఖ్యాతిగాంచిన వ్యక్తులను నిష్కళంకశీలురను దయూరుచేసిరి. దక్షిణ హిందూస్థానమందెల్లడ వీరియెడఁ గృతజ్ఞతా గురు భావములు గలవా రెందరోగలరు. వారిలో చిత్తసంస్కారము గావించి మాననీయులుగా జేసిరి.

ప్రపంచ విఖ్యాతిగడించిన "విక్టరుహ్యూగో'' అనుప్రెంచి కవి, దుర్మార్గునకు హృదయపరిణామమును ఘటింపఁగల్గునవి సజ్జనసహవాసము, సన్మార్గావలంబనములు గాని కారాగారవాసము గాదని; దౌష్ట్యమునుఁ ప్రేమచేత మాత్రమే జయింపగలమని యుగ్గడించుటకయి పరమేశ్వరకారుణ్యము, మానవవిశ్వాసము, ఆశ, పశ్చాత్తాపము మున్నగు నుదాత్తవిషయ ప్రబోధకముగ రచించిన"లే మిజరాబిల్ (Les Miserables)అను నుత్తమగ్రంథ మొకేసారి పదిరెండు భాషలలో 1862 లో

ననఁగా శ్రీనాయఁడుగారు జననమొందిన వత్సరముననఁ బ్రకటింపబడినది. పతితపావనకరమగు పవిత్రచరిత్రమును నెఱపిన శ్రీ నాయఁడుగారుదయమందిన కాలముననే ఈ దృశగుణవిరాజితమగు గ్రంథరాజ ముదయించుటగూడఁ బరమేశ్వరుని విచిత్రవిశేషముగ నెన్నఁదగును.

మదరాసు విశ్వవిద్యాలయోపాధ్యక్షులుగా నున్నపుడొక పర్యాయము శ్రీ నాయఁడుగారు దమ సన్నిహితులతో నీ పూర్వోక్త గ్రంథమును బ్రశంసించు సందర్భములోఁ దాము దానిని మొదటఁ జదువుటఁ బ్రాప్తించుటకుఁ బూర్వమే యిరువదియేండ్లక్రితమే దానిని బఠించియున్నచోఁ దమ మనస్సెంతయో సన్మార్గమున నుండెడిదని వాక్రుచ్చిరఁట. ఈ మహాకావ్యమందపూర్వమగు మానవాతీతవిషయము లేమియు లేవు. ఆగ్రంథకర్త సర్వసామాన్యమగు నొక చిన్న విషయమునే ప్రపంచమునకెలుఁగెత్తి చూపెను. సహజముగ మానవహృదయము నిర్మలమైనదే. సంఘవినాశకారియగు దుష్టుని బట్టుకొని చంపుడని జనులందురు. చంపఁదగినది యా దుష్టునియందలి దౌష్ట్యమేగాని యాతఁడు కాఁడని హ్యూగో మహాకవి యీగ్రంథమూలమున లోకమునకుఁ బ్రకటించెను. ఆ నవలలో నొక ప్రధానపాత్రయగు మతగురువే దుష్టుఁడగు జీనువాల్జీనునకు సద్గురుఁడైనాఁడు. దుర్మార్గుని సంఘమే పెడత్రోవలఁ ద్రొక్కించును. దానితో వాని దౌష్ట్యము మఱింత పెచ్చుపెరుగును. దుర్మార్గుని దుర్మార్గతకు వెనుకనున్న కారణమరసి దానిని మాన్పఁబూనినచో వాఁడు సన్మార్గుఁడే యగును. అట్లుగాక సంఘము

యొక్క యుపేక్షవలననే దుర్జనుఁడు దుర్జనతకుఁగల యవధు లన్నిటిని దాఁటి చివరకు మానవద్వేషి యగుచున్నాఁడు. అందుచే దౌష్ట్యమును ద్వేషముచేఁ గాని ప్రతిదౌష్ట్యముచేఁ గాని గాక ప్రేమచేత జయించుటయే సాధ్యమయిన మార్గము. ఏసుక్రీస్తు చెప్పినట్లు కుడిచెంపపై నొకరు కొట్టినప్పుడు ప్రతి ఘటింపక వారికి రెండవచెంపను గూడఁ జూపుటయే కర్తవ్య ము. ఆ మతగురువునందలి యిట్టి ప్రవర్తనమే జీన్వాల్జీనును సన్మార్గవర్తనమునకుఁ ద్రిప్పుటయే గాక సాధుపుంగవునిగా దిద్దఁగలిగినది. ఆ పరిణతహృదయుఁడే "కాసెట్ట్" అనెడి యనాథబాలికకు రక్షకుఁడు పోషకుఁడు నైనాఁడు.

"లే మిజరాబ్" శ్రీ నాయుఁడుగారి హృదయము నాక ర్షించినట్లే యుత్తమగ్రంథము నాకర్షింపలేదు. అందు వర్ణితుఁ డయిన మతగురువును వారే. సాధుపుంగవుఁడైన జీన్వాల్జీనును వారే. ఆ మతాచార్యునివలె నాయుఁడుగారు తమ కంటబడిన బీదలకు దమ విత్తమును గుప్తదానము చేయుచుండెడి వారు. అతనివలెనే నిరాడంబరులై వారు తమ సౌఖ్యములకు వాంఛలకు లోనుగాక పరుల సౌఖ్యములకొఱకు మాత్రమే జీవించుచు "ఉన్నతభావన - నిరాడంబర జీవనము" అను సూక్తి కాదర్శప్రాయులై మెలఁగిరి. విశ్వవిద్యాలయోపాధ్య క్షులుగా నున్నపుడుగూడ వారు మెడకొక మఫ్లరు, శరీరమున నొక బనియను, కట్టుగుడ్డగా నొక యెఱ్ఱపంచియు మాత్రమే ధరించి, శయనసౌఖ్యమునుగూడ బాటింపక చిన్న మంచము

పైనొక యెఱ్ఱనిగుడ్డను ప్రక్కగుడ్డగా నుపయోగించి చిన్న తలగడను మాత్రమే వాడుకొనుచుండిరి. వారిని చూచుటకు వచ్చిన శిష్యుఁడు "అయ్యా! తమ యార్జనములో నేఁబది రూప్యముల వెచ్చించి ప్రక్కకొక మంచి శయ్య నమర్చుకొన వచ్చునుగదా" యని ప్రశ్నింప "నాయనా! ఆ యేఁబది రూప్యముల మొత్తము మఱి పది కుటుంబములలోని మానవ సోదరులకుపయోగ పడవచ్చునుగదా! అట్టిచో దానిని నాకై యేల వినియోగించుకొనవలయును" అని చిఱునగవుతో వచించిరి. వారి కృపాళుత్వమునకు శిష్యుఁడా నందముతోఁ గన్నీరు కార్చుట తప్ప వేఱేమి చేయఁజాలక మిన్నకుండెను. వారిని జూడవచ్చిన యతిథులు ("నైటు") యోధ బిరుదము నొందిన యాయన నిరాడంబరత గాంచి యాశ్చర్య పడుచుండెడివారు. అట్టివారిలో నొక గౌరవనీయుఁడు "తానొక యోధుని ('నైటును') జూడవచ్చి పరివ్రాజకునిఁ గాంచితినని వ్రాసుచ్చెను. సంవత్సరమునకు దనకువచ్చు 15,000 ఫ్రాంకుల జీతములోను వేయిఫ్రాంకులు మాత్రము తన ఖర్చులకయి యుంచికొని తక్కిన 14,000 ఫ్రాంకులను బీదసాదలకు వినియోగించిన విక్టరు హ్యూగో గ్రంథమందలి మతాచార్యునివలె శ్రీ నాయఁడుగారు విశ్వ విద్యాలయోపాధ్యక్షులుగా నుండు సమయమున గడించుచుండిన 2,500 రూపాయల జీతములోను 125 రూపాయల మాత్రమే తమ వ్యయముల కొఱకుంచుకొని తక్కిన మొత్తమునంతేను నితరులకొఱకే

వినియోగించుచుండెడివారు. ఖైదులోనున్న ఖైదీకి హితబోధ చేసి మఱునాఁడాతనిబండిలోఁ గూర్చుండి యురికేగి మరణమనిన భయములేదనుశక్తి నాబంధితునియందు నుద్దీపింపఁజేసిన మతాచార్యునివలెనే శ్రీనాయఁడుగారు కష్టములోనున్న దీనులగు స్త్రీపురుషుల నెన్నఁడుఁ దిరస్కరింపలేదు. కష్టములలో నున్నవారు దమవాంఛితములను మాత్రమే గాక, నంత కెక్కుడుగా గూడ ద్రవ్యరూపములోను, వస్తురూపములోను శ్రీ నాయడుగారి యమూల్య సాహాయ్యమును సలహాల నంది వారివలన జీవితమార్గమును గుర్తించుచుండిరి. వాడవాడలఁ దిరిగి యుపదేశములొసంగుటకంటె మానవుల దారిద్ర్యమును బాపుటకై వేలకొలఁది తనవిత్తమును వెచ్చించిన యామతాచార్యునివలె శ్రీనాయఁడుగా రెండవెండలో దీనులకు, నార్తులకు, బీదవిద్యార్థులకు నెన్నెన్ని విధములనో సాయపడుచుండిరి. వారి మరణానంతరము వారి పెట్టెలను దెఱచిచూడఁగా నందొకపైసైనను గానరాక దీనజనసేవకై వారు వినియోగపఱచిన సొమ్ముల మనియార్డరుకాపన్ల కట్టలుమాత్రమే కానవచ్చినవి.

జీనువాల్జీను 'కాసెట్టు''ను గాంచినప్పటివలెనే శ్రీ నాయడుగారి కొకప్పుడు పొన్నేరివద్ద దిక్కుమాలిన పిల్లలు నలుగురు కంటఁబడఁగా, వారి హృదయము నవనీతమువలెఁ గరఁగిపోయెను. అనాథరక్షణమున కెప్పుడు ముందంజ వేయువారు. వెంటనే యా బాలికలను దమ సంరక్షణము క్రిందఁదీసికొని వారికి విద్యాబుద్ధులు జెప్పించి, వివాహములు చేసి తమకన్న

కూతులకన్న మిన్నగా ప్రేమతోఁ బెంచినారు. వారినేగాక మఱి ముగ్గురు బాలికలనుగూడ నట్లే యాదరించిరి. అనాథ శరణాలయమునుండి వివాహితయై వెడలిపోయిన యే దిక్కు మాలిన బాలికయైననుఁ బ్రసవసమయమున సొమ్ములేక చిక్కులు పడుచున్నదని వారి చెవినిఁ బడినచో శ్రీనాయఁడుగారక్కఱను బట్టి యేయిరువదియైదు రూప్యములనో యామెకుఁ బంపుచుండిరి. అనాథశరణాలయ వర్తితులపయిననేగాక వారి బిడ్డల యెడగూడ వారికత్యంత ప్రేమ. శరణాలయ వర్తితురాలియొక్క బిడ్డ కొకానొకసమయమున చాలజబ్బు జేసినది. శ్రీ నాయఁడుగారి కెవరో ఈ విషయమును జెప్పిరి. అప్పటిలో వారికిగూడ జబ్బుగానుండెను. ఆబిడ్డకాయన పేరుపెట్టుటచే నాపెయందాయన కత్యంతాదరముండెను. బండిపై వెళ్ళి ఆబిడ్డ యవస్థజూచి కంటదడివెట్టి, విచారమున మునిగియున్న తలిదండ్రులకు ధైర్యముచెప్పి, వారిచేత కొంతపైకమిడి, డాక్టరు లక్ష్మమ్మగారివద్దకు స్వయముగా వెడలి, స్థితిగతుల జెప్పి రోగపరీక్షకై పంపి, తరువాత బంగళాకేగిరి. ఆబిడ్డయొక్క యారోగ్యమునుగూర్చి వాకబుచేయుచుండిరి. వారియపూర్వ ప్రేమ యట్టిది. ఎంతమంది యనాథలు, విద్యార్థులు, వితంతువులు, దీనులు వారి యార్థికసాహాయ్యమును బొందిరో భగవంతునికే యెఱుక. తా మొసర్చిన యార్థికసాహాయ్యము స్వల్పమని భావించుచు, దీనులకంపెడు దానములతోఁ బాటు వారి యభివృద్ధి నాకాంక్షించు ప్రార్థనయో, కరుణాపూరితమగు నొక

బొప్పబిందువునో కూడ వారు పంపుచుండెడివారు. వారంపెడి ధనముకన్న వారి దయార్ద్రహృదయమును సూచించునాకన్నీటి కణమే భగవద్దత్తమైన యమూల్యవస్తువుగాఁ బరిణమించి యా దీనుల కష్టములనెల్ల నిర్మూలింపఁగల యౌషధరాజముగాఁ బరిణమించెడిది. ఇంటరుమీడియేటు చదువుచున్న యొక హరిజన విద్యార్థిని నెలఖర్చుల కిరువదియైదు రూపాయల శ్రీనాయఁడుగా రంపుచుండిరి. బట్టలకు పుస్తకములకు వేరేపైకము నిచ్చుచుండెడివారు. ఆమె పతితయైనదని కొందఱాయనతోఁ జెప్పిరి. వివిధవ్యాసంగముల మూలమున పరీక్షలో దప్పిపోయి, దుర్గంధపూరితమైన బ్యాంకిపేటలో నివసించుచున్న ఆ బిడ్డయొద్దకు బోయి యామెనోదార్చిరి. ఏనాటికైనను బిడ్డ మంచిమార్గమునకురాదా'' యని వారామెనుగూర్చి ప్రార్థించుచుండిరి.

ద్రోహి, పాతకి - ఇరువురునుగూడ వారి దయ నొందుటకై ప్రయత్నించి యొకానొకప్పుడు విశ్వాసఘాతుకు లయి వారియెడఁ గృతఘ్నతను గూడఁ బ్రకటించుచుండిరి. బెంగుళూరులోని యొక వితంతువునకు వారు ప్రతినెల యొకటవ తేదీకిఁ జేరునట్లు లిరువదియైదురూప్యములను బంపుచుండిరి. ఆమె కితరాశ్రయులుగాని, బంధువులుగాని లేరు. కొంతకాలమునకుఁ జుట్టుపక్కల నున్నవా రొకనాఁ డామెకుఁ బ్రతినెల వరుసతప్పక వచ్చెడి యీ సొమ్మువిషయమై ప్రశ్నింప నామె "మావారు బ్రతికియున్నపుడు కొంత ధనమును కాకినాడలో నొక నాయఁడుగారివద్ద దాఁచనుంచినారు. వారు దానిని నాకు

నెలనెలకుఁ బంపుచున్నారనెను. కొంతకాలమునకీవిషయ మెట్లో శ్రీ నాయఁడుగారి చెవిని బడినది. ఆయన చిఱునగవుతో సైరించిరి. కాని సొమ్మును బంపుట మానలేదు. ఇట్టులే యనేకులు శ్రీ నాయఁడుగారి సహాయసంపదలనొందియు వారికే ద్రోహము చేయఁ దలపెట్టెడివారు. అయినను శ్రీ నాయఁడుగారు వారి నెన్నఁడు దిరస్కరింపలేదు.

విక్టరు హ్యూగో తన నవలయందుఁ బ్రతిబింబించిన ధర్మసూత్రమును విశ్వసించి యాచరించుట కెంతయో యోరిమి గావలెను. ఈ ధర్మాచరణము ఫలించుటకు నడుమ నెన్నియో యడ్డంకులు గల్గుచుండును. ప్రకృతియందలి పరిణామక్రియలు చాల మందములు. మంచి చెడ్డయందుఁ బ్రవేశించి దానిని బ్రతిఘటించి పరిణామ మొనర్చి మంచిగాఁ జేయుటకుఁ జాల కాలము పట్టును. అందుచే నోరిమితోఁ బనిచేసిన తుదకు విజయము గల్గుట తథ్యము. భూమిలో విసరివేయఁబడిన మాలిన్యము ప్రాతవడి దాని మురికినంతను బోఁగొట్టుకొని తిరిగి మట్టిగా మాఱుటకుఁ జాలఁగాలము పట్టఁగలదు. అది మృత్పదార్థముగా దప్పక పరిణామము నొందఁగలదు. అట్లే పాపికి, ద్రోహికిఁ బ్రకృతియే గుణపాఠము నేర్పగలదని యెఱుంగుటచే శ్రీనాయఁడుగారా కృతఘ్నులయెడఁ గూడ దయామృతమునే వర్షింపుచునందువలన వారిలోఁ జాలమందిని సజ్జనులుగా మార్చుచునుత్తమ సంస్కారులైరి.

---

## 23. సత్పురుషుఁడు

దయార్ద్రహృదయులైన శ్రీ నాయఁడుగా రెంతమందికి ధనరూపకమయిన దానధర్మము లొసంగిరో లోకములోఁ బలువురకుఁ దెలియును. కాని యంతకన్న నెక్కువగా వా రెంద రెందఱకు "క్షమాదానము" గావించిరో యను సంగతి నెఱింగిన వారు మిక్కిలి తక్కువ. వా రెవరి గూర్చియైనను నిర్దయా భావముతో నుండిరని తలంచుట కెదుటివారి కెట్టి యవకాశమును లేదు. వారి మాటలలో నెవ్వరి యెడను గోపముగాని క్రోధముగాని యిసుమంతయు వ్యక్తమయ్యెడిదిగాదు.ఎప్పుడైనను దమసంభాషణములోఁ దమ కపకృతియొనర్చిన యేవ్యక్తినిగుఱించియైన నించుక యుదాహరించినను వా రాతని విషయమున నొక్కింతయైనఁ గ్రోధభావమున్నట్లు వ్యక్త మొనర్చియెఱుఁగరు. అట్టివారినిగూర్చిన ప్రశంసగూడ క్షమాధర్మసూచకములయిన దయార్ద్రవాక్యములతోనే వారు గావించెడివారు. అప్పుడప్పు డితర సంభాషణములలో నపకారి కుపకారము చేయవలెననెడి యుత్తమనీతినిఁ బాటించి,తా మాచరించిన పనులనుఁ బుద్ధిపూర్వకముగఁ గాక యథాలాపముగ చెప్పుచుండిరి. ఒకప్పు డొకవ్యక్తి శ్రీ నాయఁడుగారు ప్రయత్నించుచున్న యొక స్థానమువారికి లభింపకుండుట కయి తన శక్తివంచనలేక కృషియొనర్చెను. ఆ వ్యక్తియే తరువాతఁ గొంతకాలమునకు పబ్లికుసొమ్ము నపహరించి దుర్వినియోగ మొనర్చిన నేరమున కయి యొకయభియోగములోఁ జిక్కువడినప్పు డందుండి తన్నుఁ

దప్పించుటకయి శ్రీ నాయఁడుగారి సాహాయ్యము నర్థించెను. అప్పుడు శ్రీ నాయఁడుగా రాతఁడు తమయెడ గావించిన వెనుకటి యపకృతి గుఱించి క్షమించుటయేగాక యాతని నాక్రొత్త యాపదనుండి తప్పించుటకు సాయపడిరి. అంతమాత్రమే గాదు. అటు తరువాతఁ బెక్కుసారు లాతఁ డనేకసందర్భములలో సాయము నపేక్షించి తమ యొద్దకు వచ్చినప్పుడు గూడ వారాతని కెప్పటి కప్పుడే సంతోషపూర్వకముగ నాతఁడు కోరిన సాయముచేయు చుండిరి. ఇందుచేఁ దమపట్ల వ్యతిరేకముగ వర్తించిన వారి యెడ శ్రీ నాయఁడుగారు చూపెడి క్షమాధర్మము తాత్కాలికము గాక స్థిరమయినదే యనికూడ గ్రహింపనగును.

తాము పవిత్రమని తలంచు ధర్మములకు, నాశయములకు విరుద్ధముగ విశ్వాసహీనులయి వర్తించెడి యనుచరుల పట్ల క్షమాశక్తి సంపన్నమగు శ్రీ నాయఁడుగారి హృదయము కడుంగడు ఖిన్నమయ్యెడిదని యెన్నదగును. కాకినాడ యందలి తమ కత్యంత ప్రేమాస్పదమగు యనాథశరణాలయమునం దొకప్పుడందలి బిడ్డయొకతె యామె భర్తయెడను, గృహధర్మముల యెడను వ్యతిరేకముగ సంచరించెను. అట్లు లొకటి రెండుసారులు గాక పలుమాఱులు వర్తించెను. ఈసంగతి తెలిసినప్పుడు శ్రీ నాయఁడుగారి హృదయ మెంత పరితపించెనో చెప్పనలవి కాదు. ఆమె తమ యెట్టయెదుటకు రాఁగూడదని కట్టడిచేసిరి. అదియే యామె చెడునడతయెడ వారికిఁ గలిగిన యసంతృప్తి యొక్క పరమావధిని గనబఱచు సూచన. వ్యతిరేకులయెడ గూడ

వారికోప మంతకన్న మీాఱఁజాలదు. అయినను దరువాత నామె తన వర్తనమునకుఁ బశ్చాత్తప్తయై మంచిదారికిమాఱు చున్నదని తెలిసినప్పుడామె తమ బంగాళావైపునకు వచ్చు చుండుట జూచినంతనే యామె కీయఁదగిన వారపుబత్తెమునకుఁ దఱుచుగాఁ గొంత యదనముగాఁ గూడ నిచ్చి నవుకరుచేఁ బంపుచుండిరి. ఇట్టి క్షమాధర్మమును భగవంతుని పేరుమీాఁదు గానే తాము చేయుచున్నట్లు వారి నమ్మకము. "ఈమాత్రము దయనైనను వారియెడ మనము చూపనిచో, కృపాసముద్రుఁ డగు దేవుని కృపకుఁగూడ దూరమైపోతిమేయని వారెంతయుఁ బరితపింతురుగదా!" యని యిట్టి యభాగ్యుల విషయమయి వారు పలుకుచుండెడివారు.

ఈ యుత్తమగుణాచరణ విషయములో సత్పురుషులు సాధారణముగా నుండెడి యావరణములను బాహాటముగా దాఁటిపోవునది (శ్రీ) నాయఁడుగారి క్షమాశక్తి. సన్నుతింపఁ దగిన మఱికొన్ని విశేషములు దానియందున్నవి. బహు సంఖ్యాక మగు వారి కుటుంబములో విచ్చలవిడిగా వర్తించి దుర్వ్యయమొనర్చు బాలబాలికల నెందఱనో (Prodigal Sons) వారు కసరుకొనక బుజ్జగించి,క్షమించి,మంచి మార్గముల మరల మరల బోధించి యురమునఁజేర్చుకొను చుండిరి. తొలికోడి రెండవసారి "కొక్కొ-రోకో"యని కూయు నంత స్వల్పవ్యవధిలోఁ దమయజమానిని ముమ్మాఱుకన్న నెక్కు-వమాఱులు తిరస్కరించిన పీటరు (Peter) వంటివారి

నెందఱనో వారు క్షమించి తమశిష్యవర్గమునందుఁ జేర్చుకొనిరి. ఇట్టి యౌదార్యమనన్యసాధ్యముగదా! ఎన్నిసారులు తప్పులు దిద్దుచున్నను బాటింపక శిష్యుఁడట్టి తప్పులనే మరలమరలఁ జేయుచున్నచో నుపాధ్యాయున కంతకన్న వేదనాకరమయినది మఱియొకటి యుండనేరదు. సదుపదేశముల బోధించు బోధకునకుఁగూడ దాను విశ్వసించిన యనుచరులు, శిష్యులు నమ్మదగినవారుకారని వారిచర్యలవలన గోచరించినప్పు డట్టియనుభవమే కలుగును. అంతియేగాక తమ యాదేశములను, ధర్మములను, నాశయములను దిరస్కరించి, యుల్లంఘించి "జూడాస్" (Judas) వలె వారు గురుద్రోహులయి వర్తించినప్పుడెట్టి దురంత సంతాపముకలుగునో యెఱుంగఁజాలము. ఇట్టిసంఘటనలే కొన్ని యీబ్రహ్మర్షికి, దివ్యజ్ఞానికి, సద్గురునకు వారి యంత్యదశలో ఘటిల్లుట మిక్కిలి శోచనీయము. తమకార్యక్రమమును, దమయుద్దేశోపదేశముల ప్రకారము నిర్వహించి తమకెంతయో యుపకరింతురని వారు నమ్మియుండిన కొందఱు పెద్దమనుష్యులు విశ్వాసఘాతుకులయి వారిని విడనాడిరి. అట్టి ద్రోహులనుగూడఁ బ్రతివానిని వారుదారచిత్తముతో క్షమించిరి. అనుపమానమయిన శ్రీనాయఁడుగారి యీసహనశీలము కేవలము భగవదంశాసంభూతమని చెప్పఁదగును. లేకున్నచో నట్టులాచరించుటయితరులేరికిని సాధ్యముకాదు. ఇట్టి క్షమాదానశక్తిని గూర్చియే పాల్ మహర్షి (St. Paul) "దయాగుణము చిరకాలము కష్టము లనుభవించును. అయినను విడువదు. స్వార్థమునకయి

యత్నింపదు. ఎప్పుడు కోపముపూనదు. పరికిఁగీడును దలంపదు ఇక్కట్టులన్నిటిని నోర్పుతో భరించును. అన్నిటిని విశ్వసించును. ఎన్నింటినో యాశించును. అన్నిటిని సహించును''. అని ఘనముగ వర్ణించెను. నేఁటికాలమున మానవహృదయమిప్పటి ప్రపంచమునుజూచి విసుగుచెంది మఱొక వినూత్నజగత్సృష్టికయి పరితపించుచున్నది. సంస్కృతి సంపన్నులగు సత్పురుషులు మానవుని యునికికయి యాశించి స్వప్నములందు గలవరించెడి యానూతన ప్రపంచములోఁ గామక్రోధలోభ మోహమదమాత్సర్యములకుఁ దావుండదు. పట్టుదల, అసూయ, క్రౌర్యము, హింసయనునవి యందుఁగానరావు. ఆ జగత్తునకుఁ బునాది సత్యము. ఆపయి కట్టడములు న్యాయధర్మములు. వానికిఁ బూర్తి సింగారమును గూర్చునది కృప. ఆవరణము ప్రేమ; దానదయాధర్మగుణాన్వితులగు పురుషులేయందు వసింతురు. మనబ్రహ్మర్షి నంటి పురుషోత్తముడే యానూత్న ప్రపంచమున మొట్టమొదట నడుగుపెట్టఁదగిన పౌరుఁడు. ఆతడే దానికిఁబాలకుడు. ఆతఁడే యందలి సమగ్రసద్గుణభూషితుఁడగు మహాపురుషుఁడు. భగవత్సేవకుఁడు.

---

## 24. శ్రీనాయఁడుగారి ధ్యానసిద్ధానుభవములు

"మహాపురుషుల నేరీతిని గ్రహించినను మనకు లాభకారులే యయ్యెదరు. ఎంత యసంపూర్ణదృష్టితో గ్రహించినను మనకట్టి యుత్తమపురుషునివలనఁ గొంతయైనఁ బ్రయో

జనము గలుగకపోదు. అతఁడొక తేజోంబుధి. అతని సామీ ప్యమువలన మనకు మేలు, సంతోషము గలుగును. జగదంధ కారమును రూపుమాపి యంతటను ప్రకాశమును బఱపునట్టిది యాతని తేజము. అతఁడు వెలిఁగించిన దీపమువంటివాఁడుకాఁడు. ఈశ్వరదత్తమయిన సహజకాంతిచేఁ బ్రకాశించు తేజోరాశి. స్వాతంత్ర్యము, సహజమునయిన యాంతరంగిక దృష్టి, పౌరుషము, వీరతాగౌరవము గలుగు తేజోవాహినియతఁడు. అతని తేజః ప్రసారమువలనఁ దాము సుఖవంతులమని ప్రాణులందఱు భావింతురు.'' అని కార్లయిలు పండితుఁడు మహాపురుషలక్షణ మును వర్ణించినాఁడు. పందొమ్మిదవ శతాబ్దియందు వెలసిన యీ ప్రఖ్యాతప్రవక్త నిర్వచించిన మహాపురుషుని మనము శ్రీ వేంకట రత్నమునాయఁడుగారి మూర్తియందుఁగాంచ నేర్తుము. ప్రపంచమందలి యశాంతి పంకములోఁ ద్రొక్కులాడి తెన్నుగానక పరితపించు వేలకొలఁది దేశీయులకే తేజోరాశి నుండి నిరంతరము కాంతిమంతములయి ప్రసరించు కిరణసహస్ర ములు దారిచూపినవి. భగవత్ప్రవక్తై జీవితము సంకితమొనర్చి యనుక్షణము దానిని బరోపకారమునకై వినియోగించి బ్రహ్మర్షి మతమును తమతనువునకుఁ బ్రాణవాయువుగ నొనర్చికొనిరి. వారి సమక్షమున నుండుట భగవత్సాన్నిధ్యము నొందినట్లుండె డిది. నిర్మలమయిన చరిత్రము, గంభీరోన్నతమయిన విగ్రహము గలిగి వారు పలువిధముల లోకము నాకర్షించిరి. ఆయన ప్రేమా స్పదుఁడయిన జనకుఁడు. ప్రియముగొలుపు నెచ్చెలి. నిక్క

మయిన భూతదయాపరుఁడు. పేరొందిన యుపాధ్యాయుఁడు. విఖ్యాతికెక్కిన విద్యాసేవకుఁడు. గంభీరవాగ్ధాటిగల వక్త. సమర్థుఁడయిన యుపదేశకుఁడు. ఏవయిపుజూచినను మూర్తి మంతమయిన మతస్వరూపుఁడు, బహు ముఖములయిన వారి ఘనతనుగూర్చి రానురాను సమర్థులయిన విజ్ఞులెన్నెన్ని ప్రశంసలుగావించినను జిరకాలమునుండి వారి సాహచర్యముగలిగి, వారినిగొలిచి ప్రేమించినవారుమాత్ర మాయనను భగవదుపాసనను ప్రబోధించినపురుషోత్తమునిగనే యెక్కువగ స్మరింతురు. "ఈశ్వరారాధనమునందనిర్వచనీయమైన యానంద మున్నది. ఇతర ప్రాపంచికవిషయములందుఁ గలుగు సంతసమంతయు నిరర్థకమయిన చెత్త" యని మేడమ్ గుయాన్‌దొరసాని చెప్పియున్నది. ఆ తత్త్వము శ్రీ బ్రహ్మర్షియందు నిజముగ నిండారియుండెను. పలువిధములయిన యితర కృత్యములెన్నిగావించుచుండినను వారి హృదయమన్నివేళల నీశ్వరునియందే కేంద్రీకృతమయియుండెడిది. అతనిసేవయందే వారికి ప్రత్యేకానందము. బైబిలునందలి 'మేరీ' (Mary) 'రత్' (Ruth) అనువారివలె నాయన యుత్తమాంశమునకే సుముఖతవహించి లౌకికవిషయములయెడ విముఖత నొందెను.

శ్రీ నాయఁడుగారు బాల్యజీవనమునందే ప్రకృతిచేతనే యాయన యంతర్ముఖుఁడనియు, గంభీర చింతనాశీలుఁడనియు స్ఫురింపఁజేయు సూచనలు గానవచ్చుచుండెను. సంక్షేపముగాఁ జెప్పిన దీనిలక్షణములు రెండు. మొదటిది సత్యవిషయము.

గంభీరప్రకృతిగల మానవుఁడు సత్యమును దెలిసికొనుట కెట్లు వ్యాకులుఁడై యుండునో, తానుగనుగొన్న సత్యమునం దాత్మ సమర్పణము చేయుటయందును నంతవ్యాకులుఁడై యుండును. కొందఱిపక్షములో సత్యము కేవలమితరులవలనఁ దెలిసికొని యాలోచింపవలసిన విషయమైయుండవచ్చును. కాని గంభీర ప్రకృతిసంపన్నుఁడగు మానవునివిషయములో సత్యము ప్రభువు వంటిది. అట్టిమానవులు సత్యమునను సరించుటకుఁ దాము బాధ్యులమని గ్రహింతురు. ఇక రెండవలక్షణము జీవనము యొక్క యుద్దేశవిషయికమైనది. జీవనముయొక్క లక్ష్యముతో స్వార్థమునకుఁగాని, సంసారమునకుఁగాని, సంఘర్షణము తటస్థించినయెడల గంభీర ప్రకృతిసంపన్నుడెవఁడును వెనుకంజ వేయఁడు. సిద్ధాంతముకొఱకుఁ గర్తవ్యనిర్ణయముకొఱకు యత్నశీలుఁడగును.

సుబేదారు అప్పయ్యనాయఁడుగారు వైష్ణవ మతావలంబకులు కావున నా సంప్రదాయమున కనుగుణముగఁ దమ కుమారునకు విద్యాబుద్ధులు గఱపవలయునని మొదటినుండియు వారి యాశయము. శ్రీ నాయఁడుగారి ప్రవర్తనయెడఁ దండ్రిగారు విశేషజాగ్రత్త కలిగి మెలఁగుచుండిరి. ఇట్టి సందర్భములలో శ్రీ నాయఁడుగారు బ్రాహ్మమతధర్మాభిలాషియై యీశ్వరోపాసనా మందిరమున కేఁగుచు బ్రహ్మ సమాజమునందు మిక్కిలి యుత్సాహముతోఁ బని చేయుచుండెడివారు. వారిట్లు బ్రాహ్మసమాజముతో సంబంధమును కలిగియుండుట పూర్వా

చార పరాయణులు, హిందూమత సంప్రదాయానుసారులు, కఠినస్వభావులు నగు శ్రీ అప్పయ్యనాయఁడుగారికి నచ్చదయ్యెను. తమ కుమారుఁడు పరమతము నన్వేషించుచున్నాఁడని వారు భ్రమపడి, ప్రార్థనామందిరమున కరుగకుండ నాయఁడుగారి నొక గదియందు బంధించి రెండేసిదినములవఱకు భోజనము గూడఁ బెట్టక నిర్బంధమున నుంచెడివారు. పరమభాగవతోత్తముల కందఱకు శాంతిమందిర మనదగు నిట్టి కారాగారవాసము శ్రీ నాయఁడుగారికిఁగూడఁ బ్రశాంతిజనకమయి భగవదారాధనకు మిక్కిలియు నుపకరించుచుండెడిది. అంతియే కాని యందుమూలమున వారి యేకేశ్వరారాధనోద్దేశము చలింపలేదు. మీఁదుమిక్కిలి యందు విశ్వాస మధికతర మయ్యెను.

కనుక బాల్యవయస్సునందే, శ్రీ నాయఁడుగారి హృదయమధ్యమున, నొకవైపునఁ దలిదండ్రుల యెడ నవిరళమైనభక్తి, వారిచే నాచరింపఁబడు ప్రాచీనధర్మక్రియాకలాపములం దాసక్తి మఱొకవైపున సత్యానురాగము గుదురుకొని యీ రెంటిమధ్యమునను సంగ్రామోదయమై తత్ఫలితముగా వారు తండ్రితో విరోధపడి తుదకుఁ దమకు సమ్మతమయిన బ్రాహ్మమత ధర్మముకొఱకు వారిని విడనాడవలసివచ్చెను.

సత్యానురాగము, వివేకానుసరణశీలము జీవితమునందలి కఠిన సమస్యలను దప్పించుకొని తిరుగని స్వభావము, ప్రకృతి గత గాంభీర్యము, వీని సమాహారమే శ్రీ వేంకటరత్నము నాయఁడుగారి యంతర్జీవనముయొక్క ప్రథమోపాదానము. దీని ప్రభా

వముచలననే వారు ధర్మనిర్వాహణమున కయి తండ్రిగారి నేగాక భావిజీవితమునం దెన్నో పర్యాయములు బహుసంఖ్యాకుల నెదిరించి యేకాకిగా నిలువఁబడఁగలిగిరి.

శ్రీ నాయఁడుగారి బాల్యకాలమున వారి వైష్ణవకుటుంబము వారి పవిత్రహృదయమునందుఁ గొన్ని సద్గుణముల కొఱకును, ధర్మానురతియొక్క కొన్ని విశేషములకొఱకును ననుకూలమైన పరివేషమును (Environment) రచించియుండెను. బాహ్యానుష్ఠానముల నాదరింపకపోయినను, మానవునితో మానవున కుండవలసిన వ్యవహారములందు వైష్ణవుల కుచితమగు కోమలత్వము, ప్రపత్తి, క్షమాశీలము మున్నగునవి సర్వసాధారణముగా నీ కుటుంబముయొక్క వాతావరణమునందుఁ బ్రవేశించి యుండెను. వాని ప్రభావము శ్రీ నాయఁడుగారి చరితమునందును బ్రవేశించెను. సహజముగా నితరుల దుఃఖమును జూచి సహింపలేకపోవుట, అందఱియెడ నమ్రభావముతో, మధురభావనతో వ్యవహరించుట మున్నగు కోమలగుణములు శ్రీ నాయఁడుగారి చరితమునఁ బొందికనొందెను.

ఈశ్వరుడు ప్రేమచేతను, భక్తిచేతను జేరఁదగిన పరమపురుషుఁడగుట నందఱు కలిసి యాయనను భజించి, వందనములర్పించి, జన్మసాఫల్యము నొందదగునను భావమునెడ విశేషోన్ముఖత్వము, లాలసత్వము వైష్ణవకుటుంబమునందు జన్మించిన హేతువుచేతనే నాయఁడుగారికిఁ బ్రకృతిగతమై హృదయమునందు స్థిరమగు స్థానమును బొందియుండెను. తరువాత జీవితము

నందు జరిగిన వేదాంత చర్చలలోను, తర్కవితర్కములలోను, గంభీరోపన్యాసములందును, వారు చిత్తమును జెదరనీయక స్థిరముగా నిలిపి ప్రతిపక్షులను సహితము విస్మితులనుగాఁ జేయుటకు ధర్మభావమును, భక్తిమార్గమునఁ బ్రవహింపఁజేయుటకు నీ పునీతభావమే సహాయకారి యయ్యెను.

ప్రగాఢమైన భక్తి, యచంచలమైన విశ్వాసము నీశ్వరునియందు లేకున్న దామొనర్చిన కార్యములన్నిటియందు వారు కృతార్థులగుట యసాధ్యము. వారి గుణములలోఁ బ్రధానమైనది నిరంతర ప్రార్థనాశీలము. వారు చిన్నతనమునందుఁ బారసీకభక్తవరేణ్యుల యీశ్వరస్తవసంకీర్తనముల బారాయణము జేయుచుండిరని వెనుకనే చెప్పియుంటిమి. తత్ప్రభావమే క్రమముగా వారియందు వృద్ధిజెందినది. ప్రార్థన గావింపక, సర్వసృష్టికర్తను స్మరింపక, యే యితరకార్యములను వారు చేసెడివారుకారు. నిద్రనుండి మేల్కాంచునపుడు ప్రార్థన, కాల్యకృత్యముల నెఱవేర్చునపుడు ప్రార్థన, స్నానపానసమయములందుఁ ప్రార్థన, భుజించునపుడుగాని, చేయునపుడుగాని ప్రార్థన. నిద్రాసమయమునఁ బ్రయాణసమయములఁ బ్రార్థన ఇట్టివేళల వారీశ్వరస్తవముఁ చేయని గడియలేదు. వేయేల వారి జీవితమే సుమధురమైన ప్రార్థనాగీతము. ప్రార్థనాగీతముల నితరులు పాడునపుడు వారు తన్మయులై, వారుకూడ లోలోన బాడుకొనుచుండెడివారు. ఇతరులు ప్రార్థనజేయునపు డందుఁ దమ నిర్మలమానసమును లీనముజేసి, పరమేశ్వరగుణగణముల

మననము జేసికొనుచుఁ దన్మయాభావము నొంది సంతతధార గాఁ గన్నీరు కార్చెడివారు. వా రెచ్చటికేఁగిన నక్కడొక ప్రార్థనాకూటమును స్థాపించుచుండెడివారు. నిత్యకుటుంబ ప్రార్థనల కెంతో యాసించెడివారు.

వారి పరమేశ్వరభక్తిని జాటు నొక విశిష్టోదంతము నిటఁ బేర్కొననగును. 'జి' యను నాంగ్లాక్షరము వాక్యారంభమునఁ బెద్దయక్షరముగా రాయవలసిన పట్టులనెల్ల నాయఁడుగారు దానిని దానిని ఉరవుగల చిన్నయక్షరముగ మాత్రమే వ్రాయుచు, భగవంతుని సూచించు పదము, మొదటనున్నపుడు మాత్రమే దానిని బెద్దయక్షరముగా వ్రాయుచుండెడివారు. ఇది స్థూలదృష్టి కల్పవిషయముగనే గోచరించును. కాని తమహృదయమునందుఁ గల భక్తివిశ్వాసములను జూఱ గొని హృదయాధినాథుఁడై యలరారు నధికారమొక్క భగవంతునకే గలదని వారు చెప్పెడివారు.

ఆత్మగీతమునకు, క్రియ-యారాధన యనునవి ప్రధానాంగములు. మొదటిదందలిభాష, రెండవది నాదము(గానము) నని వారు భావించిరి. భగవదారాధనచే నుద్బోధితమయి శాసితమయినప్పుడే, జీవితము గుర్తెఱింగి తనప్రయోజనమును నెఱవేర్చి పరమార్థసిద్ధికయి పాటుపడి యవధిని బడసి కృతార్థత నొందనేర్చుననుటయే దమవిశ్వాసములకు, నిశ్చయములకు మూలాధారమని వారు ప్రకటించుచుండిరి.

ఏకేశ్వరోపాసనానిమగ్నమగు నాయఁడుగారి హృదయము వారివలెనే యేకపత్నీవ్రతము ననుష్ఠించెనని చెప్ప

టలో నతిశయోక్తి లేదు. ఎల్లప్పుడు నేదోయొక సమయ మున తమయాప్తవర్గములో సజీవులో విగతజీవులో యగు నే యొకరిగూర్చియో భగవద్ధ్యానము చేయుటలో వారియాత్మ నిమగ్నమై యుండెడిది. ప్రతిసోమవారము వారు తమకత్యంత ప్రేమాస్పదురాలైన సతీమణి యమృతమూర్తిని దమహృదయ ఫలకమునఁ జిత్రించుకొని యామెయాత్మ శాంతికై తదేక ధ్యానమున నిమగ్నులై యుండెడివారు.

వాస్తవమునకు వారొక తత్త్వవేత్తకారు. ఒక నూతన తత్త్వవిధానమును సృజించి, సుస్థాపితమొనర్చుటయు వారి లక్ష్యముగాదు. అట్లని మన దేశమున నిదివఱకే యున్న తత్త్వ సిద్ధాంతములను, వివాదగ్రస్థమగు హేతువాదముచే సమర్థించు టయు వారి యభిమతము గాదు. బ్రాహ్మమతమును శాస్త్ర పద్ధతిని స్థిరమగు పునాదులపై నెలకొల్పుటయే వారి యాశ యము. కొన్నికొన్ని పట్టులవారు తమసమగ్ర తర్కనైపుణిని బ్రదర్శించిరనిన నది యామతము నందలి తమవిశ్వాసములను నాత్మపరిశోధనము గావించి స్థిరీకరించుకొనుటకే గాని ప్రత్య ర్థుల వితండవాదమును ఖండించి వారి నోడించుటకుఁ గాదు. ఆయన యాత్మపరిశోధనలన్నియు తాత్త్వికదృష్టితోఁ గావిం పబడినవి. అట్లని వారు తాత్త్వికులుమాత్రము గారు. మతము కొఱకై పెనగులాడుట నితరులకు వదలి, తామెప్పుడును దమ యంతరాత్మయొక్క ప్రబోధము ననుసరించి దివ్యజ్యోతి తమకుఁ జూపిన మార్గము వెంబడినే యీశ్వరార్చనము చేయుటయందే

వారు తృప్తినొందిరి. తరుణవయస్సున విగ్రహారాధన ఖండనము గూర్చియు, సంఘసంస్కరణము గూర్చియు మాట్లాడనిదే వారికిఁ దృప్తియుండెడిది కాదు. కాని "హాఫిజు, సాదీ" మున్నగు భక్తవరేణ్యుల కవిత్వమాధుర్యమును గ్రోలునపుడాయన సంతోషము చెప్పనలవికాదు. అప్పుడే వారు విగ్రహారాధనా ఖండనమును మాని పరమేశ్వరు నాధ్యాత్మికముగా బ్రార్థింపఁ బూని గొప్ప ప్రార్థనాభావము నలవఱచుకొనిరి. ఒకప్పుడు వారొక క్రైస్తవమత ప్రచారకునితోఁ గలిసి ప్రయాణము చేయుట తటస్థించెను. అప్పు డామతప్రచారకుడు శ్రీనాయఁడు గారిని గుశలప్రశ్న మొనరించి, తాను రాజమహేంద్రవరము నుండి వచ్చుచుంటిననియు, అప్పుడే దెలుఁగు నేర్చుకొన మొదలుపెట్టితి ననియు, చక్కని శైలిలో వ్రాయఁబడిన శ్రీ వీరేశలింగము పంతులుగారి వ్యాసములను మొదటఁ జదువుట తెనుఁగు నేర్చుకొనుట కారంభించినవారికి మంచిదని కొందఱు సలహానిచ్చిరనియుఁ జెప్పి, పంతులుగారి రచనల గూర్చి మీ రేమైన నెఱుఁగుదురా యని ప్రశ్నించి యంతటితో నాఁగక తానప్పుడు విగ్రహారాధన విషయమై పంతులుగారు వ్రాసిన వ్యాసమును జదువుచుంటి ననియు, నందు వారు విగ్రహారాధనమును దీవ్రముగా ఖండించిరే కాని, నిర్మాణాత్మకమగు దృష్టితోఁ జేయవలసినదేమో చెప్పలేదనియు, ఒక్క క్రైస్తవమతమే యందుకు సమాధాన మీయ నోపుననియు, ఏసుక్రీస్తు నారాధించుటొక్కటే యందుకు శరణ్యమనియు

నొక్కుమ్మడిగ నొకయుపన్యాసమును శ్రీ నాయఁడు గారి యెదుటఁ గురిపించెను. అప్పుడు శ్రీనాయఁడుగారు "ఈపవిత్ర భావ మీ క్రైస్తవ సోదరునకుఁ జెప్పనేల" యని దమలోఁ దాము "విగ్రహములు పోయిన యెడల నాహృదయాధి నాథు డేకేశ్వరుఁ డేమైనాఁడు. అతని నే నర్చించుకొనినఁ జాలదా" యని యనుకొనిరి.

సృష్టి పరిశీలనా రహస్యములోను, ప్రకృతిలోని సమ స్తముః నందును శ్రేష్ఠతగలదనివారు విశ్వసించెడివారు. భగవం తునిఁగనుకొనుట కాంగ్ల పారసీక వాఙ్మయమునందలి సారస్వ తమునుగ్రోలి తమయాధ్యాత్మిక దృష్టిని చిన్ననాటనే పెంపొం దించుకొనినారు. వారి యద్వితీయ భగవద్విశ్వాస బలమున సర్వము మేలుకొఱకే వినియోగపడుచుండెను. మానవస్వభా వమందలి వాస్తవికమైన సత్యగ్రహణమునందలి విశ్వాసమునం దలి విశ్వాసమునకుఁ గూడఁ గారణము "రక్షింపఁబడితిని దైవ ముచేతిలో నేను క్షేమముగానేయున్నానని నేనెఱుఁగుదును" అనునది వీరి పరిశీలనమందలి యతిరహస్యవిషయము. మాన వుఁడు తాను గుర్తించినను గుర్తింపకున్నను మానవునకుప యోగింపని పదార్థమును దైవముసృజింపడని వారి దృఢవిశ్వా సము. మిక్కిలి యసహ్యమును గలిగించు పుష్పముగూడనేదో విధమున నుపయోగపడకమానదని వారి తలంపు. ప్రవహిం చు సెలయేటియందు, పుస్తకములలోను, చెట్లభాషలోను, ఱా ళ్ళలోను, సృష్టిలోని ప్రతివస్తువునందును మంచికలదని, యవి

మానవునకుఁ బ్రబోధమును గల్గించునని వారు గ్రహించిరి. వారు సన్నిహిత భావముతో భగవంతునిఁ జేరుచు దేశమునకు పేరు దెచ్చునట్టి భావమతవాదులు. వారి జీవితమంతయు భగవత్సేవాంకితమయిన కానుక.

కార్యనియంతయైన యీశ్వరుని యీ దేశముల నొకింతయైన నెఱవేర్పఁ బ్రయత్నించుటయే తమవిధియని వారు భావించుచుండిరి. ఇట్టి మనస్తత్త్వము సంపూర్ణముగ వారి స్వార్థరాహిత్యమును, భగవదాత్మార్పణమును లెస్సగా వ్యక్తమొనర్చును. అంతమాత్రమేగాక "పాపమునేగాని పాపిని ద్వేషింపకుము" అను వారి ప్రియనీతి సూత్రమునకుఁ గూడ నిది ప్రతిబింబముగానున్నది. ఈ సూత్రమును వారు (అక్షరాలా) త్రికరణశుద్ధిగా నాచరించిరి. పాపమునుమాత్రమే ద్వేషించి, పాపిని క్షమించి విడిచెడివో గుణమునే యభినందించి గుణవంతునెడ నేల యుదాసీనముగనుండరాదని మనకిందువలన స్ఫురింపగలదు.

సర్వసమ్మత మతదృష్టితో వారు ప్రతి విషయముఁ దిలకించుటచే వారికెందును బాక్షిక భావముకలుగలేదు. జగత్ప్రీత భవనమునకు వెలిగానేదియునుండ నేరదనియే వారి యాశయము. ఉత్తేజకరములగువారి ప్రార్థనములొకదానిలో "నిన్నునేఁగలిగియున్నప్పు డన్నియును నావేయని వాక్రుచ్చిరి. వారి హృదయము పయి నధికారము నెఱపిన ప్రధానోద్దేశమెప్పుడు నిదియే. వారి యుపదేశములనుండి యలఁకోకగాఁగ్రై కొనిన

"భావపరంపరలతో గొట్టుకొను హృదయము, నీకయి బెంగగొని యెల్లప్పుడు నువ్విళ్లూరు హృదయము, తీవ్రప్రేమముతో నీకయి యాకలిగొనుహృదయము. నీవు లేనిచో వైధవ్యమొందితినని నిందించుకొనెడి హృదయము, నీవు విడనాడినయెడల దురంత దుఃఖాగ్ని పరితప్తమగుహృదయము" అను వాక్యమునుజదివిన వారి హృదయ మెటువంటిదో గోచరింపఁగలదు. మహాభక్తుడగు వేంకటరత్నముగారి మానసికతత్త్వమిట్టిది. భగవంతునినామములతో విస్పష్టముగా వేగముగఁగొట్టుకొనెడి యట్టి హృదయమే యనంతమగు పరమేశ్వరుని కరుణా కాంతిపుంజములతో వెలుఁగొందుచు భగవత్పథములను మానవునకుఁ జూపఁగలుగును. అత్యంత వినయ పూర్వకమగు నాత్మార్పణ సూచకముగ వారు తఱచు తమ్ము "పాపాత్ముఁడ"నని వ్యవహరించుకొనెడివారు. దానినిబట్టియే భగద్దత్తమయిన సౌజన్యము, ప్రేమము వారి యందెంత నిండారియుండెనో వ్యక్తమగును. వారి యుపదేశ సందేశములనుండి మఱికొన్ని వాక్యరత్నములనిట నుదాహరించుచున్నాను.

"నిశ్శబ్దమునందు భగవత్కృపగర్భీకృతమై యున్నది. ఆకృపతోనే వాక్కుగంభీరత నొందుచున్నది. ఆకృపను గూర్చి జగమంతయుఁగావించుస్తోత్రము నందుప్రతిధ్వనియు మేళవించుచున్నది. ఆకృపను సన్నుతించు నేకైకగీతమునందు మనయింద్రియములన్నియు లయించుచున్నవి. ఆకృపయొక్క దివ్యప్రభావమువలన మన చరిత్ర మంతయుఁ బావనమగుచున్నది.

దూరదృష్టితో నాకృప యొనర్చిన శాసనమే సంఘము. ఆత్మ కుసత్త్వమును, బవిత్రతను బట్టుదారముతో నంటగట్టు ప్రతిసంబంధము సహనశీలమగు నాకృపకు దృష్టాంతమే యగును. తరతరములనుండి విజ్ఞులు విలోకించినది, మహర్షులుగ్రహించియనుభవించినది, ప్రవక్తలు ప్రవచించినది, కార్మికులు కష్టించినది, సౌమ్యస్వభావులుసహించినది, విశ్వాసము గలవారు ప్రత్యక్షముగఁ గనుగొన్నది, హృదయవేదనలోనావంటి పాపాత్ములకు గూడ గోచరించినది- ఇవియు మఱి యిట్టివన్నియు బహుముఖములయిన యీ భగవత్కృపాస్వరూపములే" పరమేశ్వరుని కరుణనిట్లు స్తోత్రము చేయుట యపారమయిన వేదాంత విజ్ఞానావలోకనము, ఆనందైకదృష్టిగల శ్రీ నాయఁడుగారి వంటి వారికే సాధ్యమగును గాని యితరులకుఁ గాదు. అంతటను బరమేశ్వర కారుణ్యమును గనుంగొనుటచే వారి హృదయము సర్వజనముల యెడను గరుణామధుకణములతోఁ బ్రవహించుచుఁ దమకడ జేరినవారినెల్ల నందు నిమగ్నమొనర్చెను.

శ్రీ నాయఁడు గారి జీవితము "కర్మయే యారాధన" యను కార్లయిలు పండితుని సిద్ధాంతమునకు దృష్టాంతమని చెప్పనఁజాలదు. ఆరాధన యనునది వారి దృష్టిలోఁ బ్రాణులు భగవంతునియెడఁ దాత్కాలికముగఁ జేయఁదగిన కృత్యము గాని, ప్రత్యేకప్రయోజనముద్దేశించి యొనర్చు విధిగానికాదు. స్వలాభమపేక్షించి చేయు సాధనమునుగాదు. "భగవంతుఁడు మానవుని వాస్తవముగాఁదన బిడ్డగాభావించును. అతఁడట్లుకా

వలెనని వాంఛించును. అందుచే నీశ్వరోపాసనము మానవుడు తనంతటఁదాను సహజోత్సాహముతో నిరంతరము స్వేచ్ఛాపూర్వకముగఁ గావింపవలసిన విధాయకకృత్యము" అనియే వారి సిద్ధాంతము. "తస్మిన్ ప్రీతిః తస్యప్రియకార్య సాధ నంచ తదుపాసనమేవ" అనుధర్మమును వారవలంబించి జీవితమునందు దృష్టాంత పూర్వకముగ నాచరించిరి. ఈ శ్లోకార్థమును వారే యిట్లు భాషాంతరీకరించిరి. "భగవంతుని యందలి ప్రేమము అతనికి ప్రీతికరములయిన కార్యములను జేయుట నలవరించుకొని వానిని గావించుట- ఇవియే యాతని యుపాసనము." సామాన్యమానవుని విషయములోఁ జెప్పుట, చేయుట వేఱుగతులఁబట్టుచుండును. కాని శ్రీ నాయఁడుగారి విషయములో నట్టి వైరుధ్య మొక్కింతయుఁగానరాదు. వారివాక్కు, క్రియ యెప్పుడు పరస్పరైక్యము గల్గియుండెడివి. భగవంతుని కిష్టమయిన కార్యములొనర్చుట యననేమో కొందఱకు సరిగానర్థమే కాదు. భగవదనుగ్రహముచేఁ దమకుగలిగిన సౌఖ్యములకు, ఆనందములకు నాతనికిఁ గృతజ్ఞతావందనములర్పించినఁ జాలునని చాలమంది తలంతురు. కాని వేంకటరత్నమునాయఁడుగారి దృష్టిలో నింతమాత్రమీశ్వరోపాసనగాదు. జీవితమందలి ప్రతి కృత్యము, ప్రతిచింతనము, ప్రతిసూక్ష్మాంశముగూడ నీశ్వరారాధనమే. అట్టి భావనతోనే వారు తమ జీవితము నిర్వహించిరి. జీవితసర్వస్వము భగవంతునకుఁ బరిపూర్ణముగ నంకితము కావలెను. సమస్తము నాతనికొఱకే చేయవలెను. ఒకరినిరోధమూ

లమునఁగాని, బలవంతమువలనఁ గాని కాక భగవంతునివలెనే యుండవలెననెడితృష్ణావేగముతో నాచరింపవలెను. "భగవంతునివలెనే యుండవలెను. నే నతనివాఁడనే కావలెను. నే నతఁడుగా మాఱవలెననెడి యీవేదనయే భగవదారాధనయగును." అనునవి వారివాక్యరత్నములు. "యత్కర్మప్రకుర్వీత తద్బ్రహ్మణి సమర్పయేత్" "నీవేపనిచేసినను నదియెల్లఁ బరబ్రహ్మమునకు సమర్పింపుము" అని యుపనిషత్తులలో మహర్షులు చెప్పియున్నారు. బ్రహ్మర్షి దీనినిఁ దనజీవితమంత్రము గావించెను. "పక్షి చెట్టునందలి తనగూఁడును, వన్యమృగము కొండయందలితనగుహను, మానవుఁడు ప్రపంచమందలి తనగృహమును జేరువఱకుఁ దహతహతో దేవులాడునట్లు, జీవాత్మగూడ, సచ్చిదానందస్వరూపమును జెందువఱకుఁ బరితపించుచుండును. కాబట్టి యుపాసన యనునది మనయంతః ప్రకృతిరహస్యముగఁ గలిగించుతొందరను శాంతింపఁజేయుటకయి చేయు ప్రతిక్రియయే. అందుచే వివేకముగల ప్రతిజీవికి, ఈశ్వరోపాసనతోఁడి జీవితమే సార్థకమయిన వాస్తవజీవనము. అదియే యుత్తమలక్ష్యమయిన పరబ్రహ్మము నాలింగనమొనర్చుటకుఁ దగినసాధనము" ఇట్టివాక్యములతో బ్రహ్మర్షి తమకు భగవత్సాహచర్యముతోఁడి యనుభవమును వెల్లడించిరి. ప్రతిమనుష్యునియందును నిట్టి సాహచర్యానందమును బడయుటకయి తహతహయుండునని వారు గుర్తించిరి. ఆ యానందమును బొందుట ప్రతివానికిని జన్మతఃకలిగిన హక్కని వారుభావించిరి. "మనలోనున్న మంచియంతయు

జగత్తునందలి మంచినిగాంచి యందువిలీనమగుటకుఁ బరితపించును'' ఇదియే సాహచర్యము. నిక్కమయిన యుపాసనయన నీశ్వరునితోఁ గలిసియుండుటయే. ఈశ్వర హృదయముతో జీవాత్మ మేళవించుట కారాధనయే దారిచూపును. శాశ్వత సత్యమునందు, ననంతప్రేమమునందు జీవాత్మ పునర్జన్మమొందుటకది ప్రోద్బలమొసంగును. దేవునికుమారుఁడ నగుటచే నాతనిఁ జేరుటకు సర్వస్వాతంత్ర్యమున్నదను భావముగలిగించి రాజకుమారశీవితో నాతని సన్నిధానమున కేఁగుటకదియే ప్రోత్సహించును. పరమపావనుఁడయిన ప్రాణనాథునితోఁడి పవిత్ర పతివ్రతాధర్మము నుద్బోధించి యదియే యాత్మస్మృతికి డోలికయు, పావనత్వమునకుఁ బోషణగృహమునగును. ఉపాసన రాజకిరీటముపయి శూలమును స్థాపించును. భగవద్ధర్మస్థాపనముకయి బలియగు భక్తవర్యునెదుట రాజాజును మోఁకరింపఁ జేయును.'' అట్టియుపాసన, అట్టిభగవత్సాహచర్యప్రాప్తి, అట్టి యాత్మార్పణమూలమునఁ బ్రాప్తించెడి యఖండాత్మానందము —ఇవియే మానవుని పరమలక్ష్యమయిన బ్రహ్మానందమునకు సాధనములు. ప్రతిమనుజునకు నందుఁ బ్రత్యేకాధికారముకలదు.

"పరమేశ్వరు నారాధించుటకు, అతనికరుణనొందుటకు, అతనిమహత్త్వమును గొనియాడుటకు, అమోఘములయిన యాతని విజ్ఞానప్రేమములను వెల్లడించుటకు మనకుగల యధికారమడ్డులేనిది. అతనిధ్యానించుట దివ్యమయిన యానందాంబుధిలో మగ్నమగుటయే. అతని సాహచర్యమునొందుట మన

సంతోషములలో మధురాతి మధురమయినది." అని ప్రబోధించెడివారు.

శ్రీ నాయఁడు గారు దైవోపాసకులు. ఏకాంత ప్రార్థనలందును, సమాధియందును, దైవము వారిపై దయజూపెడివాఁడు. ప్రతిదినము ప్రాతస్సంధ్యలయందును, భోజనకాల మందును, పనిచేయునపుడు, బయటికేఁగునపుడు, ఘనుల చరిత్రలు, మొదలగు వానిని గూర్చుండి యాలోచించునపుడు భగవత్ప్రార్థనా స్తవములందు జ్ఞానపూర్ణమగు వారి యుత్తమాంగమవనతమయి యుండెడిది.

కాకినాడ పురములోని యనాథ శరణాలయమందలి పిల్లలముద్దాడి వారలతో నాడి పాడి చాలరాత్రివఱకు నచ్చట గడపి హరినామ సంకీర్తనము చేసికొనుచు శరీరము మఱచి యర్థరాత్రివేళ నిల్లు చేరుచుండెడివారు. ఆదివారపుఁ బ్రార్థనలందును, ఉపదేశములందునుఁ గొన్ని కొన్ని వేళల సమాధి యవస్థ నొందెడివారు. అపుడు వారు కన్నీటిని గార్చి పారవశ్య మొందెడివారు. ఒకసారి "మానకదయఁగావవే తండ్రీ!" యనుకీర్తన నాలాపించుచుండ వారు హఠాత్తుగా సభలో నుద్రిక్తులై ఆచార్యు నాపి తామే ప్రార్థనము సల్పిరి. తదుపరి యాలయమును విడిచి హరినామ సంకీర్తనము చేసికొనుచు వీథులఁదిరిగి స్వృహవచ్చిన పిదప దారిఁదప్పినట్లు గుర్తించి యింటిమొగము పట్టెడువారు. పూర్ణిమారాత్రులం దొంటిగాఁ గూర్చుండి చాలసేపటివఱకు ధ్యాననిమగ్నులగుచుండెడివారు.

1918 లో మహర్షి దేవేంద్రనాథఠాకూరుగారి స్మరణో పాసనాదినమున శ్రీ నాయఁడుగారొనర్చినప్రసంగమును, నివేదించినప్రార్థనమును ప్రార్థనాతురులై పరతెంచిన సాధకుల కీలోకమును విడిచి పరమేశ్వరుని సాన్నిధ్యమును జేరునట్లు పులకాంకితులజేసిరి. అదివరకు శ్రీనాయఁడుగారి భావన బహిర్లోకములో పరతెంచి పర్వతములను, సముద్రమును, సెలయేళ్ళను, పుష్పవనములను పక్షులను, బిడ్డలను పరికించి, పరమేశ్వరుని కావ్యమును పఠించి, తలయూపి పరవశమైనట్లుండెడిది. కాని ఆనాటి ప్రసంగమును వినినప్పుడు శ్రీనాయఁడు గారి దృష్టి యంతరాశములోనికిఁ బోయి, పెనుజీకటికవ్వల యేకాకృతిని వెలిగిపోవు ఆయన తత్త్వములో మునిగిపోయినట్లనిపించినది. అదివరకు శ్రీనాయఁడు గారందరందు కొనగల గురుదేవునివలె నుండిరి. ఆనాఁడు శిష్యుల, సాధకుల, ప్రార్థనాతురుల దాటిపోయిన బ్రహ్మర్షిగాఁ దోఁచిరి. రాత్రివారి ప్రసంగానంతరము మహర్షి దేవేంద్రనాథఠాకూరుగారి స్వీయచరిత్రమునకై యువకులు క్రేళ్ళురుకుచుఁ బరుగెత్తిరి. శ్రీ మొక్కపాటి రామమూర్తి దాని ననువదింపఁ బూనిరి. శ్రీ వేంకటచలము కేశవచంద్ర సేనుల వారి గాథను నాటకముగా వ్రాయ యత్నించిరి. ఒకరు జీసస్సు అరణ్యావాసము హరికథగా వ్రాయ మొదలిడిరి. ఉదయమున ప్రార్థన, మధ్యాహ్నముప్రార్థన, సాయంకాలము ప్రార్థన, నిశీథమున ప్రార్థన, భావనభావనకు, పలుకుపలుకునకు, పనిపనికి నడుమ ప్రార్థనఁ జేయునట్లు శ్రీనాయఁడుగారి ప్రసం

గము విద్యార్థుల రేకెత్తించినది. అట్టి దివ్యశక్తి ఆ ప్రబోధము లందుండెడిది. అట్టిశక్తే శిష్యుల నొక్కొక్కప్పుడు మానవాతీతుల జేయుచుండెడిది.

మతమునెడను భగవంతుని విషయమునను నుదాసీనమయి నిర్లక్ష్యభావముతో రాపడియున్న ప్రపంచమునకుఁగాను నుపాసనావశ్యకతను హెచ్చరించుచు బ్రహ్మర్షిగా రొసంగిన యుపదేశముల సంగ్రహసారమును, వారి ధ్యానసిద్ధానుభవములును, పైని వివరించినట్టిది. ఆయనయందలి యుపాసనాతత్త్వమే, యీశ్వరుని కాయన గావించిన సంపూర్ణాత్మార్పణమే, లోకములో గొప్పగొప్ప బిరుదములను గౌరవములను గాంచినప్పుడుగూడ నణఁగిమణఁగి యనన్యసామాన్యములయిన వినయసౌశీల్యములతో వారు విలసిల్లుటకుఁ గారణమయినవి. దేశీయులు వారిని మహోత్తమవిద్యాధికారిగా గౌరవించిరి. సంస్కారప్రియులు వారిని దక్షిణహిందూస్థానమందలి యుదారసంస్కరణ కర్తయని సంభావించిరి. ప్రభుత్వమువా రాయనకనేకపతకములను, బిరుదములను, గౌరవపట్టములను బహూకరించిరి. పిఠాపురము మహారాజావారు నెచ్చెలిగా, గురువర్యునిగాఁ బూజించిరి. కాని యిట్టిపట్టులన్నిటియందునుగూడ వారు నిరాడంబరముగ నొక్కతీరుగనే వర్తించుచు అబ్రహామ్‌లింకనువలె "నెవరియెడ ద్వేషములేక యందఱియెడ సౌహార్దముగలిగి యసంఖ్యాకములు, దుర్వహములునగు తమవిధులనెల్ల నెఱవేర్చిరి. అనురాగకాంతులతో వెలుంగుచు

దయాప్రేమములు వెల్లివిరియు నుదారహృదయముతో వా రితరుల యపరాధములనెల్ల క్షమించిరి. అట్లయ్యుఁ దను తప్పు లను లోపములను నొప్పుకొని యందుకయి వగచుటకు వారె న్నఁడు వెనుదీయలేదు. తమసహజమాంద్యము మూలమునఁదమ నద్దఁబనిచేయు నౌకరులకుఁ బనివాండ్ర కెప్పుడేమియిబ్బందులు తమవలనఁగలిగి యుండెనోయని వారు పలుమాఱులు విచా రము వెల్లడించెడివారు. వారి ప్రేమస్వరూపమటువంటిది. అం దుచే లెక్కకుమిాఱిన వారిస్నేహితులలో, శిష్యులలో, సను చరులలో నామోదకులలో నొక్కొక్కఁ డెవనిమట్టుకువాఁడే, తానే వారికత్యంతప్రియతముఁడనని తలంచుకొనుచుండెను. దేశము నాల్గుమూలల పెక్కుమందివారిని 'నాయఁడుగారనెడి సుపరిచితనామముతో వ్యవహరించెడివారు. కాని వారిసహచ రులు మున్నగువారికనేకులకు "ఉపాసనాగురుఁడు" ప్రేమాస్ప దుఁడగు తాతయ్య "పెద్దనాయన"గా వారు వ్యవహృతులయిరి. 'తాతయ్య', 'నాయన' యను నీచిన్న తెలుఁగు పలుకులలో వారికి సంబంధించిన ప్రేమసంపద, యనురాగాతిశయము, సమ్మో హనశక్తి, ఆకర్షణప్రభావము, ఎంతెంతగా నల్లిబిల్లిగా నల్లుకొని యున్నవో చెప్పఁజాలము.

---

## 25. బ్రహ్మర్షి

పూర్వకాలమున భరతమాత పవిత్రగర్భమున నెందరో తపశ్శాలులై, బ్రహ్మజ్ఞానసంపన్నులై, జగదుపకారపరాయణు

లైన మహాత్ములు, దేవర్షులు, మహర్షులు, బ్రహ్మర్షులను బిరుదములఁ గలిగి భారతదేశమందు తమ పవిత్రజీవనస్రవంతులఁ బలుతెరంగులఁ బ్రవహింపఁజేసి తోడిదేశీయుల ననేకవిధముల సముద్ధరించి సార్థకనాములగుచుండిరి. వారియోగ్యతచేత నా బిరుదములు వారియెడ సార్థకములయ్యెను. ఈ నాడట్టి బిరుదములు దుర్లభములైనను వంగదేశమున వేదాంత విద్యారహస్య పరిజ్ఞాతయైన దేవేంద్రనాథఠాకూరుగారికి "మహర్షి"యను బిరుదమొసఁగఁబడెను. ఆంధ్రదేశమున శ్రీ రఘుపతి వేంకటరత్నము నాయఁడుగారికి "బ్రహ్మర్షి" బిరుదమొసఁగఁబడెను. ఈబిరుదములీ మహాత్ములయెడల నన్నివిధముల నన్వర్థమైనవని చెప్పుట యతిశయోక్తి కానేరదు.

బ్రహ్మ సమస్తజగత్తునకు ఈశ్వరుఁడు. బ్రహ్మమాటలతో లభ్యముగాఁడు. పొందవలె నన్నంతమాత్రమున పొందుటకు వీలగువాఁడుగాఁడు. ప్రతివానికి ననాయాసముగా లభించు వస్తువునుగాదు. బ్రహ్మ మనపూర్వుల బహుసాధనధనము. సమస్త సంసారమును విసర్జించి, సమస్తజీవితమును త్యజించి నిభృతారణ్యములలో ధ్యానధారణముల గావించి మనఋషులు బ్రహ్మనుబొందినారు. బ్రహ్మను బొందుటకు వా రనేకసాధనలు, భజనలు, ధ్యానధారణములు, త్యాగములు గావించి బ్రహ్మను సాక్షాత్కరింపఁజేసికొనినారు. అట్టిబ్రహ్మను బొందుటకు శ్రీనాయఁడుగారు చిన్నతనమునుండియు ప్రయత్నించినారు. బాల్యమునందే వారిమనఃక్షేత్రమునందు రాజర్షి రాజా రామమో

హనరాయలవారి బ్రాహ్మమతబీజము నాటుకొని కాలక్రమమున నది మహావృక్షమై ఫలించి బ్రహ్మర్షిపదప్రాప్తికి హేతువైనది. శ్రీ నాయఁడుగారి బ్రహ్మజ్ఞానసంపత్తి యపారము. ఉపనిషత్తులు బైబిలు, ఖురాను మున్నగు ననేక సద్గ్రంథములఁ బలుమాఱు చదివిచదివి, యందలి సారమును వారు గ్రహించి గ్రోలిరి. ఆయన బ్రహ్మవాదుఁడు. బ్రహ్మభక్తుఁడు. బ్రహ్మర్పితుఁడు. "ఆత్మరతిః ఆత్మక్రీడః క్రియావానేష" యను సూక్తి ననుసరించి యాయన పరమాత్మయం దనురక్తుడై, పరమాత్మలో క్రీడించువాడై, పరమాత్మ ప్రీత్యర్థమై కార్యముల గావించి నారు. "బ్రహ్మవాన్ బ్రహ్మైవ భవతి" ఆయన బ్రహ్మర్పితజీవి. ఆయన బ్రహ్మయందు జీవించెను. బ్రహ్మయం దానం దించెను. బ్రహ్మతో విహరించెను. బ్రహ్మచెంత నాసీనుడా యెను. లేచునపుడు బ్రహ్మతో లేచెను. నిద్రించునపుడు బ్రహ్మతో నిద్రించెను. భుజించునపుడు బ్రహ్మతో భుజించెను. పఠించునపుడు బ్రహ్మనుగూర్చి పఠించెను. చూచునపు డందఱి యందును బ్రహ్మను దర్శించెను. చేయునపుడు బ్రహ్మకార్య ముల గావించెను. నడచునపుడు బ్రహ్మవైపునకే నడచెను. కూర్చున్నప్పుడు బ్రహ్మయొద్దనే కూర్చొనెను. సమస్తము నం దును బ్రహ్మానంద రసానుభూతితో బ్రహ్మసాక్షాత్కారమునుఁ బొంది ధన్యుఁడైనాడు. బ్రహ్మజ్ఞానోపదేశముఁ జేయునపుడు వారి వాగ్ధోరణి వర్ణనాతీతము. ఆశబ్దప్రయోగ చాతుర్యము నకు సభాసదులు సమ్మోహితులు కాగా, వారి మనస్సులు

కరిగిపోయెడివి. ఆంగ్లేయ భాషయందాయనకు గల పాండిత్యము సామాన్యముగాదు. మహావక్త. అందుచేత నేడీయాంధ్ర దేశమున గల ననేకమంది యువకులాయన యుపదేశబలమున బ్రహ్మమతావలంబకులై, వారిని గురుదేవులని భజించుచుండిరి. ప్రార్థన మన్న వారికత్యాందాభిమానము. సర్వము పరమేశ్వరాయత్తమని భావించు చుండెడివారు. ఏపని తలపెట్టినను "D.V."(Deo Volente) Divine Vouchsafe-God willing "ఈశ్వరేచ్ఛ గలిగినపక్షమున నేనుఁ జేసెద" నని యనుచుండువారు. వ్రాయుచుండువారు. వారు పరమభాగవతోత్తములు.

మహాపురుషుల గూర్చి యెన్నోప్రాంతములఁ దిరుగవచ్చును. ఎందరిపెద్దలనో దర్శింపవచ్చును. ఎందరిసాధకులనోఁ గలిసికొనవచ్చును. కాని ఎవరినిదర్శించినను, ఎవరిని కలిసికొనినను శ్రీనాయఁడుగారిని దర్శించినప్పుడు, కలిసికొనినప్పుడు కలిగిన ఉత్తేఃముగాని; రసానుభవము గాని యుండదు. ఆయనను దర్శించిన అప్రేమకులకు ప్రేమోదయమగును. నిర్దయులకు దయారసముప్పొంగును. కఠినులకు కరుణాస్రోతము స్రవించును. గుణవిహీనులకు సుగుణసంపద యలవడును. వారి జీవితము భక్తిరససింధువు. అనాథలకు పట్టుకొమ్మ. భక్తులకు నమరగానము. సాధుసత్తముఁడు. అట్టిమహద్గుణములతో బ్రహ్మమయ జీవితమును జీవించి బ్రహ్మర్షియైనాడు.

మహాపురుషులు భవిష్యత్కాలమునకుఁ జెందినవారు. వారు నేడేది నుడువుదురో యుగయుగాంతములవరకు ఆమధు

మయవాక్కులే ప్రతిధ్వనించుచుండును. మహానుభావుల దివ్య నేత్రములకు భవిష్యత్కాలము వర్తమానకాలమగును. వారి జీవితకార్యములు, చింతనములు, భావములు, భావనలు, ఆదర్శములు సమస్త మానవజాతికి సమస్తవిశ్వమునకు, సకల యుగములకు చెందినవై యుండును.

అట్టి బ్రహ్మజ్ఞానికి సప్తతి తమ (డెబ్బదియవ) జన్మ దినోత్సవ మాసన్నమైనది. 1932 మహర్నవమినాడు పీఠికాపురపు కోట దీప్తులతో దేజరిల్లినది. దేశదేశములనుండి శిష్య ప్రశిష్యులేతెంచిరి. పీఠికాపురములోని హైస్కూలుభవనము కారొనేషను విశ్రాంతి భవనము-ఆదిమాంధ్రాశ్రమములు, ప్రాథమిక పాఠశాలా భవనములు, వేయేల, కాళీపడియున్న ప్రతియిల్లు నతిథులతో నిండిపోయెను. బొంబాయినుండి బ్రహ్మవేత్తలు, పూనానుండి బ్రహ్మప్రచారకులు; ఢిల్లీనుండి బ్రహ్మనంద రసపానాసక్తులు, మదరాసునుండి బ్రహ్మప్రబోధకులు ఆంధ్రదేశములోని పీఠికాపురమునకు తండోపతండములుగా నేతెంచిరి. నగరసంకీర్తనములు, భజనలు, ప్రార్థనలు— ఆరాధనలు — ప్రసంగములతో అష్టమిదినము గడచినది. నవమినాటి యుదయమున పిఠాపురము మహారాజావారి కోటలోని ప్రార్థనామందిరము కిటకిటలాడినది. కలకత్తానుండి యేతెంచిన పండిత సీతానాథ తత్త్వభూషణులు ప్రార్థనముగావించిరి. తదుపరి శ్రీనాయడుగారి ప్రార్థనతో నందరి హృదయములు ద్రవీభూతములైనవి. "నేనుపాపిని-నేను

పాపిని" అని యాయన పదేపదేయుచ్చరించి నపుడు ప్రతి వాని హృదయమును జల్లుమనినది. కన్నీటిధారలజస్రముగా నందఱి కన్నులనుండి ప్రవహింపసాగినవి. ప్రార్థనానంతరము శ్రీ మహారాజావారు, నాయఁడుగారి శిష్యులు, శ్రీనాయఁడు గారికి ప్రణామములాచరించిరి. విందులయనంతరము సాయంకాలము నాల్గుగంటలకు తిరిగి కోటలో మహాసభ యేర్పాటు గావింపబడెను. వృద్ధు, బుద్ధులబృహస్పతియు నగు శ్రీపండిత సీతానాథ తత్త్వభూషణులగ్రాసనాధిపతులు కాగా వారిప్రార్థన తోడను, తదనంతరము శ్రీనాయఁడుగారి ప్రార్థనముతోను నాటి సభ ప్రారంభమైనది. రాజప్రతినిధి, మదరాసుగవర్నరు, మదరాసు ఆంధ్రయూనివర్సిటీవారు తమసందేశముల నందిచ్చిరి. జగదీశచంద్రవసు, డాక్టరు పి. సి. రే., యదునాథ సర్కారు, నీలరతన సర్కారు, వ్రజేంద్రనాథసీలు, వాస్వానీ, రవీంద్ర నాథఠాకూరు మున్నగు మహాపురుషులయు, డాక్టరు డ్రమండు, సౌత్ వర్తు, సండర్లాండు మున్నగు పాశ్చాత్యమహనీయులయు నభివందనములు జదువబడినవి. వేంకటపార్వతీశ్వర కవులు, దాసరి లక్ష్మణస్వామి మున్నగువారు శ్రీనాయఁడుగారిని గూర్చి ప్రశంసాపద్యములఁ జదివిరి. వేదాంతవిద్యావాగీషు,సతీశ చంద్రచక్రవర్తి, మున్నగువారలు ప్రసంగించిరి. దక్షిణయిండియా బ్రాహ్మసమాజమువారి యాజమాన్యమున యావద్భారతదేశ బ్రాహ్మసమాజముల వారు, మాననీయులు, తత్త్వసంపన్నులు, దీనజనమందారములు- ఆశ్రితకల్పములు-గురుదే

వులు,జ్ఞానసింధువు, బ్రహ్మజ్ఞానులునగు శ్రీనాయఁడు గారికి మంగళతూర్యారావములమధ్య,జయజయధ్వానములుపిక్కటిల్ల గురుదేవులకు జరుగు సత్కారసభనుఁ జూచి యానందపులకితులై యశుపులరాల్చు శిష్యుల కోలాహలముమధ్య యదార్థబ్రాహ్మికజీవనమును గడపిన శ్రీనాయఁడు గారికి "బ్రహ్మర్షి" యనుబిరుదము ప్రసాదింపబడినది. శ్రీనాయఁడుగారి కన్నీటితో తగు సమాధానము నొసంగిరి. మంగళగీతముతో నాఁటి సభ ముగిసినది.

---

## 26. బ్రహ్మసమాజసేవ

1927 వ సంవత్సరమునుండియు కాకినాడ బ్రహ్మసమాజము బ్రహ్మోపాసనామందిరము నుపయోగించుటనుగూర్చియు నితరవిషయములనుగూర్చియు సామాజికులలో భేదాభిప్రాయములుండుటవలనను,నితరకారణములవలనను నాకాలపు సామాజిక జీవన ముత్సాహజనకముగా లేదు. 1928మదరాసువిశ్వవిద్యాలయోపాధ్యక్ష పదవిని విరమించిన పిదప బ్రహ్మర్షి పిఠాపురములో నివాసమేర్పరచుకొని సమాజములపురోభివృద్ధి నరయుచుండిరి. 1932 వ సంవత్సరమునుండి బ్రహ్మర్షి కాకినాడలోనుండి సమాజజీవితమును పునరుజ్జీవింపఁజేసిరి. 1932 వ సంవత్సరమున డిశంబరు 3 వ తేదీని జరిగిన సాధారణ సభ్యసమావేశములో సమాజ పునర్నిర్మాణమునకు కొంత ప్రయత్నముజరిగినది. ఈ

పునర్నిర్మాణము నందరు వాంఛించుచున్నను నందర నొక చోటగూర్చి నిలుపగలశక్తి యేదో కావలసియుండెను.

### రాజర్షి రామమోహనరాయలవారి శతవార్షికోత్సవము

1933 వ సంవత్సరమున దేశదేశములతో బాటు యాంధ్రదేశమును, నాంధ్రదేశములో కాకినాడయు, రామమోహన శతవార్షిక స్మరణోత్సవము మహావైభవముగాఁ జరిపినది. నిజమున కీమహోత్సవము నాంధ్రసీమయంత యుత్సాహముగా మరి యేదేశమును గావించినట్లులేదు. ఉత్సవమునకు కొంతకాలము ముందుగా జ్ఞానాంబగారు, నాభి జగన్నాథరావుగారు, ద్రోణము రాజరామమూర్తిగారు, రొక్కము బాలకృష్ణారావుగారు బరంపురమునుండి మదరాసువరకు ప్రయాణముజేసి రామమోహనుని జీవితసందేశమునుగూర్చి పరిబోధించుచు, రాబోవు యుత్సవము నాయా గ్రామములలో జరుప నచ్చటిప్రముఖులను హెచ్చరిచిరి.

ఇక కాకినాడలో శ్రీ బ్రహ్మర్షి గారధ్యక్షులుగా, శ్రీ కొండపల్లి కల్యాణస్వామిగారు కార్యదర్శులుగా నొక యుత్సవసంఘ మేర్పడినది. రామమోహనునిగూర్చి రచింపబడిన రకరకముల కరపత్రములతోఁ గొందఱు ప్రచారకులుగా బయలుదేరి ఈ మండలములోని యనేకగ్రామములకుఁబోయి రాయలవారిగాథలను సందేశమును గ్రామవాసుల కెఱింగించి సెప్టెంబరు 27 వ తేదీని స్మరణోత్సవమును వారే చేయునేర్పాట్లు ముందుగనే గావించినారు.

కాకినాడలో నుత్సవోత్సాహమునకు మేరయే లేదు. ఈ యుత్సాహమునకు వృద్ధులైన గురుదేవుడే యాలంబముగానిలిచి పిఠాపురమునుండి ప్రతిదినమువచ్చుచు రేయుంబవళ్ళు కార్య కలాపము సాగించుచుండిరి. ఇక కల్యాణస్వామిగా రవిశ్రామ ముగఁ బనిచేయుచునేయుండిరి. ఇక యుత్సవదినములలో సహస్ర విద్యుద్దీపములతో నలంకరింపబడి తారావిమానమువలె నున్న యుపాసనామందిరమునుఁ జూచుటకు బరిసరగ్రామవాసులు తండోప తండములుగా యర్ధరాత్రమువరకు వచ్చుచుండెడివారు. కళాశాల శరణాలయము మున్నగునవిగూడ విద్యుద్దీపములచే నలంకరింపబడినవి. ఈయుత్సవమును బురస్కరించుకొని బ్రాహ్మ సమాజమువారితోగూడ అన్నదానసమాజమువారు, మల్లాది సత్యలింగనాయకరుసత్రపునిధి ధర్మకర్తలు బీదల కన్నదానము జేసిరి. భజనలు, ఉపాసనలు, ఉపః కీర్తనలు, నగరసంకీర్తనములు నవజీవమిచ్చినంత జేగీయమానముగా జరిగినవి. మహాసభలకు మందిరము చాలనందున యుత్సవపు ప్రధానదినమున సభ మందిరబహిరావరణములో బ్రహ్మర్షి సభాపతిగా సమావేశమైనది. ఈసభలోమహన్మదీయ, క్రైస్తవసోదరులుగూడ పాల్గొనిరి. ఇతరగ్రామములనుండి చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారు, మామిడిపూడి వెంకటరంగయ్యగారు, నరసింహదేవర సత్యనారాయణగారు, జటావల్లభుల పురుషోత్తంగారు మున్నగువారువచ్చి యుపన్యసించిరి. రామమోహానునిగాథలతో నపరిచితులైన గ్రామవాసులకు సమాజసభ్యులా మహాపురుషుని జీవితముయొక్క

సమగ్రవికాసమును విశదపరచుచు మాటలాడినప్పుడును, వివిధో ద్యమములలో కృషి జేయుచున్న యాంధ్ర ప్రముఖులు బెక్కండ్రు నవభారతపితామహుని కీర్తించునప్పుడును, దినదినమును ప్రతి పత్రికలో దేశ దేశములలోని వివిధజాతులలోని మతముల లోని, యుద్యమములలోని ప్రముఖులా యుగపురుషుని ప్రాభ వమును ప్రశంసించిన విధమును జదివినప్పుడు నిదివరకు కొంత యభిమానముతో నారాజర్షి రామమోహనుని స్తుతించుచున్న ప్రతివారిమనస్సులు మ్రోలనతఁడు దన సమగ్రప్రతిభతో ప్రత్య క్షమైనట్లాయెను. ఈ యుత్సవదినములలో కళాశాలలోని యాదియాంధ్రవిద్యార్థులకు "రామమోహనవసతిగృహము"ను శ్రీ బ్రహ్మర్షి గారుఁ దెరచిరి.

అనేక పట్టణములనుండి వేంజేసిన బ్రాహ్మలతో, నితర సోదరులతో సాగించిన ఈ మహోత్సవము కాకినాడ సమాజ పునర్నిర్మాణమున కెంతయో సహకారియయ్యెను. ఆయుత్సవ దివసములనుండి బ్రహ్మర్షి ఈనగరముననేఁ దఱచుగా వసించుట వలనను సామాజికులు యితరులుగూడ సమాజమున కాకర్షిం పబడుచుండిరి. బ్రాహ్మమత ప్రచారముతో ఆరియు దేరిన వృద్ధమూర్తి, శరీరము ముదిసినకొలది హృదయతారుణ్యము తో భాసిల్లినవాడు, ధర్మాగ్ని నవనవోత్సాహములోన ప్రజ్వరి ల్లినకొలది శరత్కాసారమువలె శాంతముతో నున్న సాధు శిరోమాణిక్యమైనప్రియతమబ్రహ్మర్షి యొక్క 73వ జన్మదినోత్స వమును, 1935 లో నత్యంతసంతోషముతో జరిపిరి. బ్రహర్షి

యునికితో సమాజసభ్యులలో నుత్సాహమధికమై స్త్రీలసభలతో, కుటుంబోపాసనలతో, సంగత్సభలతో, గీతోపాసనతో నెల్లప్పుడు మందిరము దెఱువబడియే యుండెడిది. వృద్ధులైన బ్రహ్మర్షి తమకాలము నెక్కువగ నిక్కడే గడపుచుండిరి.

బ్రహ్మర్షి ప్రియతమానుచరుడై, అస్ఖలితబ్రహ్మచారియై బ్రాహ్మబంధువై, అనివార్యసాధకుడై పండితోత్తముడై సమాజమునకు 25 సంవత్సరములు సేవజేసిన వేమూరి రామకృష్ణారావుగారియొక్కయు; బ్రహ్మర్షి యాశయములను బ్రహ్మసిద్ధాంతములను సుస్థిరముగా హృదయములో ప్రతిష్ఠించుకొని కార్యనిర్వాహణమున వారికి తోడునీడయై, ప్రియతమశిష్యుడై బ్రాహ్మమతవ్యాపనమున కనవరత సహాయము వర్షించిన దివాకర్ల వేంకటసుబ్బారావు నాయఁడుగారియొక్కయు షష్టిపూర్త్యుత్సవములు జయప్రదముగా జరిగినవి. వాటిలో బ్రహ్మర్షి పాల్గొనిరి.

1936-37 సంవత్సరమున బ్రహ్మర్షిగారి ప్రేరణము వలన యాస్తికయువజన సంఘము పునరుద్ధరణమాయెను. ఆసంవత్సరములో జరిగిన రామమోహన స్మరణోత్సవములో యాస్తికయువకులే బీదలకు వస్త్రదానము, అన్నదానములు గావించుటయేగాక నవభారత పితామహునిగూర్చి విద్యార్థులచే పోటీగా నుపన్యాసము లిప్పించియు, వ్యాసములవ్రాయించియు గెలుపొందినవారికి బహుమతులిచ్చుటయు జరిగెను.

ఈ సంవత్సరముననే రామానంద ఛటర్జీబాబు వచ్చి రాజమహేంద్రవరములో నాధునికాంధ్ర జాతీయనిర్మాత శ్రీ వీరేశలింగముగారి శిలాప్రతిమా ప్రతిష్ఠాపనము జేసిరి.

ఈ యుగారంభము నుండియు ప్రముఖులు పూజ్యులు నగు శ్రీ కల్యాణస్వామిగారీగ్రామముననే నివాసమున్నారు. "సాధనపత్రిక"ను నడిపించుచు, వివిధమతసమావేశమునుగూర్చి సమాజయుద్యమమునకై యెడతెగని కృషిజేసినారు. ఈయుగారంభమున అమెరికాలో మతశిక్షనుబొంది విద్యాపట్టములను గూడ సంపాదించి పండితుడై తిరిగివచ్చిన ప్రచారకవర్యుడగు ఇప్పగుంట సుబ్బకృష్ణయ్యగారికి మందిరములో పురప్రముఖులు స్వాగతమిచ్చిరి. ఈయుగములో పూజ్యురాలు బ్రహ్మధర్మప్రచారకురాలు, తపస్విని జ్ఞానాంబగారిచటనే యుండి సమాజములోను సభ్యులలోను నూతనోత్సాహమునుఁ బురికొల్పిరి. అప్పుడే కాకినాడ బ్రహ్మసమాజ స్వర్ణోత్సవ మత్యంతోత్సాహముతోఁజరిగినది. దానిని బురస్కరించుకొని యాంధ్రాస్తిక మహాసభనుగూడ కాకినాడసమాజము వారాహ్వానించినారు. ఆరెండు సభలకును శ్రీ బ్రహ్మర్షిగారే యధ్యక్షులై యుత్సాహముతోను నానందముతోను దిగ్విజయముగా జరిపినారు. 1939 సంవత్సరమువరకు వారు కాకినాడబ్రాహ్మసమాజమునకధ్యక్షులుగా నుండి దానిని నడుపుచుండిరి.

## 27. నిర్యాణము

"జాతస్య మరణమ్ ధృవమ్" అను నార్యోక్తిననుసరించి పుట్టినవానికెవ్వనికిని జావుతప్పదు. కాని జన్మముయొక్క రహస్యము నెఱిఁగి జీవించు వానిజీవితకాలమొక క్షణకాలమైనను యాచంద్రార్కమై నిలుచును. మహాపురుషులు గతించినను పరమాత్మ నాత్మజ్యోతిగా గుర్తించి, జీవించి, ప్రబోధించువారి యుపదేశములు, ప్రసంగములు శాశ్వతములై నిలుచును. ఎన్ని యుగములు గతించినను వారల దివ్యప్రబోధములు చెవిసోకినంతనే యజ్ఞానతమస్సుచే నావరింపఁబడు జీవి, జ్ఞానజ్యోతినిగాంచి ధన్యుఁడగును.

బ్రహ్మర్షి వేంకటరత్నముగారు సతతము నీశ్వరపాదారవిందముల నవిరళభక్తితో నారాధించి తరించిన భక్తులు. అమోఘ త్యాగానుభవముతో తోడిజీవరాసుల కెనలేని సహాయ సంపదలనొనర్చి, నమ్రతతోఁదలవంచి, పరమేశ్వరునాజ్ఞల నెదనెంచి, తనజీవనజ్యోతిని వెలిగించి,నివ్వాళిగా నర్పించి యాహుతియైన ధన్యజీవి.

బ్రహ్మర్షి కప్పటికి డెబ్బది యారేండ్లు నిండినవి. 1938వ సం॥ అక్టోబరుమాసమున శ్రీ బ్రహ్మర్షి 77 వ జన్మదినోత్సవముత్సాహ ప్రదముగజరిగెను. అది జరిగిన వారము రోజులకు వారికి దృష్టిమాంద్యముకలిగినది. క్రమక్రమేణ నదిప్రబలి వారంధప్రాయులైరి. వారి కద్దైర్యము మెండయ్యెను. మనియా

ర్దరుఫారములఁ దెప్పించి స్వయముగా లిఖించి తమపై నాధారపడి యుండు, ననంఖ్యాకులగు ననాథులకు, హరిజనులకు, పంపు నదృష్టమిక లేదని భావించిరి. ఇక తాముబ్రతికిలాభము లేదను కొనిరి. ఈ దిగులుతో శరీరారోగ్యముగూడ చెడిపోజొచ్చెను. అంతకంత కది కఠినరోగమునకు దారిదీసెను. నిశ్చలమయిన దైవచింతనముగల యీ భక్తవరేణ్యుఁడు తనచరమదశలో చాలబాధ ననుభవించెను. అప్పటికిని వారిజీవనము, మనఃస్థితి, సంచలనము పరమేశ్వరునియందే లగ్నమయి యుండెడివి. జగత్కర్తతో సంతత సంబంధసాహచర్యములు గలిగినట్లుగా వారు గోచరించుచుండిరి. వారిసతీమణిని, ఏకైకపుత్త్రిని దమజీవితము యొక్క ప్రాథమికావస్థయందే గోల్పోయి శారీరకష్టముల జాలగ ననుభవించినను దానియుదృతము నిప్పుడు హెచ్చుగా వారనుభవించిరి.

తమ పరిస్థితినిగూర్చి శ్రీ పీఠికాపురాధీశ్వరులకు లేఖ ద్వారా దెలియజేయగా వారు మిగులవిచారించి,పిఠాపురమే తెంచి శ్రీబ్రహ్మర్షికి ధైర్యోత్సాహములు జెప్పి యుత్తమచికిత్సకై మదరాసు రమ్మనిచెప్పి వెడలిపోయిరి. శ్రీవారి యానతిని శ్రీబ్రహ్మర్షి మదరాసునకు వైద్యచికిత్సకై గొంపోబడిరి. ఎన్నిచికిత్సలుచేసినను లాభములేకపోయెను. శ్రీ మహారాజావారిని, శ్రీ దివాను గారిని తొందఱపెట్టి తమకత్యంత ప్రేమస్థానమైన కాకినాడపురమునకు 17-2-1939 సం॥న జేరిరి. నానాటికి రుగ్నత హెచ్చుకాజొచ్చెను.

మానవలోకమున కాదర్శమయినయీమహాపురుషుఁడు విశ్వాసపాత్రుఁడైన భగవత్సేవకుఁడు నీశ్వరచింతనాపరుఁడు తన కడపటి దశలో జబ్బుజేసినప్పుడు గూడ కొన్ని బాధలకులోన గుట యాశ్చర్యముగ దోచును. కాని యెన్నికష్టములు ఘటి ల్లినను, వారెప్పుడును చలింపక ప్రాణావసానము వఱకుగూడ జగజ్జనకుఁడగు పరమేశ్వరుని యందఖండ విశ్వాసముతో జరించిరి.

వారు కాకినాడకే తెంచినది మొదలు ప్రతి సాయంకా లము శ్రీ కళ్యాణస్వామిగారు, శ్రీ వి. పి. రాజుగారు ఈశ్వ రప్రార్థనలఁ జేయుచుండిరి. శ్రీ ఎండమూరి వేంకటరమణ గారు శ్రీ బ్రహ్మర్షి కోరికపై భాగవతమును జదువుచుం డిరి. హరిజనసోదరుడు శ్రీ నక్కా లక్ష్మణస్వామి మందులిచ్చి నిరంతరమచటనే సేవజేయుచు కాలముఁబుచ్చుచుండెను. కళా శాలలోని యుపాధ్యాయులు, సమాజసభ్యులు, శరణాలయ బాలబాలికలు వారికి సేవలొనర్చుచుండిరి. అల్లుడు శ్రీ గోవింద రాజులుగా రెల్లప్పుడు ప్రక్కను వీడక సపర్యలాచరించుచుండిరి. శ్రీ దివాను కోకా వేంకట సుబ్బారావు నాయఁడుగా రాత్రముతో పిఠాపురమునుండి బసగెత్తుకొనివచ్చి సకల సమ సాయములను జేయుచుండిరి. తత్వజ్ఞాని శ్రీ రామకృష్ణారావుగారు రెక్కలు కట్టుకొనివచ్చి గుహూత్తమునిస్థితికి వగచి యెల్లప్పుడు వారి చరణతలముకడ గూర్చుండి భగవదారాధనములో కన్నీరు మున్నీరుగాగార్చుచుండిరి. శ్రీ బ్రహ్మర్షి గారి కుమార్తెలు

అల్లుండ్రు శిష్యులు, బంధువు లప్పుడప్పుడు వచ్చి చూచిపోవు చుండిరి. వారి యాజ్ఞానుసారము శ్రీ నేరెళ్ళ నారాయణ శర్మ ఉత్తరముల వ్రాయుచుండెను. దినదినము శ్రీ బ్రహ్మర్షి రుగ్మతను గూర్చిన విషయములు శ్రీ మహారాజావారికి, లేఖ మూలమున నందజేయ బడుచుండెను. డాక్టరు వి. సుందరేషు యం. బి. బి. యస్. డాక్టరు ఇవటూరి జోగారావు యం. బి బి.యస్. ఒకరిని విడిచి మరియొకరు బంగాళాకువచ్చి బ్రహ్మర్షి ఆరోగ్యమును జూచుచుండిరి. డాక్టరు పి. సన్యాసిరావు యల్. యం. పి. కంటివైద్యము జేయుచున్నను నానాటికి శ్రీ నాయఁడుగారి శక్తి యుడుగఁజొచ్చెను.

పండ్రెండు సంవత్సరముల క్రిందట ఆ రాత్రినాటి దృశ్యమును స్మరింతము. కాకినాడలోని శ్రీ పీఠికాపురాధీశుల యొక్క సూర్యరాయ బంగళాభవనమునందలి యొకమందిరాంతర్భాగమున, నిశీథసమయమున శ్రీ రఘుపతి వేంకటరత్నము నాయఁడు గారు మృత్యుశయ్యాయందుండిరి. అనంతచతుర్థశీ పూర్ణచంద్రుఁడు జ్యోత్స్నావర్షమును గురిపించుచు గగనమండలమును ప్లావితముఁ జేయుచుండెను. గృహాభ్యంతర భాగమున నీ మహాత్ముడు స్వీయదేహము కడ కడసారి సెలవుగైకొనుచుండెను. అల్లుడు గోవిందరాజులాయన చేయిపట్టుకొని కూరుచుండెను. ఆయనకు విశేషశ్రద్ధాభక్తులతో సేవచేసియుండిన పుత్రసమానుఁడు నక్కా లక్ష్మణస్వామి, శిష్యులు రామకృష్ణారావు, కోకా వేంకట సుబ్బారావునాయఁడుగారలును, డాక్టరు

జోగారావుగారును, శరణాలయ బాలబాలికలును, కళాశాలో పాధ్యాయులును నిశ్శబ్దముగా నశ్రువులనురాల్చుచుండిరి. దేహ స్మారక మున్నంతవరకు, మహాత్ముండగు శ్రీ నాయండుగారు తమ్మెంతో ప్రేమతో నాదరించి సేవజేసిన వారియెడ కృతజ్ఞ తాసూచకములగు నొకటిరెండు మాటలనుడువుచుండిరి. మే నెల 26 వ తేదీవచ్చినదాయని యడుగుచుండిరి. చిరకాలా భ్యస్తమగు ప్రణమమంత్రమును "ఓమ్, ఓమ్, ఓమ్" యని గంభీరస్వరముతో నుచ్చరించుచుం జేతులమోడ్చెను. స్పృహ దప్పుచుండెను. ప్రాణవాయువునిచ్చు గొట్టముల నాసికారంధ్ర ముల నుంచిరి. ఈ విధముగా రాత్రి 1 గంట 30 నిమిషముల కా మహాత్ముండు కడసారి నిట్టూర్పు విడిచెను. డాక్టరు రామ కృష్ణారావుగారు గొల్లుమనిరి. దివాను కోకా వేంకట సుబ్బా రావునాయండుగారు నిశ్శబ్దముగా కన్నీరుగార్చిరి. బంధు బాంధ వులు, ఆప్తులు, శరణాలయ బాలబాలికలు, కళాశాలోపాధ్యా యులు నెడతెగని స్రవంతివోలె కన్నీటిని విడచిరి. యావ దాంధ్ర దేశమువిచార సాగరమున మునిగిపోయెను. తంతివార్తల ద్వారా శ్రీ మహారాజావారికి, శ్రీ నాయండుగారి ముఖ్యుల కీ విషాద వార్తయందంజేయబడెను. యావదాంధ్రము కొంతసేపు నివ్వెరగంది నిశ్చల భావము నందెను.

బ్రహ్మర్షి విశ్రాంతి గైకొనిరి. ఆంధ్ర దేశమందలి యా వృద్ధబ్రహ్మర్షి యికలేడు. శ్రద్ధాళువులగు వేలకొలది శ్రోతలను గంభీరవాక్ప్రవాహములచే స్తంభీభూతులగావించిన యాతని

యధరములు చల్లబడినవి. పరుల దుఃఖములజూచి పరిపరిగతుల సంచలించిన యా దయాహృదయముయొక్క స్పందనమాగి పోయినది. నిజాలింగన సౌఖ్యముచే దుఃఖాగ్ని పరితప్తులనేకు లకు చల్లదనము గలిగించిన యావక్షః ప్రదేశము చల్లబడిపో యినది. ప్రార్థనామందిరమున భగవత్ప్రార్థనకు చేతులెత్తుకొని యుపాసకు లనేకుల నాదేశించిన యా హస్తమిక నచ్చటఁగాన రాదు. బాధితులకు, నిమ్నజాతీయులకు, నభయమిచ్చి యాశా సందేశమొసంగిన యావాణి మనకికవినరాదు. అయినను మన కు గానరాని కారణమున వారు నిజముగా మరణించిరని, మన కంటికి, అనుభవమునకు తోఁచుచున్నను, వారిని నిండారప్రేమిం చిన మనహృదయములట్టి మహానుభావుఁడు మరణింపఁడని, యా యనకు మరణముండనేరదని యూఅటనొందగలవు. వారి భౌ తిక శరీరమునేడు మన కదృశ్యమయినను, ఆ ప్రేమ స్వరూపుని మనము తలంచినప్పుడు మనహృదయములు వారిప్రేమాదర స్మృతులచేనిండి తత్సాహచర్యానందాతిశయ జ్ఞప్తిచేనుప్పొంగు నప్పుడు వారు సజీవులయి పూర్వమువలెనే మనదెస నిరీక్షిం చుచు, నుదోభదించుచు, వారికి ప్రియతమమయిన యీ పట్టణ వాతావరణము నల్గడల వ్యాపింపజేయుచు కళాశాల,అనాథశర ణాలయ బ్రహ్మోపాసనామందిరపాంసువులఁ బవిత్రమొనర్చుచు న్నట్లు మనకు గోచరించుచునేయుందురు.

ఆయనకై నెందఱెందరో కన్నీళులజాలువార్చుచున్నా రు. బహుశః మనలో నెందఱమో వారికి నొప్పిగలిగించిన

మన తప్పిదములకు, నపరాధములకు వగచుచున్నాము. వారిని గ్గమనాఘాతమువలన పలువురము నిశ్చేష్టులమయితిమి. వారు నిండారిన వయస్సులో పరమపదించినను వారి యెడబాటును సహింపనేరని మన కదియకాల మరణముగనే తోచి వేదనగలిగించుచున్నది. ఇప్పట్టునగీతయందలి యర్జునవాక్యము నెలుగెత్తి పఠింతముగాక.

"పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః। ప్రియఃప్రియాయార్హసి దేవ! సోఢుమ్". తండ్రి బిడ్డనివలెను, మిత్రుడు నెచ్చెలిని బలెను, ప్రియుడు ప్రియురాలు నట్లు దేవా! మమ్ము రక్షింపనీవే శరణము."

బ్రహ్మర్షి విషాదమరణవార్తను వినగానే కవిసార్వభౌమ శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారు రాసువుగా నీక్రింది పద్యమును జదివి పత్రికల కంపిరి.

క. సర్ రఘుపతి వేంకటర
త్నరమ్యగుణసాంద్ర! పండితవరా! దీనో
ద్ధరణనిపుణ! బ్రహ్మర్షీ!
ధరలో నీతోనే చెల్లె ధర్మము తండ్రీ!

---

## 28. అంత్యక్రియలు

బ్రహ్మర్షి బ్రహ్మలోకావాసమునొందిన క్షణమునుండి మధ్యాహ్నము 3-గంటలవరకు బంగళాలో నీశ్వరభజనలుఁ జరు

పబడెను. 3 గంటలకు "ఓనాథనీగుణ" మను కీర్తనపాడినఁ బిదప బ్రహ్మర్షి శిష్యుడు శ్రీ పెద్దాడ రామస్వామిగారీశ్వరోపాసన ముగావించిన బిదప నందఱు గొల్లుమని యేడ్చుచుండ బ్రహ్మర్షి భౌతిక దేహము నొక పేటికయందు భద్రపరచి నూరేగింపుతోఁ రుద్రభూమికి గొంపోబడెను. వారియాప్తులు, శిష్యప్రశిష్యులు, అల్లుండ్రు, కుమార్తెలు, శరణాలయ బాలబాలికలు, సామాజికులేగాక వేలాదిప్రజలు, పురప్రముఖులు నూరేగింపుతోఁ పాల్గొని వెంటరాగా బ్రహ్మర్షి భౌతిక దేహము పిఠాపుర రాజావారి భవనమునుండి ముందుగా వారికత్యంత ప్రేమ పాత్రమైన బ్రహ్మోపాసనా మందిరమునకు గొంపోబడెను. అచ్చట శ్రీ కల్యాణస్వామి గారీశ్వరోపాసనగావించిరి. ప్రార్థనానంతరము పిఠాపురము రాజావారి ఆర్ట్సు కళాశాలాభవనముచెంతకు చేరగా నచట శ్రీ బి.రక్షితుగారు ప్రార్థన గావింవించిరి. కళాశాలమీదుగా శరణాలయమునకు గొనిపోవు నపుడు మార్గమధ్యమున ప్రార్థనలుజేయబడెను. శరణాలయములో శ్రీ కట్టి సత్యనారాయణగారు ప్రార్థన గావింపుచుండ బిడ్డలు దమ పెదనాయనను గోల్పోయి వాస్తవముగా ననాథలుకాగా, బావురని యేడ్చుచుండ నచటజేరిన యావదాంధ్ర ప్రజానీకము కంటఁదడిపెట్టిరి. తదుపరి బ్రహ్మర్షి శరీరమును రుద్రభూమికి తీసికొనిపోబడెను. రుద్రవాటికలో పురప్రముఖులు శ్రీ యుతులు లాల్ మహమ్మదు, జి. యే. శామ్యూలు, సి. రంగనాయకులు, మల్లిపూడి పళ్ళంరాజు,

లక్కరాజు సుబ్బారావు, చావలి రామసోమయాజులు, జయంతి గంగన్న గారలు శ్రీ బ్రహ్మర్షి గుణగణములను జీవితవిశేషము లను గూర్చి ప్రసంగించిన తదుపరి శ్రీనాభి జగన్నాథరావుగారు తుదిప్రార్థనముగావింప, నంతసేపు బ్రహ్మర్షి పాదపీఠముచెంత ముకుళితహస్తుడై యీశ్వరధ్యానముజేయుచు కన్నీటినికార్చు చున్న బ్రహ్మర్షి ప్రియతమ శిష్యుడు రామకృష్ణారావు పండి తులు ఆవేదనతో నుత్తోత్తుగలేచి ప్రార్థనముగావించి చితికి ముమ్మారు ప్రదక్షిణముగావించి బ్రహ్మర్షి ధర్మపత్ని, తమ గురుపత్నియులగు శేషమాంబగారి ఛాయాచిత్రమును బ్రహ్మర్షి హృదయపీఠమునందుంచగా, బ్రహ్మర్షి ప్రియతమానుచరుడు దివాను కోకా వేంకటసుబ్బారావునాయఁడుగారు నిశ్శబ్దముగా కన్నీరుగార్చుచు బ్రహ్మర్షి చితికగ్నిసంస్కారము గావించిరి.

అప్పటినుండియు బ్రహ్మర్షి నిర్యాణసందర్భమున ప్రార్థ నలు యుపాసనలతో దశాహము జరిగెను. 28 తేదీ యుద యము యేడుగంటలకు బ్రహ్మర్షి యస్తికలు సంచయనము గావింపబడెను. రుద్రభూమియందా సమయమున శ్రీ. వి. పి. రాజునాయఁడుగారుపాసనగావించిరి. ఉదయము 9 గంటలకు బ్రహ్మోపాసనామందిరమున శ్రీ జి. బి. మాధవరావుగారు బ్రహ్మర్షి స్మారకోపాసనముగావించిరి. నాఁటి సాయంకాల మారుగంటలకు రాజావారి భవనములో శ్రీనాభి జగన్నాథ రావుగారు ప్రార్థనగావించిరి. అటులనే ప్రతిసాయంకాలము నను జూన్‌నెల 4వ తేదీవరకు బంగాళాలో 6 గంటలకు బ్రహ్మర్షిని

గూర్చి ఈశ్వరోపాసనలు జరుపఁబడినవి. శ్రీ గూడపాటి సత్య నారాయణమూర్తిగారు; శ్రీ వినయభూషణ రక్షితుగారు, శ్రీ వి. వి. కృష్ణయ్యగారు; శ్రీరొఖ్ఖం బాలకృష్ణారావుగారు శ్రీ ఆకురాతి చలమయ్యగారు, వరుసగా ప్రార్థనలుగావించిరి. జూన్ రెండవ తేదీని స్మరణోత్సవము, 4వ తేదీ నాద్యశ్రద్ధమును జరిగినది.

2-6-39 తేదీని సాయంకాలము 6 గంటలకు బ్రహ్మర్షి స్మరణోత్సవసందర్భమున బ్రిహ్మాండమగు పౌరసభ బ్రిహ్మ మందిరావరణములో జరిగెను. బ్రహ్మర్షి శిష్యులు శ్రీ సర్. కూర్మా వేంకటరెడ్డినాయఁడుగా రధ్యక్షతవహించిరి. బ్రిహ్మర్షి నిర్యాణసందర్భమున మిత్రులు, శిష్యులు, ఆప్తులు, దేశనా యకులునంపిన సందేశములను శ్రీ దివాను కోకా వేంకట సుబ్బారావునాయఁడుగారు చదివి వినిపించిరి. అధ్యక్షులు శ్రీరెడ్డి గారి ప్రారంభోపన్యాసానంతరము ప్రొఫెసర్ మామిడిపూడి వేంకటరంగయ్య; శ్రీ బి. బి. రక్షితు, జాన్‌చౌదరీ, హబిబుల్లా ఖాన్, డి. వి. కృష్ణశాస్త్రి, కె. రామశాస్త్రి, శ్రీపెద్దాడ రామ స్వామి, శ్రీమతిజ్ఞానాంబగార లుపన్యసించిరి. శ్రీ ద్రోణమరాజ రామమూర్తిగారు గురుదేవస్మృతి "యను గ్రంథమునందలి" పద్యములజదివిరి. బ్రిహ్మర్షి స్మారకచిహ్నముగా శాశ్వతమైన నేర్పాటులజేయుట కీ క్రిందివారుగల కార్యనిర్వాహకవర్గము నేర్పరచిరి. (1) శ్రీపిఠాపురము మహారాజావారు (2) శ్రీకపిలేశ్వర పురము జమీందారుగారు (3) శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు

గారు (4) సర్. కూర్మా వేంకటరెడ్డి నాయుడుగారు (5) శ్రీదివాను కోకా వెంకటసుబ్బారావు నాయుడుగారు (6) శ్రీ పురాణం భద్రయ్యనాయుడుగారు (7) శ్రీ పెద్దాడ రామస్వామి గారు (8) శ్రీ కం. రామశాస్త్రిగారు (9) శ్రీ సత్తిరాజు శేషగిరిరావుగారు.

జూను 4 వ తేదిని ఆద్యశ్రాద్ధసందర్భమున ఉదయము 7-30 గంటలకు బ్రహ్మమందిరములో శ్రీ గూడపాటి సత్యనారాయణ మూర్తిగా రీశ్వరోపాసనముగావించిరి. తదుపరి మహారాజావారి బంగళాలో నాద్యశ్రాద్ధవిధులు జరుపబడినవి. ఉదయము 8 గంటలకు ఈశ్వరోపాసనము జరిగెను. శ్రీకంభంపాటి రామశాస్త్రిగా రుద్బోధనను, శ్రీనాభి జగన్నాధరావుగా రారాధనము; శ్రీ పెద్దాడ రామస్వామిగారు ధర్మప్రసంగములఁ గావించిరి. మధ్యాహ్నము 11 గంటలకు శాంతిభోజన మేర్పాటుజేయఁబడెను. తరువాత 3 గంటలకు శ్రీ ఎండమూరి వేంకటరమణగారు ప్రార్థనము గావించుచు బ్రహ్మర్షి నిగూర్చి సంగత్సభను జరిపిరి. శ్రీ వాడ్రేవు రామమూర్తి, శ్రీ రాపాక కౌస్తుభము శ్రీఇంటి శేషగిరిరావు గారలు పాల్గొనిరి. మంగళగీతములతో దశాహము ముగిసెను. ఈ సందర్భముననే మూడుదినములు అన్నదాన సమాజములో బీదలకన్నదానము గావింపబడెను. జూన్ 6 వ తేదీని ఆంధ్ర దేశమునందలి బ్రాహ్మప్రార్థనసమాజములన్నియు బ్రహ్మర్షి స్మారకప్రార్థనల జరిపినవి. కాకినాడ సమాజమున శ్రీకల్యాణస్వామిగారు శాంతిబోధ గావించుచు నుపాసనఁ జేసిరి.

బ్రహ్మర్షి నిర్యాణము మొదలు ప్రతినెల 26 వ తేదీని సాయంకాలము భజనలు, మాసికస్మరణోపాసనలు నీకిందివారిచే జరుపబడినవి. శ్రీ కె. సచ్చిదానందం గురుజు వేంకటస్వామి, ఆకురాతి చలమయ్య, అద్దంకి శేషగిరిరావు, వినియభూపరక్షితు మోకా మీరయ్య, ఎండమూరి వేంకటరమణ, చామర్తి సత్యనారాయణ, పెద్దాడరామచంద్రరావు, వి. పి. రాజునాయడు గారలు 26-4-40 తేదీని బ్రహ్మర్షి స్మరణోత్సవము జరిగెను.

గురువర్యులగు బ్రహ్మర్షి వీడియుండజాలక శిష్యవరేణ్యులగు డాక్టరు వేమూరి రామకృష్ణారావుగారు 11-11-39 తేదీని; దివాను కోకా వేంకటసుబ్బారావు నాయఁడుగారు 21-3-40 తేదీని బ్రహ్మలోకావాసమునొందిరి.

ఈ ప్రమాథినామ సంవత్సరమునందే గురుశిష్యులు బ్రహ్మర్షి నాయఁడుగారు, డాక్టరు రామకృష్ణారావుగారు, దివాను కోకా వేంకటసుబ్బారావునాయఁడుగారొకరివెనుకనొకరు పరలోకమున కేఁగుటలో వారి యాశ్రితకోటికి బంధుమిత్రులకేగాక సంఘసంస్కరణోద్యమమునకు ముఖ్యముగా బ్రాహ్మసమాజమునకు యావదాంధ్రదేశమునకు దీఱనిలోటతవాటిల్లినది. వారలకువారే సాటి. భక్తి, జ్ఞానకర్మ స్వరూపములాంధ్రావనిలో క్షీణించినవి. మరల యిట్టిమూర్తు లెప్పటికోయెన్నఁటికో.

శ్రీ నాయఁడుగారి ఘోరమరణవార్త యాంధ్రదేశమంతయు వ్యాపింపఁగనే దేశమునందలి యన్నిపత్రికలలోను, వారిని

ప్రశంసించుచు దీర్ఘ వ్యాసములు ప్రకటింపబడెను. ఆంధ్రవిశ్వ విద్యాలయోపాధ్యక్షులు శ్రీ డాక్టరు కట్టమంచి రామలింగా రెడ్డిగారిట్లు వ్రాసిరి. "సర్. వేంకట రత్నమునాయఁడుగారు ఆచరణ పూర్వకముగ మతసాంఘిక సంస్కరణముల మూలమునఁ గావించిన సేవవలనను, అస్పృశ్యులను, సంఘమందు వెనుకబడినజాతులను నుద్ధరించుటకయి దీనబంధుఁడుగా నొనర్చిన కృషిచేతను, వర్తమానకాలమున పీఠికాపురమును, నాంధ్రదేశమున నాగరక విద్యావిలసితమగు ప్రధానపట్టణముగ దిద్దుటలో వహించిన వ్యగ్రతవలనను లోకమునకుఁజిరస్మరణీయులగుచున్నారు. మతము, విద్య, భాషాపోషణము, పండితసమాదరణము, సంఘసంస్కరణము, ప్రజాసేవనము, పక్షపాతాహంకారాది విదూరమయిన రాజకీయవ్యాపారము, అనునవి వీరిజీవితమును బ్రకాశింపఁజేసిన యసదృశవిషయములు. కార్యఫలములఁ బట్టిచూచినను వీరిజీవిత మసాధారణఫలితములతో విజయపూర్వకముగఁ గొనసాగెనని యెన్నదగును. ఆయన జీవనవిధానము, మనోవర్తనములఁబట్టి చూచిన, పరమేశ్వరాదేశములందలి దృఢవిశ్వాసము, నిరాడంబరత్వము కారణములుగా వీరిజీవితముత్కృష్టత గాంచగలైనని చెప్పవచ్చును. బ్రతికినంతకాలము ప్రతిదినము భగవత్సన్నిధినిగాంచి యందు వసించుటకయి యేకైక హృదయముతోఁ ద్రికరణశుద్ధిగఁగృషి యొనర్చినయాంధ్రదేశీయులలో నుత్తమోత్తముఁడుగా వారు నిరంతరము సంభావింపఁబడుదురు. కావున వారి యాదర్శజీవితశక్తిసామర్థ్యములం

జేసి యమర్త్యులయి యిప్పటికిని వారు మనలోజీవించియున్నా రనియే తలంపనగును. భగవత్సన్నిధిని జీవించువారికి మరణ మనునదిలేదు.''

---

## 29. విక్టరు హ్యూగో - శ్రీనాయఁడుగారు

ఈపట్టున విక్టరు హ్యూగో జీవితమును శ్రీ నాయఁడు గారిజీవితముతోఁ బోల్చుటెంతయో యుచితముగఁ గన్పట్టు చున్నది. విక్టరుహ్యూగో జనకులు రాజభక్తిపూరితులగు ఫ్రెంచి సామ్రాజ్యసైనికోద్యోగి. ఫ్రాన్సునందలియు, యూరపునంద లియు, నాఁటి విపరీతములగు యస్థిరరాజకీయ పరిస్థితులందు వారుద్యోగరీత్యా యొకచోట స్థిరముగా నుండక దేశదేశ ములఁ దిరుగవలసివచ్చుటచే విక్టరు తనబాల్యము నొక్కచోట సుస్థిరముగాఁ గడుపలేదు. అట్లే శ్రీనాయఁడుగారితండ్రిగారగు శ్రీ అప్పయ్య సుబేదారుగారును సైనికోద్యోగులగుట వారు హిందూదేశమునందలి వేఱువేఱు ప్రాంతములందేగాక బర్మా యుద్ధములందుగూడ నుద్యోగమూలమునఁ దిరుగవలసివచ్చు టచే శ్రీ నాయఁడుగారికిఁగూడ విక్టరు హ్యూగోవలెనే బాల్య మున స్థిరమగుజీవనము కుదురలేదు.

విక్టరు హ్యూగో తనకు ముప్పదేండ్లప్రాయము వచ్చు సరికే యైరోపీయసారస్వతమునందుఁ బ్రతిభావంతుఁడగునాటక కర్తగను, రచయితగను, బహుళగ్రంథకర్తగను గణ్యత సంపా

దించి కీర్తిశిఖరము నధిష్ఠించెను. అట్లే శ్రీ నాయఁడుగారుగూడ ముప్పదియైదేండ్ల ప్రాయము వచ్చుసరికి నాంగ్లసారస్వత పారంగతులై ప్రతిభావంతులగు బోధకులుగా గణుతికెక్కిరి.

హ్యూగో తనచిన్ననాఁటఁ బలుదేశములందుఁ బర్యటించి యుండుటచేతను, సైనికజీవితముతోఁ బరిచయము గలిగియుండుటచేతను భగవద్ధ్యానపరుఁడయ్యెను. శ్రీ నాయఁడుగారి సందర్భమునఁగూడ నీవిషయము నిజమైనది.

ఇటలీదేశమునందలి యొక మతాచార్యునికడ విద్య నభ్యసించి హ్యూగో ప్రజాహిత జీవనదృష్టి నలవఱచుకొనినట్లే శ్రీ నాయఁడుగారుగూడ మతాచార్యుఁడగు మిల్లరుపండితుని కడ విశాల మానవదృక్పథ మలవఱచుకొనెను.

హ్యూగో ఫ్రెంచి రాజ్యాంగ పరిషత్సభ్యుఁడై యెట్లు ప్రజాసేవ యొనర్చి ప్రభుత్వ సత్కారముల నందెనో శ్రీ నాయఁడుగారుకూడ నట్లే మదరాసు రాష్ట్రశాసనసభా సభ్యులై ప్రజాసేవయు, విద్యాసేవయునొనర్చి రావుబహదరు, దివాన్ బహదరు, సర్ ఇత్యాది బిరుదాళిచేఁ బ్రభుత్వముచే సత్కరింపఁబడి యున్నతకీర్తిశిఖరము నధిష్ఠించిరి.

అనాథసేవయందును, దీనజనరక్షణమందును, నీవియందును, ఆపన్నుల యార్తి నడంచుటయందును హ్యూగోకు శ్రీ నాయఁడుగారు సాటివచ్చును. తాను ధనికుడుగాకున్నను హ్యూగో యెందఱనో వ్యాపారముచేసికొని పొట్టపోసికొనుట కార్థికసహాయముచేసియు రోగపీడితులకు వైద్యసహాయము

గల్పించియు, దిక్కుమాలినవారినిఁ బోషించియు, గుప్తదాత దీనజనబాంధవుఁడయ్యెను, అతనిగుమ్మముకడ సన్నమడిగి నిరాశతో వెడలిపోయిన యన్నార్థిలేఁడు. పొరుగింటి బిడ్డసయితము చలిచేవణఁకుటగాని, పాదరక్షలులేక వట్టికాళ్ళతో నడచుటగాని హ్యూగో చూచి సహింపలేకుండెడివాఁడు. బహుశః విక్టరు హ్యూగోజీవితమే శ్రీ నాయఁడుగారిలోఁగూడ నిట్టి సుగుణములతిశయించుటకుఁ గారణమైనదేమో!

ఐరోపీయ సారస్వతమున కధిష్ఠానదేవతయై, ఫ్రాన్సున కుపదేశకుఁడై, ఫ్రెంచిస్వాతంత్ర్యమునకుఁగులపతియైనహ్యూగో వలె శ్రీ నాయఁడుగారుగూడ ఆంధ్ర బ్రాహ్మసమాజమున కాచార్యుఁడై, యాంధ్ర విద్యార్థిలోకమున కుపదేశకుఁడై దక్షిణ భారతీయోపాధ్యాయ పరిషత్తునకుఁ గులపతియైనాఁడు.

ఎనుబదిమూఁడేండ్ల ముదివయస్సున మే మాసమున మరణించినపుడు (22-5-1885) తానీశ్వర విశ్వాసిననియు, సామాన్య మానవహృదయ కుహరములనుండి తన యాత్మ శాంతికై వెలువడు ప్రార్థనములే తనకుఁజాలనియు హ్యూగో తన మరణాశయముగాఁ బ్రకటించినట్లే, యించుమించుగా నదే వయసున, నదేమాసమున మరణించిన (26-5-1939) శ్రీ నాయఁడుగారు తమకత్యంతప్రియమగు కాకినాడ బ్రాహ్మమందిర ప్రాంగణమునఁ దమకొకసమాధి నిర్మింపవలెననియు, దానిపైఁ దానీశ్వరవిశ్వాసిననియు, "వినమ్రుఁడగు భగవత్కృపార్థి" (A humble Supplicant for Grace — R. V. R.) ర. వేం. ర" అని వ్రాసినఁ జాలుననియు వారిమరణాశయముగా నెఱిఁగించిరి.

వారి మరణాశయ మనుసరించి 6-12-42 తేదీని ప్రార్థ
నానంతరము శరణాలయపు బాలబాలికలు, శ్రీ పీఠికాపురసం
స్థానపు దివాను శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు, బ్రహ్మర్షి
జామాత శ్రీ కం॥ రామశాస్త్రిగారు, శరణాలయాధికారి శ్రీ
ఆకురాతి చలమయ్యగారు, సమాజసభ్యులు శ్రీ ఎండమూరి వేం
కటరమణగారు, సమాజాధ్యక్షులు శ్రీ వినయభూషణ రక్షిత్
గారు, శరణాలయవర్తితులు శ్రీ ఆర్. శివనాథరావు, కోటిపల్లి
సూర్యనారాయణగారలు బ్రహ్మర్షిసమాధివద్ద వేచియున్న
సమయమున 10-30 గం॥లకు శ్రీమహారాజావారు అస్థికల శిర
మున ధరించి కన్నీటికాలువలతో సమాధిలో నిక్షిప్తము
గావించిరి.

ఈ దివ్యపురుషులిరువురును దమ భౌతిక దేహములను వీడి
చనినను వీరికీర్తికాయమిహలోకమును వీడి చనలేదు. వారేహ్య
దయ పరిణామవాదముకొఱకు దమధన్యజీవితములను గడపిరో
యా పవిత్రోద్దేశమును బెంపొందించుటయే మనము వారికి
జ్ఞాపకార్థము చేయఁగలసేవ. అంతియేగాని వారికి స్మారకచిహ్న
ములను నెలకొల్పినంతమాత్రమున వారి దివ్యాత్మలకు శాంతి
చేకూరదు.

---

## గుణవిశేషములు

బ్రహ్మర్షి నామముచ్చరింపఁగానే సాధారణముగా మహా
వక్తయనియో, యాంధ్ర బ్రాహ్మ సమాజ సంస్థాపనాచార్యుఁ

డనియో, ధవళవస్త్రధారియగు దేవతయనియో మనస్సునకుఁ దట్టును. కాని సత్యమునారసిన యాయన కేవలమొక నూతన మతస్థాపకుఁడుగాని, తత్త్వవేత్తగాని, సంఘసంస్కర్తగాని కాఁడు. ఈ యపూర్వ సంస్కరణములన్నిటికి నతీతుఁడైన య పూర్వవ్యక్తి. ధర్మప్రవక్తలు రెండు విధములుగా నుందురు. ప్రపంచమందలి ధర్మప్రవక్తలలో బుద్ధుఁడు,జీసను, చైతన్యుఁడు ఒక వర్గమువారు. వీ రొకొక్క విమలధర్మాదర్శమును నల్పసంఖ్యాకులగు శిష్యులలోఁ బ్రబోధముగావించి వెడలిపో యినారు. వీరు ప్రపంచోపరిభాగమునఁ దేలియాడుచుండిరే మోయనునట్లు తమజీవనమును గడిపి వెడలిపోయిరి. శిష్యవర్గ ముయొక్క జీవితముల నప్రాణితములుగాఁ జేయుటయే యీ శ్రేణిధర్మ ప్రవక్తలయొక్క ప్రధానాశయము. వీరి ధర్మాద ర్శములు వారి శిష్యవర్గముయొక్క ప్రయత్నఫలమువలననే, తరువాతికాలమునఁ బ్రపంచమున వ్యాప్తి చేయఁబడెను.

మహాత్ముఁడగు మహమ్మదిఁంకొక శ్రేణికిఁ జెందినవాఁడు ఆయన కేవలము భావముయొక్కయు, నాదర్శముయొక్కయు రాజ్యమునందు మాత్రమే విహారము సల్పియుండలేదు. ఆయన భూతలమునకుదిగి, తన దేశముయొక్కయు, యుగముయొ క్కయు, సమకాలికుల యొక్కయుఁ బరిస్థితులను బరివర్తన మొందించి, యభ్యున్నతి నొందించుటకొఱకే, తనస్వీయజీవి తకాలమంతయు నాలోచింపవలసివచ్చెను. ఈ రెఁడవ శ్రేణికిఁ జెందినవాఁడుబ్రహ్మర్షి వేంకటరత్నము. ఆయన యాంధ్రజాతీయ

నవయుగ ప్రవర్తకుఁడు. సాంఘిక నైతిక ధార్మిక సంస్కర్త. ఆయనమన స్పందారము. ఆయనవ్యవహార మత్యుత్తమము. మానవుని దుఃఖమును దూరము చేయుట కుజ్జ్వలము లగు వారి త్యాగములు, ఆత్మ సమర్పణము, చరిత్రము నందలి తేజో మాధుర్యముల యొక్క సమావేశము, వీనినన్నిటిని జూచినప్పుడాయన వైపునకుఁజూచి, ముగ్ధులమై, యాయనను ప్రేమింపబుద్ధి పొడమును. ఆయనకొఱకు జగద్ధితార్థమై జీవనమర్పింప సంకల్పముదయించును. ఆయన దెసఁజూచి మనమనుష్యత్వ మాయనవలె నున్నతి నొందించుకొన బుద్ధివొడమును.

బ్రహ్మర్షి తనయుగమునాఁటి లోపములన్నియుఁ గలిగి యున్నను మానవుఁ డను లెక్కలో నెంతయో గొప్పవాఁడు. అందుచేతనే వారు మనకు గౌరవనీయులు. అనేక గురుతరకార్యములందు నియుక్తులై యున్నను, శరణాలయశిశువులతో సహవాసము చేయుచు వారలఁదనకాళ్ళపై నిడికొని యుయ్యేల లూగించెను. స్త్రీలలో నికృష్టురాలుగా నెంచఁబడు దాసికైన నాసనమియ్యక తానుముందుగా నాసనమును గ్రహించియెఱుఁగరు. రాజహర్మ్యములందు యత్నపూర్వకముగా నాత్మగౌరవమును నిలుపుకొనెను. ఒకవైపుజీససువలెనమ్రతుఁడై, వైష్ణవుని వలె సవినయుఁడయి,ప్రదీప్తానలమువలెఁ దేజోవంతుఁడయ్యెను. ఆయన దౌష్ట్యమును నిర్మూలించుటలో వజ్రాయుధమువలెఁ గఠోర హృదయముకలవాఁడు. అట్లయ్యు నాపన్నులయందుఁ గుసుమ కోమలుఁడు.

ఆంధ్రులకు మత, సాంఘిక, నైతిక, ఆర్థిక, రాజకీయ సేవను జేసి వారియైహికాముష్మికాభివృద్ధికిఁ బాటుపడిన సర్వతోముఖసంస్కర్త. వారిసమగ్రప్రతిభయ శేష జాతిజీవనమంత సంపూర్ణమైనది. సర్వాంగసుందరమైనది. సంపూర్ణ వికసితమైనది. ఒక్కొక్క విషయమునందసమాన ప్రజ్ఞగలవారలనేకులు గలరుగాని సమస్తజీవ సమస్యల నిట్టిప్రావీణ్యముతో నెదుర్కొని నవజీవనమును గల్పించు వారరుదు. వారు వహించిన యీ మహాభారము వారి తరువాత నాంధ్రావనిలో వివిధకార్యరంగములలోఁ బనిచేసిన యేమహా పురుషుఁడును మోయలేకపోయినాఁడు. జాత్యభ్యుదయమునకుఁ గావలసిన సంపూర్ణ విధానములలో నొక్కొక్క ఖండముఁ గొందఱు కొందఱు స్వీకరించి యథాశక్తిని సుదూరమగు నాగమ్యస్థానమునకై కార్యవీరులై కదలిపోవుచున్నారు. మహారాజాదీనబంధు డాక్టరు సూర్యారావు బహదూరు, డాక్టరు వేమూరి రామకృష్ణారావు, ముట్నూరి కృష్ణారావు, పురాణం భద్రయ్య, పెద్దాడ రామస్వామి, శ్రీ జగన్నాయకులు, దివాను కోకా వేంకట సుబ్బారావు, కంభంపాటి రామశాస్త్రి, కట్టి సత్యనారాయణ, దివాను కోకా శివనాథశాస్త్రి, ఆచార్య ఇప్పగుంట సుబ్బకృష్ణయ్య, డాక్టరు పట్టాభిసీతారామయ్య, తల్లాప్రగడ ప్రకాశరాయఁడు, సర్ కూర్మా వేంకటరెడ్డినాయుడు; శ్రీ వి. పి. రాజునాయఁడు గుడిసేవ సుబ్బయ్యనాయడు, బండి శ్రీహరిరావు, యం. వి. యన్ సుబ్బారావు, ఎండమూరి వేంకటరమణ మొదలైన

వీరలు వారివెనువెంటనే విజ్ఞానసీమలో, సాంఘికోద్యమములో రాజకీయరంగములో, ధర్మక్షేత్రములోఁ బ్రవేశించి వివిధరంగములలోఁ గార్యసాధనము చేయుచు ధన్యులగుచునేయున్నారు.

బ్రహ్మర్షి ఆజానుబాహుఁడు. దబ్బపండు ఛాయనుగలిగి కాంతుల నోర్చు దృఢకాయులు బలిష్ఠులు. ముందఱికుఁద్రోసి కొనివచ్చుచు వెడల్పు విశాలమునగు నొసలు, నిశితమై తీక్ష్ణమై తీవితోఁ గూడినచూపు, కాంతితోఁ గూడిననల్లని కన్నులు గల్గి విరాజిల్లుచుండెడివారు. పొడవుగానుండి తిన్నగాఁ గొనదేరినముక్కును గలిగియుండెడివారు. స్వేచ్ఛాశక్తిని సూచించుపెదవులును, పొడవునుగలిగి దట్టమైనయుంగరములతోఁ గూడినతలకట్టును గలిగియుండెడివారు. దట్టమైన మీసమును గలిగి యత్యంతాకర్షణీయమయి సర్వాంగ సుందరమైన దాయన బాహ్యరూపము. సౌందర్యవంతమై గంభీరమై, ప్రేమపూరితమైన యాయనవర్చస్సు రూపము చూచువారల కచ్చెరు వొనర్చుచుండెడివి. ఊర్ధ్వలోకములకు సోపానము వేయగల దేవతావిగ్రహము వారిది. పార్థివమైనను నాత్మజ్యోతిని నిండువెలుఁగున వెలుఁగుటచేఁ జిన్మయ రూపమైనది. అందలి ప్రతియణువు, ప్రతికణము, ప్రతిబిందువు, భక్తిరసము నాస్వాదించి మధురతమమైనది. దాతృత్వముచే పొడవుసాగిన యాజానుబాహువులు, యోగిక నిద్రయందుఁ బ్రజ్ఞా చక్రమెల్లప్పుడు పరిభ్రమించుటచే నునుపువారిన విశాలఫాలతలము, ఎట్టి గహనతత్త్వములనైనను జొచ్చికొనిపోవునేత్రయుగ్మమును

గలిగి మర్త్యామర్త్యములకుఁ బవిత్రసంగమస్థానమైనది వారి తనువు. వారు విద్రోహుల ద్రోహములను పాపుల పాపములను దుష్టులదుష్టత్వమును గరుణతో క్షమించు క్షమాస్వరూపులు. సద్గుణములకతన వారెప్పుడు సజీవులు; ఆయన ప్రేమ జ్ఞానములు, దానధర్మములు, సందేశోపదేశములు, మధురమయమైన సంభాషణములు నేఁడును జీవనదులై మహాప్రవాహముతోఁ గేవలమాంధ్రదేశమును మాత్రమే గాక, భారత వర్షమునే గాక, యావత్ప్రపంచమును బునీతము చేయుచున్నవి.

బ్రహ్మర్షి జీవిత చరిత్రను బఠించునపుడు మొట్టమొదట మన కాశ్చర్యమును గలిగించునది వారి యద్భుత మేధాశక్తి. చిన్నతనముననే యరబ్బి పారసీక భాషల నేర్చికొని యుపనిషద్ వేదాంత గ్రంథములఁ జదివి యఖండ పాండితీగరిమను బ్రదర్శించిరి. ముప్పది సంవత్సరములు నిండకమున్నే యాంగ్ల సారస్వత పారమును జూచినారు. గ్రీకు, హీబ్రూ, లాటిను ఫ్రెంచి భాషలనభ్యసించి నారు. తమయఱువది యేట సంస్కృతమును నేర్చి శాస్త్రాదులఁ జదివి గొప్పపండితులైనారు. తెనుగునందుగూడఁ జక్కనిభాషను వ్రాయుచు, నుపన్యాసముల నిచ్చెడివారు. 1929-వ సంవత్సరమున, గుంటూరు జిల్లా "ఈపూరు పాలెము" నందు జరిగిన మొదటి యాంధ్రాస్తిక మహాసభలో వారుపన్యసించిన యుపన్యాసము నాఁటి సభ్యులను, బ్రజ్ఞానిధులను నాశ్చర్యమున ముంచినది. ఇట్టి యద్భుతవైదుష్యమునకుఁ దోడు వీరికఖండమగు జ్ఞాపకశక్తికూడఁగలదు.

జ్ఞాపకశక్తికొఱకుఁ బ్రతిదినమేదో యొకకృషి సలిపెడివారు. కవులు వ్రాసిన విషయములను తేదీలతో సహితము, వరుస వారి వల్లించి జ్ఞాపకముంచుకొనుశక్తి వీరియందుఁగలదు. వారు జ్ఞానసింధువు. కనుచూపు తగ్గువఱకుఁ గూడ రేయుంబవళ్ళు వాఙ్మయ తత్త్వశాస్త్రములఁ జదివెడివారు. వారివిజ్ఞానము, భాషాపటిమ వార్ధక్యమునఁ గూడ నున్నతస్థానమున నుండఁ గలిగినవి. ఇరువదేండ్ల యువావస్థయందలి వారి వ్రాఁతలు, యుపన్యాసములు వారి విశాలహృదయమును, గ్రాహ్యతను నద్భుతముగాఁ దెలుపును. ముప్పదియవ యేట షేక్స్పియరు మున్నగు నాంగ్లకవులరచనలనారసి యాంగ్లవాఙ్మయ, బోధనములో నద్వితీయులైరి. వాఙ్మయ, తత్త్వజ్ఞాన విద్యార్థులు తప్పక వారిగ్రంథములను విశ్వవిద్యాలయ పరీక్షలకు బ్రధాన పాఠ్యగ్రంథములుగా నుపయోగించెడివారు. శ్రీనాయఁడుగారు విచక్షణశీలి. నిష్పక్షపాతి. వీరు విషయములను జక్కగా నవగాహనచేసికొని తీర్పుచెప్పెడివారు. సందేహముల కాధారమిచ్చెడివారుకారు. తమ స్వశక్తినుపయోగించి వ్యవహారమును జక్కఁబెట్టెడి వారు. రెండు వ్యతిరేకశక్తులను బరీక్షింపవలసి వచ్చినపుడు తమబుద్ధికి మంచిదని తోఁచినదానిని మొగమోటమి లేక చెప్పెడివారు కాని పక్షపాతబుద్ధితో నుండెడి వారు కారు. వారి నమ్మకమే వారి ధైర్యము. దైవమును నమ్మి న్యాయము చేయు మనునది వారి జీవితమందలి ప్రధానాశయము.

శ్రీ నాయఁడుగారి పలుకులెల్ల పూర్వగాథలతో నిండి, భావగర్భితములై హాస్యరసముట్టిపడుచుండెడివి. వారుహాజరైన యన్నిసమావేశములందును హాస్యరసమమితముగఁ బ్రవహించి, వచ్చినవారినెల్ల నాహ్లాదపఱచి, విసుగులేకుండ కాలమును శరవేగమున గతింపఁజేసెడిది. వారున్నచోటఁ బ్రతివారును నవ్వవలసినదే. వీరిలోని యీవింతశక్తియే యెల్లవేళల వారిచుట్టు. ననంఖ్యాకులగు ఛాత్రవర్గము నాకర్షింపఁ జేయఁగల్గెడిది. వారిలోనిజ్ఞానము నాస్వాదించుటకును, హాస్యరసమును జవిచూచి వినోదించుటకును సమావేశములకు హాజరగువారు మెండు. వారెన్నఁడును జవుకరకపు హాస్యమునందును, వినోదము నందును మనసుచూపెడివారు కారు. హాస్యప్రకటనమందుఁగూడ నితరులను వెక్కిరించుటగాని, యప హాస్యము చేయుటగాని, ప్రపంచమునెడ నీసువహించుటకాని వారిస్వభావముకాదు. పరబ్రహ్మస్వరూపమగు నానందమే జీవితలక్ష్యమనియు, "ఆనందో బ్రహ్మ" యనునార్యోక్తిని బాటింపనివాని జీవితము నమ్మనియు వారిసిద్ధాంతము.

ఈయన, వారికాలమునాఁటి నవనాగరికతా వేషమును ధరింపక, తనదుస్తులను సమయానుకూలముగా మార్పక, యెల్లప్పుడు నొకేరీతి దుస్తుల ధరించెడివారు. వారు మతము నందుఁ పూర్వాచార పరాయణులు గాకపోయినను నొకేరీతిఁ దెల్లనివస్త్రధారణ మందుమాత్రము శుద్ధఛాందసునివలెఁ గనఁబడెడివారు. తెల్లనికోటుతో, షరాయితో బాదుషావలె

నుండెడివారు. వారిరువది వత్సరముల వయస్సునకుముందు రంగుకోటులను, షరాయిలను ధరించెడివారు. కాని వారిసతీ మణిని గోల్పోయిన నాఁటినుండి భోగభాగ్య పరిత్యాగమును వెల్లడించుచు, ఆధ్యాత్మిక పవిత్రతను సూచించుటకై తెల్లని వస్త్రములనే ధరించుచుండిరి. మనోవాక్కాయకర్మలచే బరమ పవిత్రమూర్తి యనఁదగు బ్రహ్మర్షి యెల్లప్పుడును ధవళవస్త్ర ధారులై పవిత్రత కుదాహరణమైరి. వారి దుస్తులను తలపాగాను గవర్నరమున్నగు వారి రాజప్రాసాదములందు జరిగెడి విందుల సందర్భములు గూడ మార్చలేకపోయినవి. పైవేష మునందేకాక భాషయందుఁ గూడ వారుపవిత్రులు. దురాలోచన, దుష్టకార్యము, దుర్మార్గము, వీరికేవగింపును, సిగ్గును గల్గించెడివి. చెడునడతకలిగి, యధికారము వలనఁగాని, ధనము వలనఁగాని, సంఘముచే గౌరవింపఁబడు పెద్దమనుష్యులు శ్రీ నాయఁడు గారిని దర్శించు నంతమాత్రమున సిగ్గుజెందుచు, దమలోఁ దాముక్రుంగుచుండిరి. నాయఁడుగారి తేజోవికాసము ముందపవిత్రత నిలువఁజాలదు.

వారి దుస్తులు నాహారపానీయములు చాల సామాన్య ములు. వారింట నున్నపుడు గూడకట్టుగా ఎఱ్ఱనిబంగరుచుట్టు చెంగావి పంచెను వలబనియనును ధరించుచుండెడివారు. వారి కాఱు ఆల్ఫాకా తెల్లసూట్లు, ఆఱు ఎఱ్ఱపంచెలు, ఆఱు మళ యాళదేశపు తువాళ్ళు నుండెడివి. ఆఱు పరకాళాకోట్లు, ఆఱు పరకాళా హిందూస్థానీయుల లాగులు, ఆఱు తలపాగాగుడ్డలు,

రెండు కాసికోకలు, ఆఱు పొడవుచొక్కాలు, ఆఱు వలబని యన్లు నుండెడివి. శరణాలయవర్ధితులకుఁ గూడ సంవత్సరము నకాఱు చొక్కాలు, ఆఱు లాగులు కుట్టించుచుండెడివారు. కుట్టుపనివాఁడు కత్తిరించిన వారి గుడ్డతాలూకు ముక్కలను దెప్పించి జాగ్రత్తపఱచి లాగులు చినిగిపోయినపుడు మాసిక లను వేయించుచుండెడివారు. వారుస్వయముగా ప్రక్కవేసి కొని బట్టముడతలు పడకుండ స్వయముగాఁ జూచుకొనెడి వారు. గుడ్డలను వాడుటలో చాల జాగ్రత్తగా నుండెడివారు. సన్నని మళయాళదేశపు తువాలును మడతపెట్టి కండువావలె వాడెడివారు. వారియొద్దఁ జెడిపోయిన పాదుకలు రెండు జత లుండెడివి. ఒకజత మలమూత్ర విసర్జన కేఁగునప్పుడును రెండ వది యింటనడయాడునపుడును వాడెడివారు. ఒకబూట్లజతను కార్యార్థియై పోవునప్పుడుమాత్రమే వాడెడివారు. దానికి రమారమి యరడజను మాసికలుండెడివి. కాని యెల్లపుడును మెఱుగుపెట్టఁబడి ధగధగ మెఱయుచుండెడివి. నలువదేండ్లు మన్నిన రెండు బనియనులు వారి మరణానంతరము వారి పెట్టెలోఁ గానవచ్చినవి. అంతపొదుపుగా దుస్తుల వాడెడి వారు.

ఇఁకఁబానీయములన్ననో మంచినీటిని, మజ్జిగను, అం బలిని మాత్రమే గైకొనెడివారు. సోడాను గూడ వారెన్నడు ముట్టియెఱుగరు.

జిహ్వా చాపల్యము సమస్తజంతువులతోఁ బాటు మాన వులకు గూడ ననివార్యము. ఆచాపల్యమును సంయమించే

జయింపఁగలడు. చిన్ననాఁటినుండి మాంసభోజన మెట్టిదియో యెఱుఁగని బ్రాహ్మణులకు దానికష్టము తెలియదు. కాని మాంసము మిక్కిలి రుచియగు వస్తువగుటచే దానిని గొంత కాలము దిని వర్జించుట కష్టతరమైన పనియని మహాభారత ములోఁ జెప్పఁబడియున్నది. శ్రీనాయఁడు గారు బాల్యమున మాంసభక్షకులేమైనను, సతీమణి మరణానంతరము వారు మాంసాహారమును మానుకొని సంపూర్ణశాకాహారులైరి. విదురునివలె దినమునకొక్కసారియే భుజించుచుండెడివారు. ఆరోగ్య రక్షణకైకూడ జంతుసంబంధములగు పదార్థములుగల "కాడ్" చేప నూనెవంటి మందులను సయితము వారుపయోగించుట కియ్యకొనరైరి. లోగడ నంజువ్యాధిచే బాధపడుచుఁ గాళ్ళు స్వాధీనము కానియప్పుడు సయితము, వైద్యులు శాకాహారపద్ధతిని మార్చుకొని మాంసాహారమును దీసికొనవలెనని యెంతసలహా యిచ్చినను వారిశాకాహారనిశ్చయమును వదలుటకు సమ్మతింపరైరి. శాకాహార నియమమునందుఁ తామంతటి వజ్రసంకల్పముతో నున్నను నదితమలోనొక సుగుణముగా వారెంచరైరి. ఏసుక్రీస్తు మహాత్ముఁడు పవిత్రమాంస భుక్కులేమైనను వారియాధ్యాత్మికోన్నతి కడ్డురాలేదనియు, నట్టి యతిలోకాధ్యాత్మిక పుంగవులముందుఁ దామెంతటివార మని చెప్పుచుండిరి. వృక్షములకు సయితము ప్రాణముగలదని జగదీశచంద్రబోసు నిరూపించినతరువాత భౌతికజీవప్రపంచమున 'అహింస' యనుమాట బూటకమేమైనది. అహింస,యాహా

రముపట్లకన్న నంతకంటె నున్నతములగు పట్టులందెక్కవగా సాధింపవలసిన విషయము. ఖడ్గముకంటెఁ గఠినవాక్కులును, దుష్టక్రియలునే యెక్కువహింసగల్గించును. కొంత నైర్మల్యము నకుఁదోడ్పడి, శుద్ధజీవనమునకు మార్గదర్శకమై రోగములంతగా రాకుండఁ జేయఁగలుగుటయే శాకాహారముయొక్క గొప్ప తనము. పొట్టకొఱకు ప్రాణులనుజంపి, వానిరక్తమును గనులార జూచుట యేహ్యమగుటచే మాంసాహారము మానుటయే లాభదాయకమని నాయఁడుగారిమతము. వారు ప్రయాణము చేయునప్పుడు చపాతీలును జేయించుకొని తమవెంటనే దీసికొని పోయెడివారు. తాము తినఁగా మిగిలినవానిని మఱుచటిపూట తినెడివారు. వారికాహారపదార్థములు వేడివేడిగా నుండనవసర ములేదు. కాలభోజనముతరువాత విశ్రాంతియున్నంత యవసర ములేదు. వారిపనిని వారు స్వయముగాఁ జేసికొనెడివారు. దీపము వెలిఁగించుకొనుటలో పంకా త్రిప్పుకొనుటలో గిన్నెలో నీరుపోసికొనుటలో వేయేల వారు స్వయముగానే వ్యవహరిం చెడివారు. వారు కనీసమొకగంట స్నానమాడెడివారు. అపుడు "ఓమ్" అను ప్రణవమంత్రమును జపించుచుండెడివారు. తమ ప్రక్కను దామే వేసికొనెడివారు. ప్రక్కపై ముడతలున్న వారికి నిద్రపట్టెడిదికాదు. గ్రామాంతరమేఁగునపుడు స్వయ ముగా వస్తువులను సవరించుకొనెడివారు. నౌకరులకప్పగించిన చోఁ దమ మందుసీసాలుసరిగా సర్ది పెట్టరని మేజోళ్ళను తువా ళ్ళను, దుస్తులను పరుపులోసరియైన స్థానమునందుంచి కట్టరని, సమస్తము తామే సరిఁజూచుకొనెడివారు.

తమ యుత్తరప్రత్యుత్తర వ్యవహారమును వారు స్వయముగ, స్వహస్తములతో కుదురుగ లిఖించెడువారు. వారియుత్తరములలో నొక మహత్తరశక్తి యుండెడిది. ప్రేమ, శోభ, శివి వానిలోఁ బ్రస్ఫుటమగు చుండెడివి. వారి వ్రాతలోను, భాషలోను, ప్రేమానురాగములు పొంగి పొరలుచుండెడివి. అందు వారి హృదయపవిత్రత, యాత్మపారిశుద్ధ్యము ద్యోతకమయ్యెడివి. ఎచ్చట పాపమున్నదో యచ్చట శ్రీ నాయఁడుగారి పవిత్రమూర్తియో, మాటయో, యుత్తరమో ప్రత్యక్షమై దానిని బటాపంచలొనర్చెడిది.

దూరమునుండి కాల్చెడిచుట్ట వాసనసయితమిట్టె వారు పసికట్టెడివారు. చుట్టవాసన వారికిఁగిట్టదు. చుట్టత్రాగువానిని మద్యపానము చేయువానిని జూచిన నేవగించుకొనెడివారు. వారి బుద్ధిహీనతకు వగచెడివారు. ఒకప్పుడు కాలేజీక్లాసులోఁ బాఠము చెప్పుచుండఁ బ్రక్కనున్న మేజస్ట్రీటుకోర్టు ఆవరణమునుండి చుట్టపొగ క్లాసుగదిలోనికి వచ్చెను. శీఘ్రముగా పసికట్టి శ్రీ నాయఁడుగారి నాసికారంధ్రములు బాధను భరింపలేకపోయిరి. సీత్కారముతో వారు తక్షణమే కబురంపి యచటివారిని బొగత్రాగకుండఁజేసిరి. వారిశిష్యులు చాలమందికిఁ బొగత్రాగు నలవాటుండెను. కాని వారు శ్రీ నాయఁడుగారి చెంతకేఁగునప్పుడు ముందు నీటిచే నోటిని శుభ్రపఱచుకొని, లవంగమునో, యేలకికాయనో నమలి, దుర్గంధమును బోఁగొట్టుకొని వారి సన్నిధానమునకేఁగు చుండెడివారు. మదరాసు

యూనివర్సిటీకమిషను కాలేజీని పరీక్షింప నేతెంచినది. అందలి వారందఱు నాంగ్లేయులు. చుట్టనుగాల్చు నలవాటుగలవారు. బ్రహ్మర్షికి చుట్టయనినఁ గిట్టదనియెఱిఁగి యాదొరలు ముందే చుట్టలఁగాల్చి బయటపారవేసి, కాలేజీ యావరణములో నడుగిడిరి. 1917 సం॥న సంఘమునందలి యపవిత్రతనుబోఁ గొట్టుటకు సంఘ పారిశుద్ధ్యోద్యమమును స్థాపించి తాగుఁబోతు దనమును నిర్మూలించుటకై శక్తివంచనలేక పాటుపడిరి. పవిత్రజీవితాదర్శముల నాంధ్రయువకులకుఁ బోధించి, యవి యాంధ్రలోకమెల్ల నావరించునట్లు ప్రచారముగావించిరి. బ్రాహ్మసమాజమునం దాత్మసమర్పణము గావించి విద్యాధికులలోను, విద్యార్థిసంఘములందును సేవారతిని గలిగించి సాంఘికజీవనమున భక్తిని బవిత్రతను బెంపొందించిరి.

బ్రహ్మర్షిగారి యోరిమి వర్ణనాతీతము. కోపమువచ్చినపుడైనను నవుకరులయెడఁగూడ వారు పౌరుషవచనములుగాని, నిందావాక్యములుగాని పలికియెఱుఁగరు. వారుపలికిన పరుషభాషణములలో "బుద్ధిహీనుడా" యనునదియే మిగుల కటువైనపదము. ఈ విశ్వప్రేమికుఁడు నౌకరులను, వారి బిడ్డలను నత్యంత ప్రేమతోఁ జూచుచు సాకుచుండెడివారు. వారికి రుగ్మతలు వచ్చిన నవి తమవిగానే భావించి యెంతోపరితపించి, తగినవైద్యము చేయించెడివారు. తమ నౌకరులలో నొకడగు 'అప్పన్న' బిడ్డను, చరమదశయందు, ప్రేమతో సాకుచు, వానితో నాడుకొనుచు,అంధత్వము ప్రాప్తించినపుడుకూడఁ

తమ పడకకుఁజెంతనే మంచమువేయించి వానిని జోలకొట్టెడి వారు. ఆబిడ్డనికి తమచివరిదశలో నేదో కొంతసొమ్మునుముట్టఁ జెప్పవలెనని యభిప్రాయపడిరి. కడపటిదినములలోఁ గొన్ని వేల రూపాయలను దీసికొని, వారు సాహాయ్యమొనర్చు దీన,అనాథ వితంతు హరిజనులకు కడసారి ఋణముఁదీర్చినవిధము నెంచి యాసొమ్ము వారికిఁబంపి సంతృప్తినందిరి. వాస్తవముగ సంసారమున జనకమహర్షియై, మహర్షి దేవేంద్రనాథులై జీవితసర్వస్వము నర్పించి పతితపావనుని సదా ధ్యానించుసాధకులై దీన పోషణమునందును అనాథరక్షణము లందును వ్యగ్రితవహించిరి.

వారి ప్రేమానురాగములు గాఢములయినవి. తలిదండ్రులు హింసించినను బ్రహ్మర్షి మాత్రము వారియెడనెప్పుడును భక్తివిశ్వాసములతో నుండెడివారు. వారియెడ యాయనప్రదర్శించిన విధేయత నిరుపమానము. తమకు బాధకరమైనను తలిదండ్రులు చెప్పినపనిని తు. చ. తప్పకుండ నిర్వర్తించుట వారు తమవిధిగా నెంచిరి. బ్రహ్మర్షివంటి విద్యుక్తధర్మవిదులగు పుత్త్రులాదినములలో నరుదు. గృహసంబంధములగు వారి ప్రేమానురాగము లద్వితీయములు. సహధర్మచారిణియెడ వారి యనురాగము గాఢము. అన్నివిధముల చేదోడుగా నుండిన సహధర్మచారిణి వారి యిరువదియేడవ సంవత్సరమునందు వారి మనఃఫలకమునందుఁ దనదివ్యమూర్తిని జిత్రించి స్వర్గధామము నకేఁగెను. ఈసంఘటనవలన వారికి మిక్కిలి దుఃఖము సంభవించెను. ఇట్లు పరబ్రహ్మమందైక్యమయిన యర్ధాంగియందలి గాఢానురాగముచే బ్రహ్మర్షి యనన్యమగు దృఢవ్రతముతో,

మరల వివాహముచేసికొనక జీవితాంతమువఱకు బ్రహ్మచర్య దీక్షను నిర్వహించి, పరమపవిత్రమగు దాంపత్యధర్మమును లోకమున కాదర్శప్రాయముగఁ బ్రదర్శించి భార్యాభర్తలిరు వురకుఁగల యపరిమేయమయినయాత్మైక్యమును బ్రకటించిరి. ఆమె మరణించిన సెప్టెంబరు మాసమునందలి 30 వ దినమును పవిత్రముగానెంచి యానాఁడామెను ధ్యానించుచుండెడివారు. వారియనాథ హృదయము పత్నీవియోగమున కెంతకుందినదో యూహింపశక్యముగాదు. అయినను విధి బలీయమనియు,అను ల్లంఘనీయమనియు నెఱిఁగియుంట వారావిచారమును బైకివెల్ల డింపక నిశ్చలచిత్తులై యేకపత్నీవ్రత ధర్మాచరణమునందే బుద్ధినుంచి జీవయాత్రను గడపిరి.

హృదయము నవనీతకోమలము. స్త్రీజాతియెడ వారి కుండిన గౌరవమెన్నదగినది. సామాన్యస్త్రీలనైనను రాణివలె గౌరవించెడివారు. స్త్రీలయెడ వారికంతటి యభిమానముండు టకు గారణము స్త్రీకి సహజమైనమార్దవహృదయముండుటయే. స్త్రీల సన్నిధానములో నున్నపుడు వారు తమమాటలోను, చూపులోను, నడతలోను, బ్రకటించెడి గౌరవము, మార్దవము మాధుర్యము చూపఱకు హర్షాతిరేకమున గగుర్పాటుగలిగిం చెడిది. వారున్నచోట నొక స్త్రీయైన నిలువఁబడియున్నచో వారు కూర్చుండువారుకారు. స్త్రీ జననమునెడ దమకుఁగల గౌరవముచేతనే వారి యభ్యుదయమునకయి వారిన్ని శ్రమల నోర్చిరి.

ఒకప్పుడొక మ్యాజిక్ లాంతరు ప్రదర్శనమునకయి జనులు క్రిక్కిరిసియుండిరి. అప్పుడు వచ్చిన స్త్రీలుకొందఱు కూర్చుండుటకుఁ జోటులేక నిలువఁబడియుండఁగా నాయఁడు గారు తాము కూర్చుండియున్న కుర్చీ కాళీజేసి వారికిచ్చుటయు నదిజూచి మిగిలిన పెద్దమనుష్యులు కొందఱు తాముగూడలేచి యాస్త్రీలకుఁ జోటిచ్చుటయు జరిగెను. మఱియొకపర్యాయము మండు వేసవిలో మూఁడవతరగతి టికెట్టుకొని రైలుప్రయాణము చేయుటకెంతో బాధపడుచున్న యొక యాంగ్లో యిండియను వనితకు బ్రహ్మర్షి తమ రెండవతరగతి టికెట్టునిచ్చి తమయాదా ర్యమును జూపిరి. ఇంకొకసారి విజయవాడవద్ద ఒకింగుహామ్ కాలవపై బోవు పడవవాండ్రు కొందఱు పతితవలెఁగన్పట్టు నొకవనితనుజూచి వెకిలిచేష్టలు చేయుచు, వేళాకోళమాడు చుండ బ్రహ్మర్షి వారినిమందలించి యామెతో "అమ్మా! సంగతియేమని ప్రశ్నింప నాయువతి" ఈలోకమున నావంటి యభాగ్యరాలిపై సానుభూతిచూపు వారొకరున్నారా యని నిట్టూర్చి యూఱటనొందెను. మఱియొకమాఱు రైలుస్టేషనువద్ద చల్లనమ్మెడి యువతినిజూచి వెకిలిచేష్టలొనర్చు కొందఱుయువ కులను వారు మృదువుగామందలించి యామె కృతజ్ఞతకుఁ బాత్రులయిరి. మతవిశ్వాసియగు బ్రహ్మర్షికి నీతివర్తనమందుఁ గూడ పట్టుదలమెండు. మరణశయ్యపై నున్నపుడుగూడ వారు తమనాదిలి యాఁడుబిడ్డల పరిచర్యలను సయితము గ్రహించి యుండలేదు. బాల్యవివాహములను వారంగీకరించెడివారుకారు.

సతీసహగమన నిషేధానంతరము నూరేండ్లకు శారదాచట్ట
మును హిందూదేశమునఁ బ్రవేశపెట్టిరని వినినంతనే వారికిఁగలి
గిన యానందమునకు మేరలేదు. స్త్రీల హక్కులవిషయమునను,
సంస్కరణమునందును వీరు ముందంజవేసెడివారు. స్త్రీ జాత్యు
ద్ధరణమునం దపారమయిన సేవగావించి యందఱిమన్ననలకుఁ
బాత్రులైరి.

బ్రాహ్మసమాజమతమునందలి ప్రధానాంశమగుసాంఘిక
సంస్కరణము వీరికెక్కువగా నానందముగల్గించు ప్రధాన విష
యము. జాతిభేదమనిన వీరి కయిష్టము. అస్పృశ్యతయనుపిశా
చమును వీరు మొదలంట నాశనమొనర్చిరి.హరిజనోద్యమ మిం
కను గాంధీమహాత్ముని యాజమాన్యమున బయలుదేఱక ము
నుపే బ్రహ్మర్షి పెక్కేండ్లక్రిందటనే హరిజనబాలికలను తమగన్న
బిడ్డలవలె పెంచసాగిరి. హరిజనులనఁగా దరిద్రనారాయణుఁ
డగు భగవంతుని యాత్మ బంధువులనియే వారి యభిప్రాయ
ము. ఉన్నతమగు కాపుకులమునఁబుట్టినను వారల్పకుల సంజా
తలగు హరిజన బాలికల సేవగించుకొనక తనయక్కునఁజేర్చు
కొని "మనమందరము హరిజనులమే, ఆభగవానుని ప్రజలమే"
యను నిర్మలబుద్ధితో నుడువుచుఁ బెంచిరి. రాజమహేంద్రవరపుర
మందిరమున హరిజనోద్యమసందర్భమునగూడిన సభలో వార
స్పృశ్యతనుగూర్చియుపన్యసించుచు "మలినహృదయమును ముం
దుగా శుభ్రపఱచుకొనినతరువాత నస్పృశ్యులతోఁ గలియ వ
చ్చును. అంతవరకుఁ దొందరపడఁగూడ"దని నుడివిరి. వారిసం

స్కారములందుఁజిత్తశుద్ధిప్రధానము. హృదయము వారిభావములవలె విశాలమైనది. పరస్పరవిరుద్ధ సిద్ధాంతములకయినను వారిహృదయమునఁ దావుగలదు. వారు పెంచిన హరిజన బాలికలలోనిరువురు క్రైస్తవసంఘములోని వారినుద్వాహమొనర్చుకొనిరి. మఱియొకరు ప్రస్తుతము భారతప్రభుత్వపుగనులశాఖలో సహాయకార్యదర్శిగా బనిచేయుచున్న యొక యాదిమాంధ్ర విద్యార్థిని నుద్వాహమైనది. జాతితోఁ, గులముతో, మతముతోఁ బదవితో నే సంబంధము బెట్టుకొనక తమపవిత్రహృదయమునందఱకు నందఁజేసి, వసుధయంతయు నొక్కకుటుంబమను నుత్తమాదర్శముతో జీవితము నడుపుకొన్న యుదారచరితులు.

వారు ప్రతి చిన్నవిషయమును స్వయముగాఁ బరిశీలించి చూచుకొనుటవలననే వారుచేయదలచిన పనిగూడ సకాలమున నిర్వర్తింపలేకపోయెడివారు. అందుచే రైళ్ళు దాటబెట్టుట సమావేశముల కాలస్యముగ నేగుట నిర్దిష్టకార్యములకు వాయిదా వేయుట మున్నగునవి జరుగుచుండెడివి. మదరాసు క్రైస్తవకళాశాలయందు మిల్లరు పండితునివంటి శిక్షావరునికడ నాలేండ్లు క్రమశిక్షణవడసిన యనంతరము గూడ శ్రీ నాయఁడుగారికంత నంతక్రమము తప్పినయభ్యాసముల నేలకలిగియున్నాయని వారిశిష్యవర్గమచ్చెరువందుచుండెడిది. ఈవిషయమున వారిశిష్యులు తమకుఁ దామే యిట్లు సమాధానము చెప్పుకొనుచుండిరి. నాయఁడుగారు బాల్యమును అలహాబాదునందు గడపుటచే

గాబోలు వారీరోగబీజములనచ్చటినుండి కొని తెచ్చియుందురని పల్కుచువారు ప్రేమయుట్టిపడునట్లు తమగురుదేవులగు నాయఁడుగారిని "అలహాబాదు నవాబు" అని పిలుచుచుండెడివారు. అలహాబాదు నవాబులు, నియమములను పాటింపనివారనుట జగద్విదితమేగదా! నాయఁడుగారి వస్త్రధారణ విధానముగూడ గొంతవఱకు వాలురనువారినట్లు పిలువఁ బ్రేరేచియుండును. ఆలస్యమునకు పుండిపడువారు సయితమానాఁడు తమకొకచక్కని యుపన్యాసమో, సద్బోధయో కావలసిన యెడల దానికిదగిన వెలచెల్లింపవలసిన దేయనియు, నాయఁడుగారిపట్లనట్టిమూల్యము సహనముతో వేచియుండుటయే యనియు దలంచుచుండిరి. శ్రీ నాయఁడుగారి మూర్తియందలి ప్రభావమే సమావేశమునకు హాజరైన వారిని వారు వచ్చువఱకు, యాలస్యమైనను వేచియుండునట్లుచేయఁగలైడిది. ఆలస్యముగా వేంచేసిన గురువర్యునికడఁగూర్చుండి విద్యార్థులు వారు పాఠములు చెప్పునప్పుడు కాలముమఱచి, యావేశముతో నుత్సాహముతో పాఠముల నేర్చుకొనెడివారు. సహజముగ నాటపాటలయందు విహరించుట కిష్టపడు స్వభావముకల విద్యార్థులుగూడ నాయఁడుగారు చెప్పు పాఠములను వినుచు, నొక్కొక్కపుడు రాత్రిసమయమున 10 గంటలవఱకు పాఠశాలయందే నిలిచిపోవుచు వారి యుద్బోధనలందలి మాధుర్యమును గ్రోలుచు దన్మయులగుచుండెడివారు.

శ్రీ నాయఁడుగారి గురుభక్తి యద్వితీయము. వారు తమగురువునగు' డాక్టరు మిల్లరుపండితుని పితృభక్తితో ప్రేమిం

చెడివారు. వారిపేర మదరాసు విశ్వకళాపరిషత్తు నందు "The ever increasing purpose of God" (పరమేశ్వరుని నిరంతరాధిక ప్రయోజనము) అను విషయముపై నుపన్యాసముల నిప్పించుటకుఁ బదివేలరూపాయల విరాళము నొసఁగిరి. విశ్వవిద్యాలయోపాధ్యక్షుల సమావేశమునకు హాజరగుటకు వారొకపరి నుత్తరహిందూస్థానమున కేఁగినపుడు, మిల్లరుపండితునిగూర్చి దరియాప్తుచేసి వారుకీర్తిశేషులయిన వార్తవిని వారి కుమారునిఁగలిసికొని యాగురుపుత్త్రినకుఁ గృతజ్ఞతాపూర్వకముగా చేతనైన సహాయ్యముజేసిరి. మఱియు "బందా" యను చోటఁ దాము చిన్ననాఁడు చదువుకొనిన పాఠశాలయొక్క ప్రధానోపాధ్యాయులగు బాబు దీననాథ బెనర్జీ వారి జ్ఞాపకార్థమేటేట సువర్ణపతకము నొసంగుటకయి యా పాఠశాలకొక విరాళమునొసగిరి. గురువుపంచజనకులలో నొకఁడగుట శిష్యులు గురువులను బిత్రుపాదులుగ నెంచి పూజించుట విధి యని హైందవ ధర్మమునుడువుచున్నది. శ్రీ నాయఁడుగారు బ్రాహ్మ మతావలంబియు, నవీన పూర్ణ విద్యాపారంగతులు నయిననునీపట్టున హిందూసాంప్రదాయమునే యక్షరముతప్పకుండ బాటించెననుట సంతోషదాయకము.

వారి విశ్వజనీనత మెచ్చదగినది. వారి గురుపుంగవులగు శ్రీ మిల్లరు పండితులవలె బ్రహ్మర్షి గూడ సంకుచిత శాఖాభిమానులును, కులతత్త్వాహంకారులును, స్వమతాభిమానులును గాక విశ్వమానవ సౌభ్రాతృత్వమే తమ పరమాదర్శముగా

నెన్నుకొనినారు. స్వధర్మనిర్వహణమునందు వారు వెనుదీసెడి వారుకారు. తమకు గల మతవిశ్వాసములను సుబోధకమగున ట్లెల్లరకుఁ జాటి ప్రతికక్షులవాదనలను సహేతుకముగ ఖండించుచుండిరేగాని వారెన్నఁడు నేవ్యక్తిని నిర్బంధించి బ్రాహ్మసమాజమున గలుపుకొనలేదు. స్వధర్మనిర్వహణాసక్తి వారిలో నెంతమెండో పరమత సహిష్ణుతగూడ నంతగాఢము. ఎవరి హృదయము వారిసొత్తు. ఆయా వ్యక్తులు దమ హృదయాధినాథులను దామే యెన్నుకొని వారి నారాధింపవలెను. అంతియేగాని యన్యులకు వారి హృదయములపై దురాక్రమణము సలుపుటకు హక్కులేదని బ్రహ్మర్షి నిశ్చితాభిప్రాయము. ఇందు కుదాహరణముగానొక చిన్న సంగతిజెప్పనఁజాలును. వారి దత్తసంతానసప్తకమునందిరువురు క్రైస్తవులయిరి. మిగిలినవారు హిందువుల నుద్వాహమైరి. ఆ బిడ్డల నెవ్వరిని వారెన్నఁడుఁ దమ మతమునవలంబింపవలసినదని యొకమాటయైన ననియెఱుఁగరు. ఇతరులకోమలహృదయములను, బాధించుట వీరెఱుగరు. అసంఖ్యాకులగుహిందూ, క్రైస్తవమహమ్మదీయస్నేహితులు వారికిగలరు. దీనికిఁగారణము వీరి సమానదృష్టియే. నిష్ఠగల పూర్వాచారబ్రాహ్మణులుగూడ వీరి సహనమునకు భక్తికిని మెచ్చి వినమ్రులయ్యెడివారు. వీరి మహోపన్యాసములవిని తమ మతము మార్చుకొనఁగోరు వారిని "విశ్వాసపూరితులైయుండుఁడు. మతమనునది నమ్మకముతోఁ గూడినది గాని యవకాశము దొరకినదని మార్చుకొనఁదగినది గాదని"

బోధించెడివారు. ఒకప్పుడు బ్రహ్మర్షి మిత్రులొకరు "యజ్ఞోప వీతమును విసర్జించుచున్నానని" లేఖను వ్రాయఁగా, వారు, "తొందర పడవలదు. యజ్ఞోపవీతముకంటె బలవత్తరమైన పాశము లెన్నియో నీయంతరంగమును బంధించి యున్నవి. ముందు వానిని ద్రెంచుటకు బ్రయత్నింపుము. తరువాత యజ్ఞోపవీతము దానంతటనదియే జారిపోవును" అని జవాబిచ్చిరి.

బాహ్యచేష్టలకును, గర్మకలాపములకును వారెన్నఁడు తావీయలేదు. అనవసర లౌకికకర్మల మతములోఁ జేర్చుట వీరికెంతమాత్ర మిష్టములేదు. నమ్మకముపై నాధారపడిన సంస్కరణల యందేగాని నాగరికతగల సంస్కరణములందు వారికి నమ్మికలేదు. వారిదృష్టిలో నందఱును సమానులే. వారెల్లప్పుడును సంఘశ్రేయముకొఱకు, సంఘజ్ఞానము కొఱకు, సాంఘికైకమత్యముకొఱకు భగవంతునెల్లప్పుడు నారాధించువారు. సామరస్యసూత్ర బోధకులగు "ఎమర్సను తత్త్వవేత్తయు విశ్వకవి రవీంద్ర చంద్రులును నిట్టి సహిష్ణుతా భావమునే ప్రదర్శించియుండిరి. ఇది యాదర్శవాదుల కుటుంబ లక్షణమేమో !

బ్రహ్మర్షి యహంకార మమకారములఁ బూర్తిగా మనస్సున వర్జించిన మహనీయులు. వారు నిష్క్రియులై కూర్చుండువారు గారు. పలువురతోఁ బలువిధముల మెలఁగుచుండెడివారు. హిందూ పత్రికను సాకల్యముగఁ జదివి యక్కడక్కడ గీతలుంచి, యుద్యోగములకొఱకుఁ బ్రయత్నించు

వారి కమూల్యమైన సలహాలను, నాదేశములను, సిఫారసులను జేయుచుండెడి వారు. నల్లులను, చీమలను, ఎలుకలను, ఉడుతలను, పక్షులను, పాములను గూడ వారు ప్రేమించుచుండిరి. వారన్నిటం బరమాత్మనే దర్శించుచుండిరి. కటికిచీకటిలో, నొంటరిగా, సర్పములు బాహాటముగాఁ దిరిగెడి సూర్యరాయ బంగళా యందు వారేకాంతముగనుండిరి. వారినిదర్శింప నేఁగు వారొక్కొక్కపర్యాయము రాత్రి పదిగంటలవేళ నొంటరిగా వారిసన్నిధానమునుండి పోవునపుడు గూడ నేరికి నేహాని జరిగినదని చెప్పవీలులేదు. మహాత్ముల సాన్నిధ్య భాగ్యప్రభావ మట్టిదే గదా!

వారు స[illegible]ములు, "[illegible]" అను సూక్తి బ్రహ్మర్షి పట్టున సార్థకమైనది.

వారి జీవితప్రభావమత్యద్భుతమైనది. నానావిధ విచారములతోడను, సంశయముల తోడను, బ్రహ్మర్షిని సమీపించువారెల్లరును దుఃఖసందేహ నిర్ముక్తులై మనశ్శాంతి ననుభవించెడివారు.

ప్రపంచమంతయు భగవానుని వసతిగృహము. సమస్త మానవకోటి యొక కుటుంబమునకుఁ జెందినదను మహోన్నత భావమే బ్రహ్మర్షి ప్రముఖసిద్ధాంతము. నిష్కామ క్రియ యనగా ప్రతిఫలాపేక్ష లేని పరోపకారచింత, సర్వభూత దయా భుత్వము పై యాదర్శమున కంటిపెట్టుకొని యుండుటచే నాత్మ సంస్కారము, దేశోద్ధరణము, లోకకల్యాణము లభింపఁగలవు.

విశ్వేశ్వరునిఁ దెలిసికొని యానందించుటయే ప్రతిభారతీయుని జీవితాదర్శము. అదే వారియాత్మబలము. ఆ యాత్మబలమే శాంతిని నెలకొల్పును. ఇట్టి యుదారభావములతో నిరాడంబరులయి, నైతిక, ధార్మిక మతాభివృద్ధిని బెంపొందించుటకుఁ గృషిసలిపిన ధీరోదాత్తుఁడు బ్రహ్మర్షి.

వారు వాస్తవముగ మతజీవి. వాస్తవముగ మతమనదేదియో, మతమునకు మూలసత్యమేదియో, మతములందలి విభేదములేల కలిగెనో గ్రహింపఁగోరి యా యామతములను వాని ప్రధానస్థానములందు వాని మాతృకలందే చదివి వారు గ్రహించిరి. ఇట్లు సర్వమతసారమును సంపూర్ణముగా నాకళించి సజీవవిశ్వాసమును, సహేతుకవిజ్ఞానమును సమన్వయించుకొని నవభారతపితామహుఁడగు రాజర్షి రాజారామమోహనరాయలవారి విశ్వజనీనమతమగు బ్రాహ్మసమాజమును త్రికరణశుద్ధిగా నాలింగనమొనర్చి నాయుఁడుగారు ప్రతిమాటలోను ఆలోచనములోను, ఉపన్యాసములోను, ప్రార్థనములోను బ్రహ్మధర్మమునకై, యభివృద్ధికై, ప్రచారమునకై పాటుపడియుండిరి. ఒకప్పుడొక బ్రాహ్మసమాజస్థుడు బ్రహ్మర్షిపై నలిగి బ్రాహ్మమతమును వీడెదననిపలుక "నీవు బ్రాహ్మసమాజమును, ధర్మమును వీడుదువుగాక! కాని బ్రహ్మనిన్ను వీడఁడుసుమీ" యని ప్రగాఢమైనపరమేశ్వర భక్తితో బదులు పలికిరి.

ఒక్కమాటలో శ్రీనాయుఁడుగారి జీవితచరిత్రము నంతయు జెప్పవలె నన్న వారు మహోదారవిశాలహృదయులు.

కనుకనే యితరులలో మంచియున్నను లేకపోయినను మంచి కలదనియే భావించునంతటి యమాయక హృదయము వారిది. ఇందుకుఁగారణము వారిహృదయము నైతికపథమునుండి యాధ్యాత్మిక పథమునకు నుత్తమగతి నధిరోహించుటయే. నియమబద్ధమైన ధర్మాచరణము గావించుటయుఁ దదుల్లంఘనమునకు శిక్షనొందుటయు, నైతికజీవన లక్షణము. ఆధ్యాత్మికజీవనమట్లుగాక మానవుని భగవద్ధ్యానమునకు బురికొల్పి విమోచనప్రాప్తికి మార్గముఁజూపును. మనమితరులను దయతో జూచిన నితరులును దయతో నుండగలర''ను ప్రాథమిక ధర్మసూత్రమే యీ హృదయసాధకులాచరించి సాధించినది, బ్రహ్మర్షి హృదయపరిణామవాది. ఈ హృదయపరిణామసాధన కేవారు దమప్రజ్ఞా విశేషములనెల్ల జ్ఞానమును వక్తృత్వముతో జోడించియు, హాస్యమునునగు మోముతో మేళవించియు, సంస్కృతిని భక్తితో జతపరచియు, జీవితమును ప్రేమతో నింపియు వినియోగించిరి.

నిక్కమాలోచింప శ్రీ నాయఁడుగారు తమ నిండుజవ్వనము నుండియే యొక మహాయోధులుగా తయారయ్యెనని చెప్పఁదగును. "నిర్మలవర్తనము గలిగియుండును. సత్యమే వచింపుము. దుర్మార్గమును జక్కఁజేయుము. రాజభక్తి ప్రకటింపుము'' అనెడి యుత్తమసందేశమును గ్రహించి యధర్మనిర్మూలనమునకయి బయల్వెడలిన యోధాగ్రేసరులు శ్రీ నాయఁడుగారు ఆయన సమస్త సాంఘికదౌర్జన్యములను ఖండించు

ఖడ్గము. సంఘముచే నణఁగఁద్రొక్కబడిన నిమ్నజాతీయులకుఁ, దలిదండ్రులులేని యనాథబాలబాలికలకు, విలపించు విగతభర్తృకలకు నభయ మొసంగు వజ్రకవచము. ఉత్సాహపూరితులగు వీరవరేణ్యుల వాస్తవప్రతినిధి. సాంఘికాభ్యుదయ స్థాపనసూచకమగు జయస్తంభము, సంఘమునందలి యపవిత్రత, దుర్నీతి, దేవదాసీత్వమునందలి వంశానుగతమయిన పశుప్రవృత్తి-యను ప్రబలశత్రు సంహారణమునకై యుద్యమించిన జైత్రయాత్రి వారిచరిత్రము. నిందర్యజాతులయు, నిమ్నజాతులయు సముద్ధరణమునకయి వారు బద్ధకంకణులయి పరిశ్రమించిరి. నిర్బంధ వైధవ్య బంధములనుండి విడిపించి చాల వితంతువులకు బునర్వివాహసౌకర్యములఁ గలిగించి, వారు సుఖముగ గౌరవజీవనములు నెఱపుటకయి శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులు గారు ప్రారంభించిన యుద్యమమునకు శ్రీ నాయఁడుగారు నిండు మనంబుతోఁ జేయూఁతనిచ్చి యండగానుండి, వారికి మెండుగ సాయమొనర్చిరి.

పరమేశ్వరుని శక్తియనదగు విశ్వకర్మ సామాన్యపదార్థములను సృష్టించుచు మధ్యమధ్య నెన్నఁడెన్నఁడో యొకమహాపర్వతమునో, మహానదినో కల్పించుచుండుననియు నావిధముననే మానవులలోఁగూడ నొక్కొక్క లోకోత్తరు నుద్భవింపఁ జేయుననియు నొక తత్త్వవేత్త వ్రాసియున్నాఁడు. బ్రహ్మర్షి యట్టివారు.

బ్రహ్మర్షి తమజీవితమునెల్ల శాంతముతో భరించి, కృతజ్ఞతతో ననుభవించి, పవిత్రతోన్నతముగావించి శాశ్వత

విలసిత మొనర్చిరి. వా రీప్రపంచమున నున్నంతకాలము "నేను సముద్రమును జొచ్చునపుడు వెనుకనున్నవారు నాకయి విచారింపకుందురుగాక !" యనువాక్యమును జిహ్వాగ్రమునుండి సంతతము వెలువరించుచుండిరి. తమ జీవితనౌకనునడపు నావికునితో, (పరమేశ్వరునితో) ముఖాముఖిగ నిలుచుటకయి వారికిఁగల తృష్ణ నిది ప్రకటింపఁజాలును.

ఇటువంటి దివ్యపురుషుని, మహాత్ముని నాంధ్రదేశము నకుఁ బ్రసాదించిన పరమేశ్వరుని కరుణాప్రసాదములను మన మెల్లప్పుడు కృతజ్ఞతతోఁ గొనియాడఁదగును. వీరిప్రభావము దేశమున నల్గడల, నెల్లతావులకెప్పుడును, బ్రకాశమును బఱపి, యుత్తేజమునుగూర్చి వానిని బవిత్ర మొనర్పఁగలదు.

"అహింసా సత్యమక్రోధః త్యాగశ్శాంతి రపైశునమ్
దయాభూతే ష్వలోలత్వమ్ మార్దవం హ్రీరచాపలమ్"

ఇవి దైవాంశసంభూతుల లక్షణములు. బ్రహ్మర్షి యందు గోచరమగుచున్నవి. అందుచేత వారు బ్రహ్మర్షి బిరుదమునకు సర్వవిధముల నర్హులు.

---

## 31. సూక్తి ప్రసూనములు

వారి దివ్యజీవనమే యొకానొక సుదీర్ఘమనోహర ప్రార్థనాగీతముగా నుండెడిది. మఱియు వారి యుచ్ఛ్వాస నిశ్వాసములలోఁగలిసియాత్మను బునీతమొనర్పు భగవదాస్తిక్యబుద్ధియే వారి రూపమున మూర్తీభవించియుండెను. వారు మానవునకు

భగవంతునకుఁ గలసంబంధ మీవిధముగాఁ దెల్పుచుండిరి. "మహర్షు లీశ్వరుని సర్వాంతర్యామిగా వర్ణించుచో వారు దేవుని విగ్రహాకృతుని గావించి దుర్గప్రాకారములలో బంధించి మన దైనిక జీవనము నుండి వేఱుచేసి మూసియుండలేదు. భగవంతుఁడు మనసర్వోత్సాహ కృత్యములలోను మనలననుసరించి, వెంబడించి, పురోగామియై మనల దనకృపాలింగనములచే జ్ఞానవంతులఁ గావించుచు నేయున్నాఁడు. మన ప్రతిహృదయ స్పందనములోను, కనుమూఁతలోను, జిహ్వాచలనములోను, మానసికానుభూతిలోను, నరముల కదలికలోను, వాంఛా పరిమళములోను, సౌందర్యాకర్షణములోను నిశ్చయాభిప్రాయములలోను, ఆత్మోద్దేశములలోను-వేయేల యన్నిటియందు నాయీశ్వరుఁడే యుద్రేకియై యుపయుక్తుఁడై, భావజనితుఁడై, బహిర్గతయత్నమై, విశ్వాసరూపియై, హాసమయాశీర్వాదమై మనలోనే యుండును.

ఈశ్వరారాధన విషయమున వారుపలికిన వాక్యములను వినుఁడు. "దైవస్వరూపమునందలి కోరికలోనే దైవారాధన భాసిల్లుచున్నది. భగవదంశగాఁ బరిణమించుటకూడ నారాధనా విశేషమే. భగవంతుఁడే యీ ప్రబలాధ్యాత్మిక వాంఛను మనలో నిహితమొనర్చినాఁడు. ఆవిషయమున మీ రెంతమాత్రము లజ్జింపనవసరములేదు. ఆరాధన మానవకృతమైన సంస్థారూపముగా మీ రెన్నఁడును భావింపకుఁడు. ఆరాధన మీపైబలవంతముగా మోపఁబడిన విధిగాఁదలఁపకుఁడు. ఆరా

ధన లాభదాయకమగు కృత్యముగాఁ బరిగణింపకుఁడు. అది దేవమానవుల మధ్యనుండెడి యొకానొక ధారాళసమాధానము మాత్రమే. ఏలయన భగవంతుఁడు మానవుని మనఃపూర్తిగాఁ తనయాత్మ శిశువుగనే వాంఛించు చుండును.

అంతరాత్మ విషయమున వారియమృత ఘుటికలివి. "బలిష్ఠమైన యంతరాత్మ మానవునకు స్వర్గదత్తమైన యొకయుత్తమ వరము. అది మానవ సంబంధకములయిన సత్యౌదార్యపూరిత భావనల నుద్దీపింపఁజేయు ధృవనక్షత్రముగాను, శక్తిధామముగను బరిణమించి జీవననౌకను గ్రమమార్గమున నడిపింపఁగలదు. నీవు నీయాత్మను ధృవనక్షత్రముగా నొనరించి యది మార్గదర్శికాఁగా నీజీవిత నౌకకుఁ గర్ణధారివైనచోఁ బ్రాపంచకానుభవము లను తిమింగిలములను ఘనపర్వతములను గడచి పారముచేరఁగలవు. ఆబలిష్ఠాంతరాత్మ ప్రగాఢము, సత్యపూరితము, భగవంతునియెడ సోదర మానవులయందుఁ జూపు నిష్కల్మష ప్రేమసాధన వలన మాత్రమే లభింపఁగలదు."

నైతిక ప్రవర్తన విషయమున వారు పల్కిన పల్కులివి. "నీవు నైతికమార్గము నవలంబించినచో విశ్వము నీకు విధేయముగా నుండఁగలదు. నైతికపథమును నీవెప్పుడు ల్లంఘింతువో యప్పుడు విశ్వశక్తి నీకెదురు తిరిగినదని భావింపుము. విశ్వమానవ వ్యవస్థయందు నైతిక ప్రవర్తనా విధానమే స్థిరముగా నెలకొని యున్నదని గ్రహింపుము. వ్యోమమార్గము నుండి సూర్యునైనను దొలగింప వచ్చును గాని విశ్వాంతరాళము

నుండి నైతిక ప్రవర్తనను మాత్రము నీవెన్నటికిని దొలఁగింపఁ జాలవు

ఈశ్వరార్చనా ఫలమును గూర్చి వారీ క్రిందివిధమున దృష్టాంత రూపముగఁ దెలియఁజేసిరి. ఒకప్పుడు నాయఁడుగారి పుత్రిక వారిని గూర్చి యేదో పరుషముగా మాట్లాడెను. అప్పుడా బాలిక నాయనమ్మగారు "మీతండ్రినినీవిట్లనవచ్చునా" యని యడుగుటయు నాబాలిక తడవుకొనకుండ "ఆ. అందును! ఎవరికోసరమని. నేననిన మాటలు మానాన్న యనుభవింపఁడూ- బాబయ్య కాఁడూ మఱి. అందుచే నే నన్నిన మాటల న్నియు మానాన్న పడవలసినదే." యని జవాబిచ్చెను. ఈ బాలిక నోటవెలువడిన యమాయకపు మాటలలో నెంతయో సత్యమిమిడియున్నది. జగత్పిత యగు భగవంతుఁడాతని బిడ్డల మగు మనముచేసిన తప్పులన్నిటిని సైరించి మనవాక్పారుష్య మునకుఁ గోపగింపక మనలను దయతోఁ జూడవలసినదే. ఇదియే యీశ్వరార్చనా ఫలము.

ప్రకృతిమాత యిచ్చిన యాహారపదార్థములఁ గూర్చి యీ చిన్నకథను శ్రీనాయఁడుగారు చెప్పుచుండిరి. ఐదేండ్ల వయస్సుగలవారి పెద్దమేనగోడలు తల్లియొడిలోఁ గూర్చుండి పాలుత్రాగుచున్న తనచిన్నచెల్లెలిప్రక్కనే కూర్చుండెను. అవి మామిడిపండ్ల రోజులగుట, నొక మామిడిపండు చప్పరించుచు, రసమును లోనికిఁ బీల్చి సంతోషముతో "చెల్లియమ్మ దగ్గఱఁ బాలు త్రాగినట్లే యున్నది" అని పలికెను. ఈ విషయము జ్ఞప్తికిఁ దెచ్చుకొని నాయఁడుగారీచిన్నబిడ్డ పలుకులలో నెంతోసత్యముగలదని మనమందఱము ప్రకృతియను దివ్యమాత యిచ్చిన యాహారపదార్థములను స్తన్యమును గ్రోలుచుండుట లేదా"యని తన్మయత్వము చెందుచుండెడివారు.

వీనిని మించిన సుభాషితరత్నములను ప్రార్థనావళు లను వారి గ్రంథములనుండి యెన్నియేని తీసికొనవచ్చును. కార్లయిలు వచించినట్లు "మహాపురుషజీవితము దైవదత్తమైన యమూల్యవరము." వరప్రసాదులలో నాయఁడుగారొకరు. ఆంధ్రదేశమునఁ బుట్టి యావద్భారత మాతృగర్భమున వారు రాజకీయరంగముసను, మతసాంఘిక సేవలలోను, పతిత దీన మానవ సంరక్షణోత్సాహములలోను, దమశక్తిదీపికల ప్రజ్వ లింపఁ జేయుచు విలసిల్లిరి. సహజౌదార్యపూరితమైన వారి మధురజీవనచరిత్ర పుష్పసౌరభము చిరకాలము దుఃఖార్తుల హృదయముల వెల్లిగొనినట్లు అగమ్యమార్గముల బ్రయాణించు పాంథుల కుజ్జ్వలకరదీపికగాఁ బరిణమించునట్లు వారు తమ కీర్తి నవశేషింపఁ జేసి పరంధాముని సన్నిధి కేఁగిరి.

---

## 32. బ్రహ్మర్షి జీవితసందేశము.

ఆంధ్రభూమిని స్వర్గభూమిగఁ జేయు బ్రహ్మర్షి వేంకట రత్నమునాయఁడుగారి సామరస్యవిధానమే యశేషాంధ్రప్రజా నీకమునకుఁ గళ్యాణసందేశమైనది. హిందూ బౌద్ధ, క్రైస్తవ, మహమ్మదీయాది మతములకుసామరస్యము, ప్రాక్పశ్చిమనాగ రకతలకు సామరస్యము,భూతభవిష్యద్వర్తమానకాలములకు సా మరస్యము, హేతువాదవిశ్వాసములకు సామరస్యము, రాజకీయ సాంఘికధార్మికాదివిషయములకు సామరస్యము ఇట్లు సమస్తవి షయములలోసామరస్యమావశ్యకమనిగ్రహించి లోకమున కుప దేశించి సామరస్యకల్యాణసందేశమును వినిపించి యాంధ్రప్ర పంచమునకంతకుశాంతిదూతగా వారు బరిగణింపఁబడినారు. వారి యుపాసనామందిరము కులమతభేదములతో హిందూ దేవాలయ

ముకాని, మహమ్మదీయుల మసీదుకాని, క్రైస్తవుల చర్చికాని కాదు. అది నిర్మలమై, మహోన్నతమై, నిరాడంబరమై, యెల్ల ప్పుడు తెఱువఁబడిన ద్వారములుగలిగి యన్నిజాతులవారికి నన్నికులములవారికి స్వాగతమిచ్చి, సత్యము, ప్రేమ, శాంతి, ఋజుప్రవృత్తుల కాలవాలమైన దేవాలయము. ఇట్లు సంగమ సంస్థను మూఁడువందలేండ్లకు ముందే అక్బరుపాదుషా స్వప్న ములోఁగాంచినట్లు టెన్నిసన్ మహాకవి యాలాపించెను. ఆ యవ్యక్తస్వప్నమే రామమోహనుని భావనాదృశ్యమైనది. దానిని తీర్చిదిద్ది బ్రహ్మర్షి కాకినాడపురమున బ్రహ్మోపాసనా మందిరముగా బ్రభవింపఁజేసినారు. విశ్వమానవకోటియంతయు నైక్యభావముతోఁ బరమేశ్వరుని నిండు మనముతో బ్రేమింప వలెనని వారి దివ్యమతసందేశము. ఈశ్వరారాధన ప్రతిమానవునకు జన్మతో సంక్రమించిన హక్కని వారియుద్దేశము. ఇట్టి యుదాత్తహృదయవైశాల్యమునకు, నౌదార్యమునకు, సమన్వయకాంక్షకు మూలకారణ మాయన స్వాతంత్ర్యేచ్ఛయే యని చెప్పకతప్పదు.

శ్రీ టి. యల్. సాధువాస్వాని మహాశయులు వ్రాసిన యీ క్రింది వాక్యములనుజదివిన బ్రహ్మర్షి సందేశము వ్యక్తము కాఁగలదు. "సర్. ఆర్. వేంకటరత్నము ముఖ్యముగా దైవ ప్రార్థనా పూరితాత్మకుఁడయిన మహాపురుషుఁడు. మానవజీవితముయొక్క పరమ ప్రయోజనముల విలువను, ఆంతర్యమును మతమును నది యాయనకు లెస్సగా నవగతము గావించినది. ప్రాచీనుల విజ్ఞానమును ధారాళముగఁ బ్రతిభాయుతముగ బోధ గావించు నిట్టి యధ్యాపకశిరోమణి గురుదేవుని శుశ్రూషను సాన్నిధ్యమును బడయఁగలిగిన యాంధ్రయువకులు ధన్యులు ఈ మహనీయుని జీవితములోఁ బావనత్వము భగవత్ప్రార్థన

ముతోడను, నీరెండును ప్రజాసేవనముతోడను సమ్మేళన మొందినవి. తల్లిదండ్రులు లేనిపిల్లలకు, అనాధలయిన వితంతువులకు నాయన సంరక్షకుఁడు. బీదలకు, దుర్బలులకు సహాయుఁడు. మాటలలోఁ, గ్రియలలోఁ, బ్రార్థనములలో, నాశయములలోఁ నాయన పరమేశ్వరుని సర్వవ్యాపకత్వమునకు, మానవలోకము యొక్క యేకత్వమునకు, సర్వమతభ్రాతృత్వమునకు, ఋషుల యేకకుటుంబత్వమునకు, ప్రేమైకరాజ్యమునకు సాక్షీభూతుఁడుగ నలరారెను. కళాశాలాప్రధానోపాధ్యాయుడుగా, ప్రవక్తగా నీ మహాత్ముఁడు ప్రాచీనకాలమున, భారతదేశమున ఋషిసత్తములు తమయాశ్రమములనుండి ప్రసరించిన పరంపరానుగత విజ్ఞానమును నలుదెసలఁ బ్రకాశింపఁజేసెను. ఆయన మృతుఁడు కాలేదు. కాంతిమంతమగు వారియాత్మ నక్షత్రమువలె వెలుఁగు తావునకాయన వెడలియున్నాఁడు. ఆయన యైహికజీవన మాంధ్రదేశమునకే గాదు, దక్షిణ భారతదేశమునకే గాదు, భారతజాతి కంతటికి లాభకరమై వన్నెకెక్కినది. నవీనభారత మందలి యొక మహర్షిగా వారిని నేను సంభావించి నమస్కరింతును.

చరితార్థమగు శ్రీ నాయఁడు గారి జీవితము నుండి మనము నేర్చుకొనఁదగిన విషయ మొక్కటే. దేవుడొక్కడే జగత్పిత. రాజ్యమొక్కటే, స్వర్గరాజ్యము. ఆస్వర్గ రాజ్యమునకు బాట విశ్వమానవప్రేమ. మానవ ప్రేమ సేవలచేతనే యాధ్యాత్మికధ్యానసంపత్తి లభించును. దానిచే మనమిహపరముల రెంటను సాధింపలేని దేదియు లేదని యా యమరజీవి యమృతసందేశము.

---

# సవరణలు.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| మున్నుడి | 4 | దన | దీన |
| 11 | 1 | బ్రేమ | ప్రేమ |
| .. | 13 | తొలఁగించు | దొలగించు |
| 12 | 16 | బ్రభుత్వము | ప్రభుత్వము |
| 15 | 5 | ఁదల్లి. | తల్లి |
| ,, | 12 | ల భక్తి | యెడభక్తి |
| 16 | 14 | దోడనే | తోడనే |
| 19 | 13 | యాధ్యాత్మిక | నాధ్యాత్మిక |
| 20 | 17 | అక్రూర | అక్రూఱ |
| 23 | 18 | చిరుత | చిఱుత |
| 27 | 15 | నిష్టాగోష్ఠి | నిష్టగోష్ఠి |
| 30 | 11 | నాగఁకత | నాగరకత |
| 32 | 7 | పుతరత్నము | పుత్త్రరత్నము |
| 41 | 4 | నీతివంతు | నీతిమంతు |
| 41 | 8 | రా ఛకీయ | రాజకీయ |
| 49 | 12 | లకు | లగు |
| 50 | 5 | వీరన | వీరని |
| 50 | 14 | అనుగుణ్యాము | అనుగుణము |
| 51 | 6 | వాక్స్రరులు | వాక్ఛరులు |
| 59 | 4 | పంకిలము | బంకిలము |
| 63 | 7 | చండ | ఛండ |
| 66 | 12 | గాడాంధ | గాఢాంధ |
| 69 | 15 | చారిత్రము | చరిత్రము |
| 72 | 4 | పావిత్ర్యము | పవిత్రత |
| 86 | 11 | నాయము | యాయము |
| 87 | 6 | నే కాంత | యే కాంత |

| | | | |
|---|---|---|---|
| 89 | 17 | రాక | గారాక |
| 93 | 10 | జెప్పాట | చెప్పాట |
| 101 | 17 | డి కావు | డివి కావు |
| 119 | 8 | శ్రీ కో కా వేంకట సుబ్బా | శ్రీ డాక్టరు వేమూరి రామకృష్ణా |
| 119 | 10 | డాక్టరు రామకృష్ణ రావు పంతులు | శ్రీ దివాను కో కా వేంకట సుబ్బారావు నాయఁడు గారు |
| 122 | 5 | సహజజౌదార్య | సహజౌదార్య |
| 125 | 2 | కేఁద్ర | కేంద్ర |
| 133 | 16 | ప్రధమ | ప్రథమ |
| 178 | 8 | దానినిదానిని | దానిని |
| 197 | 1 | బ్రహా | బ్రహ్మ |
| 197 | 6 | శ్రీ నాయఁడు గారి | శ్రీ నాయఁడు గారు |
| 198 | 10 | ద్రోణడు | ద్రోణ[illegible] |
| 204 | 12 | దానియుదృత | దానియుద్ధృత |
| 205 | 19 | రెక్కలు | ఱెక్కలు |
| 212 | 5 | స్మరగోత్సవము | స్మరణోత్సవము |
| 214 | 4 | వినియ | వినయ |
| 214 | 5 | భూష | భూషణ |
| 221 | 2 | మత్యుత్న | మత్యున్నత |
| 224 | 11 | యరబ్సీ | యరబ్బీ |
| 226 | 7 | భాత్ర | [illegible]ాత్ర |
| 228 | 22 | జిహ్వా | జిహ్వా |
| 230 | 12 | యున్నంత | యు నంత |
| 231 | 22 | మదరాసు | 1917 సం॥న మదరాసు |
| 232 | 5 | 1917సం॥న | డిలీటు |
| 243 | 20 | స్త్రీజననము | స్త్రీ జనము |
| 250 | 23 | బరిగణింప | పరిగణింప |

తనువును, మనమును, ధనమును
ననయముఁ బరమేశ్వరునకు - నర్పణము జే
సిన దీనావను, బ్రహ్మ
ర్షి నెపుడు బుధవర్యు లెల్లఁ - బ్రేమింపఁ దగున్॥